శ్రీ మహాగణాధిపతయేనమః

శ్రీ సరస్వత్యైనమః

శ్రీదత్తాత్రేయమహాగురవేనమః

# శ్రీ గాయత్రీ విలాసము

శ్లో॥ యాశ్ఛందసా మృషభో విశ్వరూపం
ఛందోభ్యో ధ్యమృతాత్సంబభూవ
సమేంద్రో మేధయాస్పృణోతు
అమృతస్య దేవధారణో భూయాసం.
శరీరంమే విచర్షణం జిహ్వామే మ
ధు మత్తమా। కర్ణాభ్యాం భూరివిశ్రువం
బ్రహ్మణః కోశోసి. మేధయాపిహితః
శ్రుతంమే గోపాయ

శ్లో॥ త్రిపురా గాయిత్రీ విద్యావేద్య-చిచ్ఛక్తి విగ్రహం-
వస్తుతశ్చిన్మాత్రరూపం. పరతత్త్వం భజామ్యహం

శ్లో॥ ఓం. నమః కారణానంద రూపిణీ పరచిన్మయీ
విరాజతే జగచ్చిత్ర చిత్రదర్పణరూపిణీ
శ్రుతంక్వచిన్నారదై తత్సావధానే నచేతసా, మహాత్మ్యం
గాయత్ర్యాఖ్యానసాయ, యచ్ఛ్రుతిః పరసాధనం

[illegible] ఓంకార శబ్దవాచ్యమైనట్టియు. చిత్ర విచిత్ర ప్రపంచ సృష్టికి ఆధారమైనట్టియు. త్రిమూర్త్యాదులను కాలాను సారము సృజియింప దగినట్టియు. సచ్చిదానంద రూపయగు గాయత్రీ పరదేవతకు నమస్కరించి, హరితాయన మహాఋషి నారదున కీవిధముగ చెప్పెను. ఓ నారదా! పూర్వకాలమున శ్రీ దత్తాత్రేయులు ఉపనిషద్వాక్యార్థములను శైవ పాంచరాత్ర శాక్త్యాది తంత్రములను చక్కగా విమర్శించి, త్రి విధ దేహములకు నాధారమగు గాయత్రి విలాసము త్రిపురా రహస్యమను పేర పరశురామున కుపదేశింప బడియున్నది. అందు జ్ఞానఖండము. జిజ్ఞాసులగు మానవులకు మోక్షప్రాప్తికి ముఖ్య సాధనమగు చున్నది. ప్రమాణాను గుణ్యమగు ఈ జ్ఞాన రహస్యమును సద్గురువు వలన సాదరముగ శ్రవణ మననాదు లొనర్చిన మానవుడు జరామరణాది దుఃఖ జనిత సంసారమును తరించి స్వస్వరూపాను సంధాన పరుడై మోక్షసిద్ధి గాంచగలడు.

ఈ జ్ఞాన రహస్యమును సద్గురువుచే బోధింపబడి. శ్రవణమనవ నాదులొనర్చినను జ్ఞానోదయముగాని మూఢునకు పర శివుడు సాక్షాత్క రించి బోధించినను తరింప చేయజాలడు. అట్టి లోకోత్తరమగు యీ జ్ఞానరహస్యమును తీవ్రమోక్షేచ్ఛగల నీకు బోధించెద సావధానముగా నాకర్ణింపుము.

ఈ విధముగా దత్తాత్రేయులు బోధించిన జ్ఞాన రహస్యమును తీవ్ర మోక్షేచ్ఛగల పరశురాముడు: శ్రద్ధా భక్తులతో శ్రవణ, మననాదులొనర్చి అతిశయించిన సంతోషముతో పరవశుడై ఆనంద బాష్పములంకురింప, తన యానందమును భరింపజాలక తన్మయుడై, శరీరము పులకరింపగా, గురువులకు, సాష్టాంగ ప్రణామము లాచరించి గద్గద స్వరముతో విన్నవియె——

దత్తగురో! సద్గురువు సంతుష్టుడగునేని బ్రహ్మపదముగూడ. సరి సులభమగుననియు, మృత్యువాత్మానందమగుననియు: శాస్త్రములు చెప్పుచున్నవి కావున. ఆనందభరితులగు తమ కటాక్షముచే ధన్యుడనైతిని గాని మఱియొక తరితాము స్వయముగ నుపదేశింపవలెనను వాంఛగల నాకు. గాయత్రీ యుపాస నాక్రమమును. దయతో శలవిండని కోరగా. పరశురాముని శ్రద్ధాభక్తులకు సంతోషించి, గురుదత్తాత్రేయులు, పరశురామునకు ఉపాసనా సహితమగు గాయత్రీ దీక్షనిచ్చెను——

మంత్ర యంత్ర. విధులయందు రచనా విధానమగు పూర్ణజ్ఞాన సహితమై, సర్వోత్తమమగు నీ దీక్షను, గురు ముఖాబ్జము నుండి. మధుకరము మకరందమును గ్రహించినట్లు, జ్ఞానామృతమును. గ్రహించి పరశురాముడు తృప్తినొంది. గురువనుజ్ఞ బడసి. మహేంద్ర పర్వతమునకు బోయి, యచ్చట నొక పర్ణశాల నిర్మించుకొని. యమ నియమాదులు గలవాడై. పండ్రెండు వత్సరములు, గాయత్రీ దేవి నారాధించి. నియమానుసారము, జపాది, నిత్య, నైమిత్తిక, కర్మలను జేయుచుండెను——

ద్వాద శాబ్దములు గడచిన తర్వాత, యీవిధముగ నాలోచించెను పూర్వకాలమున ఆ వధూతాగ్రణియగు, సంవర్తకుని జగన్నిర్మాణమును గురించి ప్రశ్నచేసినప్పుడు, వారు చెప్పిన త్రిపురా రహస్యము నాకు సక్రమముగ బోధపడలేదు.— ఆదియందీ జగత్తు యెవరి యందు! యెవిధముగ. యెవరివలన సృజియింపబడినది? ఎచ్చట నునికిగలదగుచున్నది యెచట లయమగుచున్నది! యెంత విచారించుచున్నను తెలియుటలేదు. ఈ జగత్తుయొక్క వ్యాపక మస్థిరముగ దోచుచున్నది——

ప్రతివ్యక్తియు దాను సంపాదించు సర్వవిషయములు శాశ్వతము లనియు, తన తదనంతరము తన పుత్ర పౌత్రాదులనుభవించెదరను నమ్మకముతో, సంపాదించ దగినట్లు భ్రమకిలగుచున్నది. గాని విచారించిన యెడల, బాల్యమునందును. వయఃకాలమందును. వార్ధక్యమునను నిర్మించిన కార్యములెల్లను. అస్థిరములను, అప్రయోజనములగుచున్న వి–అవిధముగానే. అవస్థలను. అందలి వ్యవహారములను, అస్థిరములగుటచే జీవితాంశమగు జగద్వ్యాపారము, అజ్ఞాన సహితమగు, అంధకారమగుచున్నది. గాని శాశ్వతిమైనట్లు తోచుటలేదు. ఈవిథముగా లోకమెల్లను అజ్ఞానాంధకారమునందొకరివిచూచి, మరియొకరు ప్రవర్తించుచు. సంసారచక్రమున జిక్కి పరిభ్రమించు చుండెదరు——

మాయా కల్పితమగు జగత్తునందు ప్రతిమానవుడును. పూర్వవాసననుసరించి, నాయాకర్మలను జేయుచు. నాయాఫలములను బొందుచు, సుఖించు చుండువేకాని, నిత్య సుఖమెరుగజాలరు. ఎప్పుడు సత్యాన్వేషణము గలిగి నిత్యఫలము లభించునో యప్పుడు. యనిత్యసుఖముల కొఱకు యాచించ నవసరముండదు ; అనిత్యవిషయముల యందు సంకల్పమున్నంతవరకు దుఃఖనివృత్తి కాజాలదు. నిత్య సుఖముకలుగదు.

కామ సంకల్పము వలన కలుగు సుఖము నిత్య సుఖముకాదు; అగ్నిచే. అవయవములన్నియు దగ్ధమైనపుడు పాదమునందు మాత్రము మంచి గంధము పూయుట.చేతను–రొమ్మున వాడిగల బాణము, బలముగ నాటునపుడు, అప్సరస కౌగిలించుకొనుట చేతను–క్షయరోగ పీడితునకు గాన శ్రవణము చేతకలుగు సుఖమువలెను. అస్థిరములగు కామ సుఖములు విరసములగును. నిత్యమగు ఆత్మానంద రసమగ్నులగు మహాత్ములకే

శాశ్వత సుఖము లభించగలదు—

కార్య కారణముల యందు కర్తృత్వాద్యభిమానము గలవానికి, కార్యసిద్ధి లభించినను సుఖముండనేరదు. అట్లుండునని తలచిన యెడల, కొరత వేసిన వానికి మెడయందు, గంధ మాల్యాదు లుంచిన యెడల సుఖముకలిగి యుండవలెను, అట్లు సంభవించుట లేదు—కర్తవ్యాభిమాన మున్న యెడల, నాత్మానంద సుఖమున్నదనుట అజ్ఞాన జనిత భ్రమయగును చక్రవర్తి పరరాష్ట్రము కొరకు, భిక్షువు అన్నవ వస్త్రముల కొరకును కర్తవ్యముచే ప్రయత్నించు చుందురు, నీ యుభయులకు వాంఛ వేరు వేరుగ నున్నను, నయ్యదిగలిగి నప్పుడు సంతోషము సమానముగా నుండిటచే తాము ధన్యులమని సంతసింతురుగాని శాశ్వతానందమును పొందలేరు—

ఈ విధముగ విషయ సుఖముల వలన ఫలమేమి? దయాస ముద్రుండగు గురువువద్దకు పోయి, గురూపదేశమను నావనెక్కి, సంశయముల నెడిసముద్రమును దాటెదనని నిశ్చయించి, పరశురాముడు, మహేంద్ర పర్వతము నుండి, గంధమాదన గిరికేగి, భూలోక సూర్యుని వలె ప్రకాశించుచున్న గురుదత్తాత్రేయులకు సాష్టాంగ దండ ప్రణామము చేయగా, దయాసముద్రుడగు దత్తాత్రేయులాతనిని దీవించి, క్షేమమడిగి, సాన్నిధ్యము నందు భిక్షాసనమున గూర్చుండ నియమించగా, గురుదేవత కతడు మరల నమస్కరించి, ఓ గురునాథా? చంద్రమండలమునందు ప్రకాశించుచున్న కిరణములవలె, సంసార తాపము నివర్తింప చేయతగిన, శీతల కృపామృత సాగరమున విహరించుచున్న నాకెట్టిబాధలుండ జాలవు—

బాహ్యాభ్యంతరముల యందు, సదానందము గలిగియున్నను, మీ పాదసేవ సదాలభించ లేదనువిచారము యిప్పుడు తీరుటచేత కృతార్థుడ నైతిని ఐనను ప్రకృతి సంభవమగు సర్వసంశయములు నివర్తింపగలవని బహుకాలమునుండి వేచియున్నాడను. అర్హత గలవాడనైతినేని, నా సందియములను దీర్పుమని కోరగా—భార్గవునితో దత్తాత్రేయులిట్లనిరి—

ఇది ప్రథమాధ్యాయము



## - ద్వితీయోఽధ్యాయః -

భార్గవుడు దాత్తాత్రేయులకు నమస్కరించి, తన సంశయముల చెప్పుటకారంభించెను. ఓ గురునాథా! పూర్వకాలమున యీ పృథ్విచే క్షత్రియుల నెల్ల నిరువదొక్క మారు వధియించి, వారి రక్త ధారలచే పితృ దేవతలకు తర్పణముగావించి, వారి వలన శాంత చిత్తుడనైతిని. కొంతకాలమునకు అయోధ్యా పురమున అజేయుడగు శ్రీరాముడు పరిపాలించెనను వార్తవిని, అతని మీదకి దండెత్తి వెడలి యుద్ధమున, శ్రీరామునిచే పరాజయమును పొంది దుఃఖముచే వెడలుచున్ననాకు, సామాన్యునివలె ప్రవర్తించుచున్న సంవర్త కావధూతను జూచితిని, ఆ మహాత్ముని దర్శనము వలన మంచుగడ్డ సూర్యుచె తపను తగ్గునట్లు. నా విచార తాపము తగ్గి, నిత్య సుఖానంద ప్రాప్తి సాధన ముపదేశింపుమని ప్రార్థింపగా పెరుగును తరిచి వెన్నను సమకూర్చినట్లు, యాసాధు పుంగవులు శాస్త్రార్థసారము, పవిత్రమగు జ్ఞానామృతమును నాకు బోధించిరి గాని, చలిత మానసుడగు నేను యాజ్ఞానరహస్యమును గ్రహింపలేక, సంశయముగలవాడనై మరల చెప్పుమని కోరగా, వారు దయార్ద్ర దృష్టిచే యాలోచించి తమ యొద్దకు వెళ్ళుమని యానతిచ్చిరి——

దేహధారియు, చిద్రూపిణియగు త్రిపురాంబ, సదాచిత్తమునందు ప్రసన్న వదనయై ప్రతిఫలించినప్పుడు, యుపాసనాదులెల్లను, పిష్టపేషణ న్యాయమగుచుండును. వస్తు తత్వము సంపూర్ణముగ తెలియక చేసిన యుపాసనలెల్లను, వృధాయగుచుండును గాన, ఇంత వరకు సంవర్తకావధూత యుపదేశించిన, రాజగుహ్యమును స్వాంతముగ తెలియునట్లు

పదేశింపకోరెదను. మరియు యింతవరకు నాచేజరుపబడిన, యజ్ఞముఃచేత దేవతలకును, మృష్టాన్నములచేత బ్రాహ్మణులకును, నివేదించవడిన కర్మ సంభవమగు ఫలము వెల్లను అల్పములనియు. శాశ్వత ఫల దాయకముగా దానియు. సంవర్త కావ ధూత వలవ విని యుంటుని, అల్ప సుఖము దుఃఖదాయ్యమని నిశ్చయించెద-అదెట్లన, ప్రస్తుత సుఖమని తోచు యింద్రియ సుఖములకు విఘ్నము పంభవించునప్పుడు దుఃఖము భారమగును-పుర్షార్థత్రయముల వలవ సంభవమగు సుఖమెల్లను అల్పమేగాని. శాశ్వతము గాదు గావున. యట్టు యల్ప సుఖము దుఃఖముగాని, సుఖమనతగదు

పూర్వము తాము బోధించిన యారాధన, ప్రమాణ భేదము చేతను మహార్షుల మత భేదమునను. మరి యొక విధమున చేయ వచ్చును గాని, ఆరాధన లెల్లను మనోకృతములగుటచే. యజ్ఞాది కర్మలవలె నశ్వరములగు చున్నవి, గాన అందు వలన నిత్యసుఖము లభించదని తలచెదను. ఇట్లనేక విధముల విచారించు, చవిత మానసుడ నగు నాకు వ్యక్తమగు నట్లు బోధింప వలెనని ప్రార్థింపగా, శ్రీ దత్తాత్రేయువిట్లని చెప్పందొడంగిరి

ఓ పరశురామా! చిద్రూపిణియగు. త్రిపురాంబోపాస వలభించి, కృతార్థుండవైతివి. దేహాభిమానముచే కర్తవ్యముగలవానికి శాశ్వతసుఖము లభించదు సామాన్యులు మోహముచే అంతఃకరణ వ్యాపారముల యందు, కర్తవ్యము గల వారై. భ్రాంతిచే కార్యముల నాచరించుచు, సుఖ. దుఃఖ, జనవ, మరణ, సహితమగు సంసార సాగర మందు మునుగు చుందురు. దేహాభిమానముచే, రజోగుణ, తమోగుణ. స్వభావము గల వారై. యింత వరకు కొన్ని కార్యముల చేసితిని, మరి కొన్ని కార్యములు చేయవలయునని తలంచుచుండుట. కర్తవ్య స్వభావమగుచున్నది, యీవిధమగు

కర్తవ్య లక్షణమున్నంత వరకు నిత్య సుఖము లభించదు, సర్వ విషము కంటె, నతి విశేషమగు, నీ కర్తృత్వాద్యభి మానము వలన బహు జన్మల వరకు స్మృతి తెలియ బడని, అజ్ఞాన మైకము నందు మునిగి, జన్మ దుఃఖ ము లనుభవించు చుండును—

ఈ విషయమును గురించి పూర్వ కథ నొక దానిని చెప్పెద నాల కించుము.

దత్తా॥ కొందరు మార్గస్థులు దోవతప్పి కాననమందు ప్రవేశించి క్షుత్పిపాసలచే తపించుచు తిందుకఫలమని తలచి ముష్టిపండ్లను భక్షించి మనోభ్రమ కలవారై తిరుగుచు, దాహమతిశయించి, దాహశాంతికొరకు ఉమ్మెత్త ఫలములను నిమ్మపండ్లనుకొని వానినితిని, శూన్య మతిగలవారై గోతులయందుబడి, ముండ్లుపిరుగుటచే నడవజాలక, అజ్ఞానముచే నొండొరులను ద్వేషించి కొట్లాడుచు, నొకపట్టణముచేరి నిశీసమయమని తెలియక చరించుచు, యచ్చట కావలవారలచే నివారింపబడి, దేశకాలజ్ఞాన శూన్యతచే, అగడ్తయందు బడిరి, అందు కొందరు మునిగియు, కొందరు మొసళ్ళచే మ్రింగబడియు నిర్జీవులైరి—

ఆ విధముగ యుక్తాయుక్త మెరుంగక అవ్యక్తతత్వమునందు, కర్త వ్యాభిమానముచే ఆత్మజ్ఞానము లేనివారు మాయామోహితులై జన్మ దుఃఖ ముల ననుభవించెదరు, గావున ముముక్షువునకు ఆత్మా నాత్మ విమర్శనము ప్రథమమ సోపానమగుచున్నది. దీనినే బ్రహ్మ విద్యయందు శుభేచ్ఛ యందురు, యీ మొదటి సాధనము లభింపక మోక్షము సమకూరదు—

అట్టి శుభప్రదమగు సద్విచారమువలన అభీష్టసిద్ధియు, అభయ మును, అవిచారమువలన మహాభయమును నాశనమును సంభవించగలదు— అవిచారమువలన, శ్రీరాముడు భార్యా వియోగమును, బ్రహ్మదేవుడు తన పంచమశిరఃఖండమునను— భస్మాసురునకు వరమిచ్చిన మహేశ్వరు దాప దను— భృగుపత్నినిగొట్టిన విష్ణువు శాపమును బొందిరి. సుఖమను వృక్ష మును పెంపొందింపవారు విచారణయను బీజమును వృద్ధిపొందించ వల యును— అట్టి సద్విచారమువలన శివుడు సర్వజ్ఞత్వమును, దేవతలు శత్రు జయమును, శ్రీరాముడు సీతాసమాగమమును బొందిరి. గావున అట్టి సద్వి మర్శము గలవారికి నేనమస్కరింపెద—

అనాది సంశ్రితమగు అవివేకము (లేక) అవిచారము వలన నాపద బొందినవారికి, సర్వభూత నివాసియగు గాయత్రీ యనుగ్రహమె, సర్వదుఃఖ నివారకమగు పరమసాధనము— జ్ఞానప్రకాశము పరశివ రూపమనియు, విమర్శనా ప్రకాశము గాయత్రీ విలాసమనియు తెలియదగియున్నది. అట్టి విమర్శనాశక్తికొరకు చిచ్ఛక్తిరూపిణియగు గాయత్రీ యారాధనమె ముఖ్యసాధన యగుచున్నది—. స్వకర్తవ్యమును వదలి విశ్చలభక్తిచే నారాధింపబడిన, చిత్స్వరూపిణి హృదయ కమలమందు, సూర్యప్రభా కాంతిగలదై సదా ప్రకాశించుచు, తనశక్తిని బుద్ధియందు జ్ఞానరూపముచే ప్రతిఫలింపజేసి. అజ్ఞానమునుండి భక్తుల నుద్ధరించును. యాచిచ్ఛక్తి మహామను శ్రద్ధతో వినుటచే మంగళప్రదమగు విచారణ గలవాడవైతివి. వ్యాధి కనుగుణ్యమైన యౌషధ సేవవలన, యే విధముగ వ్యాధి శాంతించునో, యావిధముగనె పరాశక్తియగు త్రిపురాంబ యొక్క తత్వ విచారముచే, జనన, మరణరూప సంసారభయము నశించుచున్నది—

ఫలోత్పత్తికి కారణమైన పుష్పము వర్ధిల్లుచుండగా, వృక్షమెట్లు గొడ్డుఁదిగాదో, అట్లే బ్రహ్మానందమునకు కారణమైన. సద సద్వివేకము వృద్ధియగుకొలది. నరజన్మము గొడ్డురాలివలె వృధాకాదు.— కూపస్థమండూకమువలె బ్రహ్మాండ కూపమను జగత్తుయొక్క నావరణయందు పరిభ్రమించు మానవులు, యవివేకముచే నావరణ శక్తిని గ్రహించకయు, ఆవరణ విక్షేపశక్తులకు మూలమగు పరాశక్తి నుపాశించకయు, మాయా మోహితులై నిజతత్వమును తెలియనేరక సంసారసాగర నిమగ్నులగు చున్నారు.— మాయామోహితులగు యజ్ఞానులు. నిత్య సుఖమును దుఃఖము గాను,— దుఃఖమయమగు జగత్తును సుఖముగాను భావించుచుండెదరు.— ఆ కారణముచే యట్టి యజ్ఞానులు. యవివేక సంభవమగు మోహమువలన ఆడగాడిదేచే తన్నులు బడుచు. నేదో సుఖమునుగోరి దానిని వెంబడించెడి మగగాడిదెవలె, సంసారమువందెన్ని దుఃఖములుకలుగుచున్నను. భ్రాంతి సహితమగు సంసారమును, కర్తవ్యమును త్యాగము చేయజాలదు— ఓ భార్గవా, నీవు సద్విమర్శన చేసినవాడవగుటచే సంసార దుఃఖార్ణవము నుండి వెలువడితివి—

ద్వితీయోధ్యాయము సమాప్తము



# తృతీయోధ్యాయః

పరశురాములు— శ్రీ దత్తాత్రేయ గురువులానతిచ్చిన ప్రకారము శ్రద్ధతో విని, సవినయముగా యిట్లు ప్రశ్నించెను. గురువర్యా-? అనేకులు విమర్శ లేనివారై హానిని పొందిరనియు, గాయత్రీ మహాత్మ్య శ్రవణముచే సదసద్వివేకము కలుగునని తాము శెలవిచ్చితిరి. యీ మహాత్మ్య శ్రవణమునకు సాధనమేది?— సాధనలేకుండా విమర్శనము కలుగునెడల అందరకు యేల కలుగులేదు,— నాకిట్టిబుద్ధి యిదివరకేల కలుగలేదు?— మరి కొందరు నాకంటె పణిక దుఃముల ననుభవించు చున్నారు. అట్టివారైనను యీ సాధనమేల సాధించలేదు, యీ సంశయములను తీర్పుమని వేడెను—

శ్రీ దత్తాత్రేయులు:— గాయత్రీమహాత్మ్య శ్రవణమునకు సత్సాంగత్యము ముఖ్యసాధన మగుచు పరమపురుషార్థము నిచ్చును, మహానుభావుడగు సంవర్తకావధూతవలన నీ విట్టిదశకు వచ్చితివి. సత్సాంగత్యము సకలశ్రేయస్సుల నిచ్చును అట్టిసత్సాంగత్యము సద్గుణములు గలవానికే లభించగలదు. యెవడెట్టి గుణములు గల వాడో, అట్టి గుణములు గల వానితో సాంగత్యముచేసి, యీ విధమగు ఫలమనుభవించుచుండును- ఇందుకొక కథ గలదు వినుము.—

పూర్వకాలమున దశార్ణదేశపు రాజగు ముక్తాచూడునకు, సమస్త విద్యా విశారదులును, గుణవంతులును, సుందరులైన, హేమచూడుడు, మణిచూడుడను యిద్దరు కుమారులు గలరు, వారు ధనుర్విద్యా సంపన్నులు. సేనా సమేతులై, వేటాడు నెపమున సింహ, వ్యాఘ్రాదులతో

నున్న భయంకరగుగు సహ్యా చలవనముకేగిరి అచ్చట రాళ్ళవర్ష మధిక ముగ బయలుదేర, అంధకారమగు చీకటిలో సేవలతోగూడా దిక్కు తెలి యక నొకరినొకరు గానక చీకాకునొందిరి. రాజపుత్రులు గుఱ్ఱములనెక్కి దూరముగ పోయిరి. వీరిలో హేమచూడు డొక మునియాశ్రము చేరెను. నయ్యాశ్రమమువందు భూలోక లక్ష్మివలె. సువర్ణకాంతిగల నొక సుంద రిని జూచి, ఓ బాలా! యీ నిర్జన వనమందు నిర్భయముగ, నొంటరిగ నున్న నీ వెవరని యడిగెను.—

హేమలేఖ:— అయ్యా నా స్థితి తరువాత చెప్పెదను. అతిధి పూజ తాపసులకు ముఖ్య ధర్మము; గనుక మీగుఱ్ఱమును యీ ఖర్జూరపు చెట్టు నకు గట్టి. మీరు యీ ఫలములను పుచ్చుకొని, యీ పానకమును శేవించి విశ్రాంతి పొందుడనగా, యా రాజట్లు చేసిన పిమ్మట ఓ రాజా! వ్యాఘ్ర పాదుడను మహాముడికి పుత్రికను. వారు తపోబలముచే పుణ్యలోకము లను జయించిన జ్ఞాననిధియు. సకలముని పూజ్యమగు శివభక్తుడై యున్నాడు. నాపేరు హేమలేఖ యందురు.

హేమచూడుడు:— కల్యాణి, జ్ఞాననిధియైన పూజ్యులకెట్లు పుత్రిక నైతివి.

హేమలేఖ:— రాజపుత్రా! ఒకనాడు నా తల్లియైన విద్యాధరి సమీప మువనున్న వేణీనదికి స్నానార్థమేగగా, నా సమయమున సుషేణుడను వంగదేశపురాజును యానది దరిజొచ్చెను. వీరిరువురును సర్వాంగ సుంద రులగుటచే, కామబాణహతులై కలసుకొనగా, రాజర్షియొక్క యమోఘ వీర్యమువలన నాతల్లి గర్భము ధరించి, వెంటనే ప్రసవించిన దగుటచే,

పతి భీతివలన నన్నానదీ తీరమున డించిజనెను. తదనంతరము వ్యాఘ్ర పాదులవారు స్నాన, సంధ్యానుష్ఠానములకొరకు కక్కడికివచ్చి, నన్నుజూచి దయతో తీసుకొని వెళ్ళి తల్లివలె బెంచెను. వారి తపోబలమున నేనిక్కడ నొంటరిగ, నిర్భయముగ నుంటిని. దుష్టబుద్ధిగల దేవ, దానవులైనను నాదరిచేరి జూడజాలరు- జూడదలచిరేని నశింతురు. రాజపుత్రా నా తండ్రిని నీవు చూచినపిమ్మట నీకోరిక తీరగలదు- అని పలికిన యా కన్య వచన మునను విని ఖిన్నుడై మిన్నకుండెను. అంతలో వ్యాఘ్రపాద మహాముని యాశ్రమము చేరెను.

హే చూ॥ ముని సార్వభౌమా! నమస్కారము.

వ్యాఘ్ర॥ దివ్యజ్ఞానముచేత నంతయు గ్రహించి, రాజపుత్రా! యిచ్చగలదేని మా హేమలేఖను పెండ్లాడుమనగా, నందులకు రాజనుమ తించి వివాహముకొరకు హేమలేఖతో తన పురమునకు వెళ్లెను. తన తండ్రియగు ముక్తాచూడుడు సంతసించి కుమారునకు హేమలేఖకు వివాహము చేసెను. రాజపుత్రుడు హేమలేఖతో ప్రాసా, దోద్యానవన ములం, యిసుక తిన్నెలకు కామాతురులై సర్వదా ఇచ్చ వచ్చినట్లు క్రీడించు చుండిరి. హేమలేఖకు క్రీడాసక్తి లేకుండుటజూచి భర్త యేకాంతమున నిట్లనియె.

హేమచూ॥ ఓ ప్రియురాలా! నీకు నాయందను రాగము లేదా? యుక్తవయస్సుగల నీకు ఉత్తమ భోగములయం దనురాగ మేల లేదు. నీ మనస్సు పరాయత్త మైనట్లు తోచుచున్నది. నా వాక్యముల నాదరిం

వవు. నే నిచ్చిన పదార్థములను ప్రేమతో గ్రహింపవు. నేను వచ్చుతరి నేత్రములు మూసుకొని ధ్యానించుచుండెదవు. నీకు సంభోగము నందాదరము లేనపుడు నీతో నేను చేయు రతిక్రీడలయందు, కర్ర బొమ్మలతో చేయు సంభోగమువలె, నధికసుఖమేది గలదో చెప్పుము. నీకేమి కావలయునో చెప్పి నా చిత్త సంతాపము నివారింపమని యడిగెను.

తృతీయోధ్యాయము సమాప్తము



# చతుర్థోధ్యాయః

శోక మగ్నుడై గద్గద స్వరముతో పలుకుచున్న ప్రియుని వాక్యములు విని. పతికాత్మబోధచేసి. యానందము కలుగజేయదలచి చిరునగవుతో నిట్లనియె—

హేమలేఖ॥ రాజపుత్రా దైవసమానుడును, భర్తవునగు నీ యెడల నాకు విముఖముగాని, అసూయగాని లేదు. లోకమునందు ప్రియా ప్రియ పదార్థము లేవియో చిరకాలమునుండి విచారించుచున్ననాకు, స్త్రీ స్వభావము వలన తెలయుటలేదు. ఇందలి యదార్థ తత్వమెరిగిన పురుషులు మీరు చెప్పుట యుచిత మగుచున్నదనెను.

హే॥నా॥ పశువులు మొదలగునవికూడ ప్రియా ప్రియములను గ్రహించుచున్నవి. నీకట్టి గ్రహింపులేనందున స్త్రీలు మూఢబుద్ధి గలవారనుటకు సందియము లేదు. ప్రియము సుఖమును. అప్రియము దుఃఖమును కలిగించును. మూఢత్వముతో విచారించెదవేల.

హే॥లే॥ నాధా మీ వచనము సత్యమేయగును. స్త్రీలకు సదసద్విమర్శనముండదు. మీరు సద్విధానముగా బోధించిన యడల, నే నీ విచారమును విడిచి. విషయభోగముల నపేక్షింతును. సుఖము నిచ్చునది ప్రియమని– దుఃఖము నిచ్చునది యప్రియమని మీరు సెలవిచ్చితిరి. అట్లయిన యెడల నొక దేశమునందును. నొకకాలమందును ప్రియమైన వస్తువు మరియొక కాలమందును. మరియొక దేశమందును యప్రియ మగుచుండును, అట్లయిన సర్వదా ప్రియమైన వస్తువు యేదని చెప్పవచ్చును. ఎట్లన వహ్ని శీతకాలమందు ప్రియమును, ఉష్ణకాలమందు అప్రియము

నగుచున్నది గదా! ఉష్ణ పదార్థము శీతలదేశమందున్న వారికిని, వాత ప్రకృతి గలవారికిని ప్రియమైనను, ఉష్ణదేశమందు ఉష్ణప్రకృతిగలవారికి ప్రియము గదా? ఆహారపదార్థములు మంచివైనను, కొన్ని యధికమైనపుడును, కొన్ని తక్కువైనపుడును జనులను బాధించుచుండును గదా? ఆ విధముగానే ధన, దార, పుత్ర, రాజ్యాదులును గూడ వియోగ కాలమందపరిమిత దుఃఖహేతువు లగుచున్నవి. రాజ్యసుఖముతో నున్న మీ తండ్రిగారికి దుఃఖమేల కలుగవలెను? ఏ విధమగు సుఖసాధనలు లేకున్నను విరాగులు దుఃఖింపరేమి? సుఖములకును, భోగములకును హద్దు లేదు గదా? సంపూర్ణ భోగము లెవరియందు గాన్పించుచున్నవి? స్వల్పభోగమువలన దుఃఖమేగాని సుఖములేదు.

మరియు సుఖ దుఃఖములు, బాహ్యాంతరములచే ద్వివిధములగును. బాహ్య దేహమునందుగల గజ్జి మొదలగు బాధలకంటె, అంతరమైన మనస్సునందు గల విచారము మిగుల గొప్పదగుచు జగత్తునెల్ల క్రమింగి వున్నది గనుక బాహ్యమునకంటె గొప్పది.

దుఃఖమను వృక్షమునకు కోరికయను దృఢమగు విత్తనముమూలమై యున్నది స్వర్గమందు అమృతపానముచేయు నింద్రాది దేవతలును, బ్రహ్మత్వముకొరకు బ్రహ్మదేవునకు దాసులైయున్నారు.- క్రిమి కీటకాదులకుకూడా యధికవాంఛ యుండుటచే దుఃఖమునే పొందుచున్నవి. విషయ వాంఛయందు సంపూర్తి లేని సుఖము దుఃఖదాయకమే యగును. గావున నరులకుగల యధికవాంఛా సుఖము, గాఢాంధకారమున మిణుగురు పురుగుయొక్క ప్రకాశమువలె స్వల్పమైనందున సుఖాభాసయే యగును.

క్రిమి కీటకాదులకు గల వాంఛ యల్పసుఖమైనది. యిది ప్రాతఃకాల మందు అంధకారముతో గూడిన ప్రకాశాభాసమువంటిది. అనేక వాంఛలతో గూడిన మానవుల కింద్రియ సంభవమగు స్వల్పలాభముచే సుఖమని దలచినయడల దుఃఖమెవ్వరికిని లేదని చెప్పవచ్చును. శరీరమంతయు నగ్నిచే దహింపబడినపుడు, పాదమందుంచిన మంచిగంధపు బిందువుచే సుఖము లేనటుల, కామాగ్నిచే తపించు మానవునకు యల్ప లాభములభించి నను సుఖము గలుగదు —

అతిశయమగు సుఖమున్నదని యపేక్షించేడి కామసుఖముయొక్క పర్యవసానమందు, యధిక శ్రమయున్నదను విషయము సర్వత్రా విదితమే.— ఈ శ్రమ యధికబరువు మోయునట్టి పశువుకుగల శ్రమతో సమానమె, మరియు స్త్రీ, పురుషుల గాఢాలింగన సమయమున శరీరము నందుగల ప్రణాదులకు పీడగలుగక మానదు. అ కారణముచే నాలింగనాది సుఖములు సుఖములనదగవు. ఈ విధముగ దుఃఖసహితమైన యాలింగనాది సుఖములు, దేహభ్రాంతిచే సంతానము గోరువారికేగాని, ఆత్మ విమర్శకులకు నాదరణీయములుకావు. విషయములందలి, విశేషమును, అనురాగమును సంకల్పమువల్లనే కలుగును. యీకారణముచే, జాగ్రతావస్థ యందలి సుందరీ సంభోగము స్వప్నములోని సుందరీ సంభోగమే యగును. యిందులకొక కథ దెల్పెద నాకర్ణింపుము.—

పూర్వకాలమందు మన్మధునికంటే సుందరుడగు రాజపుత్రుడు గలడు. అతను యధిక సుందరియగు తన భార్యతో ప్రేమగా నుండెను. గాని వాని భార్య, యా రాజసేవకుని ప్రేమించెను. ఆ భృత్యుడు తన

ప్రభువునకు మద్యపానమలవాటుచేసి, మత్తుడైన తరి నారాజు యొద్దకు కురూపిణియగు దాసినిపంపి, తానారాజ భార్యతో క్రీడించుచుండెను. రాజు మద్యపానమత్తుడై, మోహముచే దనకిట్టి సుందరి దొరికెనని సంతసించుచుండ, కొంత కాలముజరుగ, నొకనాడు యారాజు మద్యమును స్వల్పముగ గ్రోలి శయ్యామందిర మందున్న దాసితో క్రీడించి. రత్యానంతరము, మద్య వికారముతగ్గి, వికృతాంగినియగు యా దాసినిజూచి, సంశయము, కోపముగలవాడై, యిదియేమి విచిత్రము. నా ప్రియురాలెక్కడ వున్నదని యాదాసినడుగగా, రాజుగారికి మత్తుతెలిసినదని గ్రహించి, భయముచె నేమియు చెప్పవందున, యా రాజు ఖడ్గమును చూపగా నాదాసి, రాజుగారికి తన భార్య నొక భృత్యునితో క్రీడించుట జూపెను. అంతట నారాజు తన భార్యతో క్రీడింపుచున్న భృత్యుడు పింగాక్షుడు. కురూపియు, పొడుగుగను యసహ్యముగ నుండెను. భూశయ్యయందు వానితో క్రీడించు భార్యను జూచి, నిశ్చేష్టితుడై ధైర్యమువహించి, యిట్లాలోచించెను.—

మూఢబుద్ధిగల నా బ్రతుకేల. స్త్రీలోలుల కింతకంటె నధిక సుఖమెప్పుడును గలుగదు. గోరువంకపక్షులనేక వృక్షముల నాశ్రయించినట్లే కాములు వివిధ సుఖముల నపేక్షింతురు. మోహముచే నా భార్యను ప్రాణ సమానముగ జూచితిని. వేశ్యలవలె, నీచస్త్రీలు భర్తల నమ్మియుండరు. విమర్శనలేక. యిట్టి స్త్రీలను నమ్మియుండువాడు, మూర్ఖుడగు నడవి గాడిదెవంటి వాడగుచున్నాడు. స్త్రీలకుగల ప్రేమ శరత్కాల మేఘము కంటె నతి చంచలమగుచున్నది. ఈ స్త్రీ నా భృత్యుని ప్రేమించి, విటుల యెడ వేశ్యవలె ప్రవర్తించుచు, నా యెడ కపట ప్రవర్తన జూపినది. స్త్రీ స్వభావ మింత నికృష్టమని నేటికి తెలిసినది. లోకమునందిట్టి మూఢుడు.

సామాన్యముగ నుండడని తలచుచూ. తనభార్య యిట్టి కురూపివి గోరెనవి విచారించి, రాజ్యాది సర్వసంగములనువదలి యరణ్యమునకేగెను. గావున సౌందర్యమనునది మోహముచే మనస్సునందు బుట్టి యభిమాన మగు చున్నది. గావున నీవు నన్ను ప్రేమించినట్లే నీ వంటివారు స్త్రీలను గోరుదురు. గావున నా వాక్యములను సావధానముగావినుము.

బాహ్యమందు కనబడుచున్న స్త్రీలు మోహముచే చిత్తమందు ప్రతి బింబించి శృంగారముగ గాన్పించెదరు. ఆ సౌందర్యము చిత్త ప్రతిబింబ మగుటచే మానసికమే యగుచున్నది. మనస్సుయొక్క విక్షేపమువలన, సౌందర్య విలాసాదులయందనురాగముగల్గును. మనోలయము గలిగి నపుడు, విషయానురాగము సంభవించనేరదు. రూప, లావణ్యాదులయందు గల మనస్సంకల్పమే చలనమునకు కారణమగుచున్నది. యోగులకును, బాలురకును. సౌందర్యాదులయందు భ్రాంతి లేనందున. చిత్తవిక్షేపము కలుగనేరదు. మానవులకు స్త్రీలయందు సౌందర్యభ్రాంతికే. ప్రేమాభి వృద్ధి యగుచుండునుగాని, కామాది వికారములకు కారణమైన మనస్సు లయమైనపుడు వైరాగ్యము కలుగును.

పంచ భూతాత్మకమగు శరీరము, రక్త, మాంస, పురీష, మూత్రాది యుక్తమై, పతినీచము, యసహ్యకరమైనదను నిశ్చయబుద్ధి కలిగినపుడు వైరాగ్యము కలుగును. అపుడు స్త్రీ సుఖమెట్లపేక్షిత మగును– తత్వ విచా రమును ఆత్మజ్ఞానములేక, సదా చిత్తవిక్షేపమునందు భ్రాంతిగల కాముము లకు, రజో, మూత్రస్రావమగు, భగేంద్రియ సుఖమునందు, భ్రాంతి కలుగుట యాశ్చర్యముగాదు.– అట్టి యవివేకునకు జగత్తునందుగల సర్వ విషయములు సుందరముగానే తోచగలవు. చిద్విలాసముల మోహము గలవారికే జగద్భ్రాంతి గలుగునుగాని. చిద్విలక్షణ శక్తి స్వరూపులైన

యోగులకును, మాయావిలాసము లెరుగని బాలురకును, సుఖభ్రాంతికలుగ నేరదు-విషయముల యందనురాగము వాసనాసహితమగు మన స్వభావ గునట్లు, మధువు నందు మాధుర్యము స్వభావమైనట్లు, గాయత్రికి నిత్యా సందము సహాపమగును—

ఒక్కొక దేశమందు స్వభావముగ సృష్టింపబడినట్టు, యొకకాలు, యొక కన్ను,పొడుగుచెవులు, వికృతావయవములు గల స్త్రీల నితరదేశ మానవులకు, రుచింపకున్నను. నాయాదేశస్థులకను కూలముగ నుండును గదా? దేవతలు కూడా స్త్రీశరీరము మొదటు సుఖసాధనమని భ్రమించు చుండుట యాచారమైయున్నది. ఆవిధమూగానే, పురుషశరీరములయందు స్త్రీలకును భ్రమకలుగుచుండును, రాజపుత్రా?- ఈశరీరముల యొక్క-ను త్పత్తి, స్థితిని విమర్శించు వారికి, భ్రమకలుగ జాలదు-శుక్లశోణిత, మిశ్రమమగు నీశరీరము, అస్థి, మాంసము, చర్మము, రక్తము, వీనితో గూడినదై, వాత, పిత్త, శ్లేష్మ, మల, మూత్రాదులకు స్థాన మగుచు, మూత్రద్వారము నుండియే వుట్టుచున్నది, ఇట్టి శరీరము తత్వవిచారము గల జ్ఞానులకు ప్రియ మెట్లగును—

ఇట్టి, యేహ్యమగు దేహమునందభిమానము గలవారు, మలజనిత, పురుగులవంటి వారగుచున్నారు.— అతి ప్రియముతో భక్షించిన, షడ్రసు పదార్థములు, మరునాటికవి నసహ్యములగుచున్నవి. పదార్థములయందు కామ్యాభివృద్ధి నొందినకొలది, వాని వినియోగమునందు దుఃఖమధికముగ సంభవించగలదు. గావున సుఖమును, ప్రియమును గలిగించు పదార్థ మేదియో చెప్పుము, అని హేమలేఖ పలుకగా, హేమచూడునకు, అశ్చ

ర్యమును, విషయములయందు వైరాగ్యము. వభివృద్ధి యగుటచే, ఆత్మ తత్వమును గ్రహించినవాడై, అతనివలన తన సోదరుడు మణిచూడు డును, తండ్రియగు ముక్తాచూడుడును, మంత్రులు మొదలగు యా నగర వాసులందరు, పక్షులు సహితము తత్వజ్ఞులైరి.

ఆ కారణముచే యావిశాల నగరము బ్రహ్మపురమని ప్రసిద్ధి నొందెను. అందువలన, యా పట్టణమందలి చిలుకలు పాటల యందిట్లు పలుకుచుండును.— జనులారా అజ్ఞానవశముచే మోహమువలన జనించిన జీవభావమునువదిలి, స్వాత్మాను సంధానముచేయుడు, స్వాత్మాను సంధాన మనగా, గంధ పుష్పాది పూజకాదు,— చిత్తమునందు ప్రతిఫలించిన చైతన్యమును ఆత్మగాభావించి–అహంకార, దేహాది సంఘాతము నేను కాననియు, చిదాత్మయే నేననియు, నిశ్చయించునట్టి బుద్ధి భావనయే, స్వాత్మాను సంధానమను ఆత్మభజన మగుచున్నది— ఆత్మ స్వయం ప్రకాశము, సర్వమును ప్రకాశింపచేయునదియు, అద్దమందు ప్రతిబింబమువలె చిత్తు యొక్క స్వతంత్రశక్తియగు మాయయందు ప్రతి ఫలించిన జీవులు చితియెగాని వాస్తవముగ జీవులుగారు— జీవసాన్నిధ్యమందుగల చిత్తు, జీవునివలె ప్రకాశించుచుండును— ఇది, అది, అనుచు గోచరమగు జ్ఞానము ఆత్మ కాదనియు, జ్ఞానప్రకాశాధిష్టానమును, సర్వ సాక్షియై చూచు ఆత్మ యనియు, దెల్పు శాస్త్రరహస్య మెరుంగుడు, ఆత్మ వివిధములగు సర్వో పాధుల యందున్నను, తన యేకత్వమును వదలకయే ప్రకాశించు చుండును— కాల, దేశాది, భేదములచే బహుళముగ దోచుచున్న భేద మెల్లను, నరశృంగమువలె కల్పితమేగాని, వాస్తవము కాదు—

అద్దమునందు ప్రతి ఫలించిన సూర్యుడు అద్దమునందే మాత్ర మంట వివిధమున, సర్వోపాధులయందు ప్రతిఫలించియు, అసంగ చిద్రూప

చైతన్యమే గాయత్రి యనదగియున్నది, ఘటనా ఘటన సమర్థతగల గాయత్రి, తన స్వతంత్ర మాయవలన, తన స్వరూపమును మరుగు పరుచుచు, య విద్యయనుపేర, ద్వైతముగ భాసించుచున్నది. దృశ్యమెల్లను ద్వైతము. బీజమునుండి యంకురము పుట్టినట్లు, గాయత్రివలన జగత్తు పుట్టలేదు, మట్టి ఘటముగా మారినట్లు పరిణామమును పొందలేదు. చితి. చైతన్యమని రెండుగ చెప్పుటవలన, త్రాటియందు సర్పభ్రాంతివలె వివర్తముకాదు. ఎట్లన— స్వచ్ఛమైన అద్దమునందు ప్రతిబింబమువలె, చిత్తునందు స్వశక్తిచేత చైతన్యము భాసించుచుండును, దర్పణ ప్రతిబింబమునకు బాహ్యవస్తువు నిమిత్తమెకాని ఉపాదానముకాదు. చిత్తునందు మాయా శక్తిచేత జగత్తు ప్రతిఫలించినను, చితికనిపించవలెనను నియమములేదు. ఘటమునకు నిమిత్తకారణము దండము. ఉపాదానము మృత్తు ఘటమునందు మృద్ధర్మములు మాత్రమె కనబడును.

ఘటము మృత్తుయొక్క రూపముతో నుండును గాని, కర్రయొక్క రంగుతో నుండదు. కర్ర లేకపోయినను చక్రమును చేతితో త్రిప్పుటచేత ఘటము పుట్టవచ్చును. గావున చిత్తునందు దృశ్య ప్రపంచము ప్రతిబింబించినపుడు స్వతంత్రమైన యీ మాయ యనెడి శక్తి నిమిత్త కారణము— చిత్తుకంటె, చిత్తము వేరైనయెడల యీ దృశ్యమునకు స్ఫూర్తి సంభవింపనేరదు. ప్రతి బింబించిన పద్ధతియు నొప్పతగదు. జడమగు దృశ్యము చిత్సంబంధము లేకుండా ప్రకాశింపనేరదు. అట్లు ప్రకాశించునని తలచినయెడల, యెల్లపుడును లయాదులు లేక, శాశ్వతముగా ప్రకాశించుచుండవలయును. లేక అప్రకాశకముగ నుండవలెను. దర్పణ ప్రతిబింబ ప్రకారముగానె దృశ్య స్ఫూర్తియని నిర్ధారణ యగుచున్నది.

దృశ్యరూపమై జగత్తునందు ప్రకాశించు జీవకోటివెల్లను చితియే కాని మరేమియు లేదు. అద్దమునందు కనబడు ప్రతిబింబములన్నియు, అద్దము ననుసరించి ప్రకాశించుచు. దర్పణ దృశ్యములగునట్లే, అహంకారాది దేహాంతమగు జడ స్వరూపము వెల్లను, అఖండమగు చిత్తుయొక్క ప్రకాశమువలననే ప్రకాశించుచుండును- స్వప్రకాశమగు చితికి, అన్య ప్రకాశాపేక్ష స్వభావముగలేదు. కనుక, ఓ మానవులారా? మీరా చిత్తునే సేవింపుడు- చిత్తునందు దృష్టి నిలపి, చిత్ప్రతి బింబితమైన జడదృష్టిమ విడువుడు- అని చిలుకలు, గోరువంకలు పలుకుచుండును. పట్టణమంతయు, పక్షులు సహితము చిద్విద్యను చెప్పుటవలన యీ పురమునకు విద్యానగరమని వామదేవాది మహర్షులు నామమిడిరి.

దత్తాత్రేయులు:- పరశురామా హేమలేఖ యొక్క సాంగత్యము చేత, యీ నగరమంతయు బ్రహ్మ జ్ఞానము కలిగి యానంద పరవశులైరి. సత్సాంగత్యము సకల శ్రేయ సాదనమని గ్రహించుము.

చతుర్థోధ్యాయము
సమాప్తము.



# పంచమోధ్యాయః

పరశురాముడు॥ దత్తాత్రేయునకు నమస్కరించి "అయ్యా" సత్సాంగత్యము సకల శ్రేయస్సాధనమనియు, హేమలేఖ యొక్క సాంగత్యమువలన యా నగర వాసులందరికి శాశ్వత సుఖము లభించెననియు తెలవిచ్చితిరి. హేమలేఖ భర్తకు బోధించిన పద్ధతిని సాంగముగ విన గోరుచున్నాను.

దత్తాత్రేయులు : పరశురామా! సదర్వోత్కృష్టమగు యాబోధ చెప్పెద నాలకింపుము. హేమలేఖ చెప్పిన వాక్యములువిని, హేమచూడుడు సర్వవిషయములు కాలాను సరణముగా పరిణామమందు, విరసముల గువని తలంచి, సర్వ విషయాను రాగమువదలి, ఉన్మత్తునివలె ధ్యానించుచు, తన భార్యచెప్పిన వచనములను సదాస్మరించుచున్నను, వాసనా సహితమగు విషయ సుఖములారంభమువందు విలాసములైనను, అభావమునందు దుఃఖమును గలిగించెడివని చెప్పిన హితబోధను గ్రహించుటకు సమర్థత లేనివాడై, తన భార్యతో యేకీభావమును బొందలేక, తన విషయాసక్తిని, తనలో తాను నిందించుకొనుచు విచారముతో కొంతకాలము గడిపెను—యీ విధముగ, విషయ భోగము లయందును రాగమును, వానియందలి దుఃఖదోషములను, విమర్శించుచు, యధార్థమును నిశ్చయింపజాలక మౌనము వహించెను.

హేమలేఖ : భర్తనుజూచి నాధా! వస్త్రాలంకారాహార విహారములను గ్రహింపవు, మిత్రులతో మాటలాడవేల, ధనము గోల్పోయిన వాని వలె శోకించుచున్నావు. ఆత్మకెట్టి తాపము లేదుగదా! జడమగు శరీరము

నకు తాపమెట్లు గలుగును. శరీరతాదాత్మ్యమును బొందిన యాత్మకు రోగపీడ గలిగెనా యేమి. మహారాజునై శ్రేష్ఠమగు వైద్యులచే సేవింప బడుచున్న నాకు, వ్యాధి, సంకటమెట్లు సంభవించునంటువేని.. (భోగే రోగ భయం) అని పండితులు చెప్పుదురు. వాత, పిత్త, కఫ, పూరితమగు దేహమందు, విపరీతాహార, విహారాదులవలనను, రోగము లుత్పన్నము లగుచుండును. వ్యాధుల కౌషధము లుండినను, వ్యాధులంకురించదగిన బీజములను గ్రహించుట దుర్లభముగదా? వాత ప్రకోప వ్యాధియందు శీతోపచారమును, అత్యుష్ణ వ్యాధుల యందు ఉష్ణోపచారమున్ను విరుద్ధ చికిత్స లగుచున్నవి.

ఆ కారణముచే విరుద్ధాహార, విహార, దేశ, కాల, కర్మలవలన, దేహమునందు రోగము లంకురించి పీడించగలవు. వ్యాధులంకురించదగిన ధాతు వైషమ్యస్థితి, వ్యాధోత్పత్తికి పూర్వముతెలియశక్యముకాదు. ఆకారణ ముచే మాదలచే నిర్మింపబడిన వైద్యశాస్త్రమునందు, ధాతు వైషమ్యము కలగుటకు పూర్వస్థితిని వివరించియుండలేదు. అట్లగుటచే యిపుడు నీ శోకమునకు కారణమేమి?

హేమచూడుడు:— నేనిదివరకు సుఖమని తలచిన విషయము వెల్లను, నీ యుపదేశానంతరము విషమని తోచుచున్నది. నిత్యానంద సుఖము లభించదగిన మార్గ మాలోచించుటకైనను, పూర్వ విషయ వాసన పూర్తిగ నివర్తించలేదు. ఉరి తీయుటకు నియమింపబడిన వాని మెడను యలంకరింపబడిన మాలికాదులు వాని కానందము కలిగించ జాలనట్లు, నీ యుపదేశ బలమున విషయములెల్ల, నన్నానంద పెట్టజాలకున్నవి.

రాజ్యమునందు రాజాజ్ఞను నిరాకరించ రాజభటులకు సమర్థతలేనట్లే, విషయ వాసనల నిరాకరించుటకు నే నసమర్థుడనై యున్నాను, గావున నాకే విధముగ శాశ్విత సుఖము లభించునో చెప్పుమనగా,— హేమలేఖ యిట్లాలోచించెను. నే నిదివరకు చెప్పిన వాక్యములచే విషయములయందు వైరాగ్యము గలిగెను. శ్రేయస్కరమగు పూర్వ వాసనలేనివాని కెన్నివిధముల బోధించినను వైరాగ్యము గలుగుట దుర్లభము. వీరుచేయు ఉపాసన కొంచెమైనను, గాయత్రి యనుగ్రహముగలిగెను. వైరాగ్యము గలిగినదని తలచి తన జ్ఞానమును మరుగుపరుచుచు తన వృత్తాంత మిట్లు చెప్పెను.

హేమలేఖ:— జగత్సృష్టికి కారణమైన శుద్ధ చిత్తు నాతల్లి, నేను జీవచిత్తును। తల్లి నా క్రీడకొరకు బుద్ధియనెడి చెలికత్తెను నా కొసంగెను। నా చెలియగు బుద్ధి ప్రళయమందు లీనమగుచు, కర్మపాక కాలమైన సృష్టి యందు, మరల సంభవమగుటచే. క్రొత్త సఖి యగుచుండును. ఆ బుద్ధి సత్వగుణ ప్రధానమై అన్యాపేక్ష లేనిదగుటచే సతియనియు, శుద్ధ చిదాంశ గనుక కూతురనదగియున్నది. ఆ బుద్ధి సత్వగుణ ప్రధానమైనను, య విద్యాసాంగత్యమువలన తన స్వభావమును విడిచి, అవిద్యా కార్యమైన జగదాకారమును బొందెను. ఈ యవిద్య ఉన్నదనిగాని. లేదనిగాని, చెప్పశక్యముగాని, అనిర్వచ నీయమైయున్నది. శాస్త్ర విచారణచే చిత్తు యేకదేశమై. పరిచ్ఛిన్నముగా నున్నదనుకొనుట యజ్ఞాన మనబడును. ఈ యజ్ఞానమే బంధమునకు కారణము.

ఈ యవిద్య తత్వజ్ఞానావస్థయందు శూన్యమగుటచే అసతి యన బడును. ఈ యవిద్య విచిత్రమగు వివిధ సృష్టిని కల్పింప సామర్థ్యము

గలదగుచున్నది. యీ యవిద్య, నాకు తల్లియైన శుద్ధ చిత్తునకు దోషక, నా సఖియగు బుద్ధితో నేకీభవించెను. యా బుద్ధి జీవస్వరూపమైన నాకు ప్రాణములకంటె యధిక ప్రియమైనది. ఆకారణముచే బుద్ధికి నే నెప్పుడును స్వాదీనమైయుందును. బుద్ధి ప్రతిబింబితుడే జీవుడని ప్రమాణ నిశ్చయము. ఆ కారణముచే, సుషుప్తి, మూర్ఛాద్యవస్థలయందు బుద్ధి శూన్యమగుటచే, భ్రాంతి రూపమగు జీవ వ్యవహారములేదు. కిరాతుని యింట పెరుగుచున్న రాజకుమారునివలె, తన స్వాతంత్ర్యమువలన మాయచే నావరింపబడియున్న మహేశ్వరుడే జీవుడని భావము, అట్టిబుద్ధి స్వాధిన మందున్న నేను, సదా బుద్ధి యాజ్ఞ ననుసరించి ప్రవర్తించుచుందును. ఆ విద్య ధనమార్జించు వేశ్యవంటి దగుటచే. యవిద్యారూపమగు బుద్ధి వలన జీవేశ్వర భేదము గలిగినది. బుద్ధి తనయందు ప్రతిఫలించియున్న జీవులను వశపరుచుకొనుచుండుటచేత. జీవ భావముననున్న నన్ను,సత్వ భావముగల బుద్ధి వశపర్చుకొనుట సహజమే యగుచున్నది.

ఆ విద్యామహిమవలన సంభవమగు నా యెదుట బుద్ధితో క్రీడించుచుండును- వారిరువురచే నేను ప్రేమింపబడితిని.- ఘటమునందావరించియున్న ఆకాశమునకు, ఉపాధియైన ఘటముయొక్క యాకారమువలె దోచు విధమునను, ఇనుప కమ్మియందున యగ్నికీ, ఉపాధియగు కమ్మి యొక్క యాకారమున దోచు విధమునను. బుద్ధితోగూడిన చిత్తునకు, ఉపాధియగు బుద్ధియొక్క మోహాది వికారములు. బుద్ధితో కలశియున్న చిత్తునకుండినట్లు భాసించుచుండుట సహజమగుచున్నది. మహామోహుడు బుద్ధితో క్రీడించుటచే, అస్థిరుడగు మనస్సనే కుమారుడు గలిగి, వెంటనే యవ్వనవంతుడయ్యెను. మోహ మూకంటే పూర్వము

మనస్సున్నను, తండ్రి దేహములో విద్యాకారుడగు పుత్రుడున్నట్లు, దౌలతమనస్సు సూక్ష్మకారమైనను, బుద్ధికి మోహముకలిగి, వికల్పములు మెండుగ బుట్టుటచే, తండ్రినుండి సంభవమకుమార్తుతండ్రివలె దోచి నట్లు, మనస్సు, సంకల్పాదులచే నభివృద్ధి యగుచుండును. మోహమెట్ల స్థిరమో, అట్లే మనస్సు సహితమస్థిరము, జడమునగుచున్నది—

ఈ మనస్సు జగద్వ్యాహారమునందతి నిపుణముగల దైమోహాని వలె యసత్యమును, జడత్వగుణము గలదైనను, దన పితామహియగు అవిద్య జగన్నిర్మాణ కార్యమునందు స్వతంత్రశక్తి గలదైనట్లు, పరాపేక్ష లేకుండా సంకల్ప, వికల్పాదులను జేయదగిన సమర్థత గలదగుచున్నది. బ్రహ్మవిద్య విమర్శనా జ్ఞానమువలన, అవిద్యకు శూన్యమనియు, మోహమునకు మూఢమనియు సంజ్ఞలు గలిగెను, మనస్సు మోహానియొక్క సాంగత్యమువలన మూఢత్వమును, అవిద్యా సహాయమువలన జగన్నిర్మాణ చతురత్వమునుగలదై, సంకల్ప, వికల్పాదులతో ప్రవర్తించు చుండును. మోహినియొక్కయు, మనస్సుయొక్కయు సాంగత్యమున, బుద్ధి వీరికనుగుణ్యముగలదై, మనస్సుచే సంకల్పింపబడిన వస్తువులను ధ్యానించుచు, వానియందు ప్రేమ యధికమై, నాయందు అనురాగము వదలినను, చిత్తముపాధిగాగల జీవుడనైన నేను వారి సాంగత్యమును వద లక వెంబడించుచుందును. నాకుపాధియగు చిత్తముకూడా బుద్ధి ననుస రించుచుండును—

మహామోహుడు నన్ను బలత్కారముగ తనవశము చేసుకొనుటకు యెంత ప్రయత్నించినను, నేను సత్త్వభావము కలగియుండుటచే వాని ప్రయత్నము కొనసాగలేదు. బుద్ధికి వాసనరేనవుడు చిత్తుతో తదాత్మ్యము

పొందునుగాని, వాసనాసహితమగునపుడు నేకీభవించదు. జీవచితికి బుద్ధి యందుకల మోహ సంస్కారమా భాసగాని వాస్తవముకాదు అట్లయినను యీ శరీరమందు మోహమనే మూఢునితో కలసియున్నానను అపవాదము నాయందు లోకులు కల్పించెదరు. వివేకములేని యజ్ఞానులు, బుద్ధియందు కల కర్తృత్వ, భోక్తృత్వాదులను, చిదాత్మయందా రోపించెదరు. బుద్ధి తనయందుద్భవించిన అస్థిరుడగు మనస్సును నా స్వాధీనమం దుంచి తాను మోహునితోగూడి సర్వదా క్రీడించుచుండుడు. అస్థిరుడు నాచే నధిక ప్రేమముగ పోషింపబడుచున్నను. అవిద్యా మహిమవలన, మోహితుడై చపలయను స్త్రీని పొందెను. చంచలమగు యాచపల ప్రతిక్షణమందును భర్తయగు మనస్సున కిష్టమొచ్చినట్లు, వివిధాకారములచేత తృప్తిని పొందింపుచూ భర్తను వశపర్చుకొనును, సంకల్పమునకు భర్తయగు మనస్సును క్షణమాత్రములో సునాయసముగ అనేక యోజనముల దూరముపోయి తిరిగి వచ్చుచుండును. సంకల్పము సహితము తన భర్త కంటె ముందుగాబోయి, స్వాగతాలింగనాదులచే నతనిని తృప్తి చెయు చుండును. ఈ విధముగ మనోరాజ్యాధికమును కల్పించుకొని, నేను ఆభాస సుఖమును పొందుచుందును. యా సంకల్పము అస్థిరుడగు మన స్సునుగూడి, జ్ఞానేంద్రియ పంచకమను ఐదుగురు పుత్రుల కనెను.

మనస్సు సంకల్ప, వికల్పాదులులేని నిశ్చల స్థితియందు యింద్రియ ప్రవృత్తి శూన్యమగును. మనస్సుయొక్క సంకల్పసిద్ధికొరకు యీ జ్ఞానేంద్రియ పంచకమను పుత్రులు, తల్లి దండ్రులయెడ భక్తి విశ్వాసములతో, స్వతంత్రులైయుందురు. జీవుడనైన నేను మనస్సుయందు నభిమానముచేత, జ్ఞానేంద్రియ పంచకమును పోషించుచుండెదను. శబ్ద,

స్పర్శాదులను గ్రహించునట్టి యింద్రియములు, మనస్సును స్వాధీన పరచుకొని తమ నివాసములకు తీసుకొని పోవుచుందురు. మనస్సు సంకల్పాత్మకమగునపుడు యింద్రియములద్వారా బహిర్గత మగుచుండును. మనస్సు తనకుమార్లయిన జ్ఞానేంద్రియాది గృహములకుజని, శబ్ద స్పర్శాది విషయ సుఖదుఃఖములనుభవించుచు, మరల స్వస్థానమును చేరుచుండును. ఇతని కుమారులైదుగురు మనస్సునువిడిచి యే విషయముల ననుభవింపజాలరు. సంకల్పమునకు చెల్లెలు, మహోదరియగు ఆశ. తన్ననుసరించియుండుటచే, ఆశయందు ప్రేమగల సంకల్పముచే, ఎన్ని భోగముల ననుభవించుచుండినను ఆశ తృప్తి నొందజాలదు.

ఆశ తన చవితికుమారులైన పంచేంద్రియములతోను, భర్తయగు మనస్సుతోను, పదార్థములెన్ని తెచ్చినను చాలవని కలహించుచుండును. అస్థిరమగు మనస్సు ఆశతో కూడినపుడు, జ్వాలాముఖునియొక్క జ్వాలలచే పీడింపబడుచు, లోభునితో కలపియున్నపుడు, లోకముచే నిందింపబడి మృతప్రాయమగుచు, శాంతిలేక దుఃఖ సహితమగు విషయములను, మరలమరల కోరుచుండును. బుద్ధి అస్థిరుడనే పుత్రునియందధిక ప్రేమచే, యీ మనస్సుతోగలసి దుఃఖింపుచు, క్రోధ, లోభులనెడి మనుమలతో గూడి లోకనిందకు పాత్రుడై మృతప్రాయమగును. ఇట్టి గుణము బుధ్యాదియందు గలుగుచున్నను. నేవా గుణముల ననుసరింపక యుంటిని. మనస్సు సంస్కార విశేషమువలన దశ ద్వార సహితమగు పురమునందు, సపరివార సహితమై, యింద్రియ సుఖములగోరుచు సదా దుఃఖమునే పొందుచుండును.

చపల స్వభావమగు మనస్సు, చపల, ఆశలను భార్యలతో గూడి పంచేంద్రియ సుఖములకొరకు బహిర్ముఖమై ప్రవర్తించుచూ, సదా దుఃఖమునే పొందుచుండును. బుద్ధియు తన స్వభావమగు సాత్వికాంశమును విడిచి, మలిన సత్వమగు మనస్సుదో గలసి దుఃఖింపుచు నిశ్చేష్టయై యుండును. ఆశ, క్రోధ, లోభులతోగూడిన యవిద్యా కల్పితుడగు మహామోహుడు, సంకల్పాదులచే విర్రవీగుచు దశద్వార పురమందుండి మనస్సును స్వాధీనము చేసుకొనెను. జీవుడనైన నేను బుద్ధియొక్క దుఃఖములను వీక్షించుచూ నిశ్చేష్టితుడనై పురవాసుల లక్షణముల చూచుచుండెదను—

నేనా పురమందుండక పోతినేని పురవాసులందరందుండ లేరని తలచి నేను వశియించియుంటిని. అద్దములేక ప్రతిబింబములేనట్లు, బుద్ధి లేకపోవుటచే, సుషుప్త్యాద్యవస్థలయందలి కార్యములు శూన్యములు కాగలవు. జీవుడనైన నేను. అవిద్యచే శూన్యత్వమును, మహామోహుని వలన మూఢత్వమును, అస్థిరత్వముచే నస్థిరత్వమును, చపలచే చాపల్యమును, క్రోధునిచే తాపమును, లోభునిచే నిందను, ఉపాధిదోషములను బొందుచు యీ పురవాసుల రక్షించుచుంటిని. నేను లేనియెడల బుద్ధియు శూన్యకాగలదు. బుద్ధి ననుసరించిన చిత్తునకు వ్యాపకాది గుణ విశేషములు కలిగెననియు, బుద్ధి కధిష్ఠానమైన నన్ను విడిచినచో, ఉపాధి రూపమైన బుద్ధి శూన్యమైనదని తెలుసుకొనుము—

బుద్ధ్యాది త్రిపురవాసుల (జాగ్ర, స్వప్న, సుషుప్త్యవస్థ త్రి)తో సదా గలిసియుండుటచే నన్ను దేహ పరిగ్రహణము గలవాడనియు, వ్యథి

బారినవిషము. మూఢులు తలంచెదరు. అసంగుడనని పండితులు నిశ్చయించెదరు. ఆత్మ యఖండ. చిద్రూపమైయున్నను బౌద్ధాదులు క్షణికమని చెప్పెదరు. నిర్మలాగారయు. మహా పతివ్రతయు. ఆకాశముకంటె స్థూలయు. పరిమాణువు కంటె సూక్ష్మమగు మహచిత్తనదగిన గాయత్రి నా తల్లి. పైన దెలుపబడిన పురవాసుల దుష్ట సాంగత్యమున్నను, తల్లి యగు పరచితియొక్క ప్రకాశమువలన నాకు నిర్మలజ్ఞానము కలిగెనని నమ్ముము. నా తల్లియగు పరచితికి, శారీరదోషముగాని. మానసికదోషముగాని, అజ్ఞాన. అవరణములుగాని యంటనేరవు. అఖండ సత్తాకారమై. శుద్ధచిదేకరసమైన త్రిపురాంబ సర్వమునకు కారణమై. సర్వవ్యాపకమగు ఆకాశముకంటె పెద్దదియు. పరిమాణువుకంటే యధిక సూక్ష్మము నగుచున్నది.

త్రిపురావాసియగు పరచితి, సర్వజ్ఞురాలైన విదేహియగుటచే, యసంగచిద్రూపిణి యగుచున్నది. సర్వకార్యముల కాధారమైనను. నిష్క్రియ, యనదగియున్నది. జగత్పోషణ కర్తయగుటచే, జగదాధారమగునుగాని. ఆమెకాశ్రయ మేదియులేదు. సర్వజగమునకు చిత్తు నాధారమగునుగాని. చిత్తునకు నాధారమొకటియులేదు. జ్ఞాన స్వరూపిణియగుటచే అజ్ఞానావరణమను అభిమానరహితము నగుచున్నది, దృశ్యపదార్థ సాక్షిత్వమువలన సర్వజ్ఞయగునుగాని, స్వయముగ నిర్గుణీయగును. సర్వదా భాసించుచుండుటవలన సర్వాధారయనబడును. సర్వభూత ధారిణియైనను. స్వరూపహీనయు, సర్వయుక్తమైనను, అసంయుక్తయు, సర్వదా ప్రకాశించుచున్నను, నతిగుహ్యమైనదియు—

మహానంద రూపిణియైనను, ఆనందరహితయు, మాతాపితురులు లేనిదైనను, పెక్కు సంతానములుగల తల్లియైయున్నది. ఆనంద ప్రయుక్త మగు గర్వములేనందున. యితరులకు గోచరముకాని ఆనందముగలదగుట వలనను, సదా నందయనబడును. నిత్యచైతన్య స్వరూపిణియగుటచే. మాతాపితృలులేనిదగుచున్నది. సముద్రమందలి తరంగములవలె నా సోదరీమణుల నంతములు, వారందరికి నాస్వభావమే. ఈ విధముగ దశ ద్వారపురమందు, మహామేహాది దుష్టసాంగత్యమున్నను త్రిపురాంబ యనుగ్రహామువలన. చిద్రూపతుల్యనగుటచే, దుష్టసాంగత్య దోషములు నాకంటవు. శుద్ధ బ్రహ్మమునందుఃయించుటకు నవకాశములేని సంసారము మాయాశక్తివలన గల్పించుచున్నను. నాకల్పిత సంసారము. నా భాసగ చూచెదను. అస్థిరుడగు మనస్సు విషయలంపటచె నలసినపుడు అవ్యక్త తత్వస్వరూపమైన బుద్ధియను తల్లియందుగలసి గాఢనిద్రను జెందును. వాసనాశముచే సంపిద్ధమగు కర్మలనుభవించుటచే క్షయమగును.

అగామి. సంచిత. కర్మానుభవముకొరకు మనస్సు విషయముల యందు లీనమైయుండును. మనస్సు లీనమగునపుడు, యతనికుమాచ్చ. క్రోధ, లోభులును, పంచేంద్రియములును, చపల, అశలనుభార్యలును, బుద్ధియను తల్లియును, అవ్యక్తమునందు లీనమగుదురు. అట్టి షుప్త్యా వసయందు యీశరీరమునకు నాధారమైన ప్రచారుడును ప్రాణము. ప్రాణా పానములచే నాసారంధ్రముల దిరుగుచు దేహమును రక్షించుచుండును. మనః ప్రాణములలో, దేనిని ఆపినను రెండును అగిపోవును గావున మన స్సుకు ప్రాణవాయువు సన్నిహితుడగుచున్నాడు. అట్టి సమయమున అవిద్య బుద్ధిని పరివారసహితముగాదాచి సుషుప్త్యవస్థయందు కాపాడు

చుండును. ఇట్టి సుషుప్తి సమయమున జీవుడనగు నేను తల్లియగు త్రిపు రాంబచే నాచ్ఛాదింపబడి సఖించుచు జాగ్రత్తియందు సదావారిని వెంబ డించుచుందును. మనస్సు మొదలగు పరివారమెల్లను, సుషుప్తియందు అవిద్యయగు మహామోహునితో గూడియుండును, సుషుప్తియందు జీవులు మూలావిద్యయందు లీనమగుటచే, జీవచితికి పరమానందము లభించగలదు. ప్రచారుడను ప్రాణము, శక్తిగలవాడై, సదా పురవాసు లందరిని పోషింపుచుండును. ప్రాణవాయువుచే ప్రజ్వలింపబడిన జఠరాగ్ని వలన, పచనమగు అన్నరసాదులవలన, మనస్సు మొదలగు పురవాసు లెల్లరకును సామర్థ్యము కలుగుచున్నది–

ప్రాణమొకటైనను స్థానాది భేదమువలన ననేకములై, పురమును, పురవాసులను, ప్రేమతో పోషించుచుండును. సూత్రము తెగినప్పుడు సూత్రస్థమగు మణిమాల రాలిపోవునట్లు, ప్రాణము నశింపగా వీరందరు నశింతురు. ఆకారణముచే ప్రాణమునాచే పోషించబడుచు సూత్రధారునివలె, వారినందరిని పోషించుచుండును. అంతఃకరణాదిపురములకెల్లను ప్రాణము ద్వారాచిదితో, దాదాత్మ్యము కలుగుచుండును. శరీరము శిథిలమైనప్పుడు యీ పురవాసుల నెల్లను, మరియొక శరీరమునకు ప్రాణము చేర్చుచుండును. మనస్సు ప్రాణసంబంధమువలననే జీవపురమునకు నాథుడయ్యెను. ప్రాణో త్క్రమణ కాలమందు, బుద్ధ్యాది పురవాసులెల్లరు ప్రాణమందు లయించుట వలన, ప్రాణముమరియొక పురమునకు తీసుకొనిపోవునపుడు, విచిత్ర ముగ యనేకపురములకు ప్రభువాయెను. మనస్సు శుద్ధ సత్వమగుబుద్ధికి పుత్రుడైనను, మహాబలుడగు ప్రాణము నాశ్రయించియున్నను, సర్వశక్తి యుతమగు జీవచితిచే రక్షింపబడుచున్నను, ఆశ, వికల్పములను దుష్ట భార్యల సాంగత్యమువలన సదా దుఃఖమనుభవించు చుండును.

ఒక్కొక్కప్పుడు జ్ఞానేంద్రియ సంభవమగు, క్రోధ, లోభులను కొడుకులచేతను, మరియొక సమయమున చపల, ఆశ లను భార్యలచేత, నటు, నిటు పీడ్వబడుచు, మనస్సు సుఖములేక దుఃఖమునే పొందుచుం డును. క్రోధమనుకుమారునిచేత, శిరః, పాద, పర్యంతము తాపముగలిగి, క్రోధ నివృత్త్యుపాయమునెరుగక మూర్ఛను పొందియుండును. మరి యొకప్పుడు లోభుడను కుమారునిచేరి, నికృష్టకర్మలను చేయుచు, లోకమునిందించి, భయపెట్టగా, శోకమగ్నుడై దుఃఖించుచుండును. దుష్ట కులమగు యీ యవిద్యా సంతతియందుదయించిన యీ మనస్సు. దుష్టు లగు దారాపుత్రాదులచే భ్రమనుజెంది. విచిత్రమగు భౌతిక దేహముల బొందుచు, వేటకుక్కలు మొదలగు క్రూరజంతువులుగల, సంసారాటవి యందు, అతిశీతల ప్రదేశములందును, దుర్గంధస్థలములలోను, గాఢాంధ కారమందును తిరుగుచు, నాయాబాధల నోర్వజాలక దుఃఖించుచుండును. ఈ విధముగ యస్థిరమగు మనస్సు, యత్యంత దుఃఖమనుభవించుచుండ, బుద్ధియు దుఃఖసాగరమున మునుగుచుండును. నేను బుద్ధియందు ప్రతి ఫలించిన జీవచితివగుటచే సర్వసాక్షినై, ముగ్ధవలె వ్యవహరించుచుంటిని. గ్రీష్మఋతువులో నిర్జల ప్రదేశమందు నడుచుచున్న నరునకు దాహశాంతి కలుగనట్లు, అస్థిరమగు మనోవిలాసముల యందభిరుచిగల నరునకు, సౌఖ్యములేశమైనను కలుగజాలదు—

ఈ విధమగు గాయత్రి స్వరూప నిశ్చయజ్ఞానము బుద్ధికి కొంత కాలమునకు సంభవమగుటచే, అప్పుడు నాయందైక్యమగును. విషయాను రాగములేని బుద్ధి, ఈశ్వరానుగ్రహముచేత శుద్ధ, సత్వ ప్రధానముగల దగుచున్నది. బుద్ధికి, మనస్సుయందభిమానముపీడి, నాసాంగత్య ప్రభా

వమువలన గలిగిన వైరాగ్యముచే. సుజ్ఞాన వివేకముకలిగి, మనః, క్రోధ, లోభాదుల సంగమునువర్జించి, నాయందైక్యముగాదగిన నిర్వికల్ప సమాధియందు త్వరతో శుద్ధ చిదాత్మయొక్క పురముజొచ్చి, యా త్రిపు రాంబను మాటిమాటికి కౌగలించుకొని. మాలిన్య రహితమై పూర్వ శ్రవణ సంభవమగు పరోక్షజ్ఞానముగలిగి, మనన, నిధి ధ్యాసములుచేసి అపరోక్ష జ్ఞానముగలదగును.

అపరోక్ష జ్ఞానమునందు. ద్వైతభావన మధ్య, మధ్య కలుగు చున్నను. దగ్ధబీజములంకురింపజాలని విధమున, జ్ఞానదార్ఢ్యముచే బుద్ధికి సంసారమునందు కర్తవ్యము కలుగనేరదు. జ్ఞానికి త్రివిధ దేహవ్యవహార ములయందును. అభిమానము, కర్తవ్యము లేకపోవుటచే, దేహము వాస నాసహితమగు కర్మలయందు ప్రవర్తించినను, జ్ఞాని అప్రవర్తకుడే యగు చున్నాడు.

ఈ విధముగ అర్జునకు శ్రీకృష్ణ పరమాత్మ, భగవద్గీతయందు నుపదేశించెను. గావున జ్ఞానసిద్ధియందు, కర్మబంధము సంభవించనేరదు. దీనినే జీవన్ముక్తి యనదగును. వాసనాసహితమగు దేహాభిమానము లేనందున. బుద్ధి సదా యానంద సముద్రమునందు, నీదులాడుచుండును—

కావున నీవును. మాయావియగు దుర్వృత్తిగల మనోసంగమును విడిచి. నా తల్లియగు త్రిపురాంబనుబొంది, నిత్యసుఖమనుభవించుము— ఓ రాజకుమారా, నీకు నిత్యసుఖమున కాస్పదమగు నాయనుభవము జెప్పి తిని. బుద్ధి సహితముగా, అపరిచ్ఛిన్నమై. నెట్టికొరతలేని. చిద్రూ పైక్య ముమ బొంది సుఖించుము—

పంచమోధ్యాయము సమాప్తము.

# అథషష్ఠోధ్యాయః

హేమచూడుడు తన భార్యయగు హేమలేఖ చెప్పిన వాక్యములు విని భార్యతో నిటులబల్కెను—

హేమచూడుడు:— నీ వాక్యములు విన్నకొలది ఆకాశమందు దోచు నుత్తరువులవలెనను, ఉన్మత్తవచనముల చందమునను దోచుచున్నవి. యాకారణముచే నమ్మకము దోచుటలేదు. అప్సరస స్త్రీయందు జన్మించి, మహాఋషిచే పెంచబడి, సంపూర్ణ యవ్వనమైనను రానివయస్సుగల నీవు చాతుర్యముగా, అనేకవేల సంవత్సరముల క్రిందటి వృత్తాంతమును చెప్పుచున్నావు. నీవిదివరకు చెప్పిన వాక్యములయందు, బుద్ధియను నొక చెలికత్తె గలదనియు, ఆమెకు కొందరు పుత్రులు గలరనియు చెప్పితివి. అట్టి నీ సంతతివారందరేదేహములతో నెక్కడ యున్నారో చెప్పుము. నీ వాక్యములెల్లను 1. గొడ్రాలి పుత్రుడు, 2. శుక్తియందు గనుపించిన వెండితో తయారైన నగలను ధరించి, 3. నరశృంగముతో చేయబడిన ధనుర్బాణములను చేగొని, దర్పణ ప్రతిబింబమగు రథమెక్కి, 5. ఆకాశారణ్యమునకు పోయి, 6. అచ్చట గంధర్వనగరమేలెడి భవిష్య ద్రాజేంద్రుని జయించి, 7. స్వప్న దృశ్యమగు కాంతలగూడి, 8. యెండ మావులయందు స్నానమాచరించుచున్నాడని చెప్పు పగటివేషగాని హాస్య వచనముల చందమున సత్యములుకావని తలచెదననెను—

హేమలేఖ:— నాధా? నా వచనములు సత్యమగును. అసత్యము పలుకుట మా ఋషి వంశమునకు సహజముకాదు, మా వంశమునందు తపోనాశనకరమగు నసత్యము వెతకిచూచినను గాన్పించదు. శ్వేతకుష్ఠ

గలవానికి శృంగార ముంచునట్లు, అసత్యవాదికి తపస్సుగాని, సిద్ధిగాని యుండజాలదు. జిజ్ఞాసులకును, శిష్యులకును అసత్యము బోధించువారికి నిహపర సౌఖ్యములు దూరమగును. మీరు నాకు భర్తయు, నార్తులు నగుటచే మీకు అసత్యము బోధించుట భావ్యముగాదు గదా. తమిలవ్యాధి గల వానికి తగిన అంజనము, ఔషదసేవ, మొదలగు చికిత్సలచె వ్యాధి శాంతించునుగాని, అంజన, ఔషధ నామములు విన్న మాత్రమున వ్యాధి శాంతించనట్లు, మహావాక్యార్థరహస్యములను సద్గురువులవలన, శ్రవణ, మననాదులచే. సదా నుపాశించువారికి మాత్రము జ్ఞానసిద్ధి లభించునుగాని, కేవల శ్రవణముచే జ్ఞానసిద్ధి లభించనేరదు. అజ్ఞానియగు వికల్ప మనస్సు గల మూఢునకు సత్యవచనములయందు నమ్మకము గలుగదు.

స్త్రీ స్వభావముల సత్యమను లోకోక్తి తలంచెదవేని స్వబుద్ధిచే విచారించుము. వివేక సంపత్తిగల జ్ఞానులు, వచనమగు పదార్థ విమర్శన కొరకు నొక్క-క్షణమునుజూచి పక్వదశను గ్రహించునట్లు, వస్తుపరిశీలన యందు నొక్క-విషయమును పరిశీలించి, యదార్థమును గ్రహించుట యుచితమగుచున్నది.— పూర్వము నాచే తెల్పబడిన సంగతులను విమర్శించుటచే, నీకు తోచు సుఖవిషయములెల్లను దుఃఖప్రదములని తలచితివి గదా. ఆ విధముననే నా వాక్యములయందు యదార్థమును గ్రహించి సందేహముగల మనస్సును విడచి నిశ్చయబుద్ధితో విచారించుము— అజ్ఞానులకు బూటకములగు వాక్యములయందు నమ్మకము కలుగునుగాని, సత్యవాక్యములు రుచింపవు. తల్లి తన పిల్లల రక్షించువిధమున సద్గురువు తనయందు శ్రద్ధాభక్తులు గల శిష్యులను, మహా సంపటములనుండి రక్షించుటకు ప్రయత్నించును, సద్గురువులయందును, మిత్రులయందును శ్రద్ధలేని

మూఢునకు సంపద, కీర్తి, సుఖము ఇహపరాదులు శూన్యమగును. సత్య వచనములయందు శ్రద్ధగల జీవనము శ్రేయోదాయకమగును. తల్లియందు నమ్మకములేని కుమారునకును, భార్యయందు నమ్మకములేని భర్తకును, సుఖము లభించుట దుర్లభము.—

ఫలమునందు ఆసక్తియు, నమ్మకములేని వ్యవసాయదారుడు, సేద్యము చేయడుగదా. నమ్మకములేక కృషిచేయనివానికి ఫలము లభించదు. ఫలించునను నమ్మకములేనివాడేవిధముగ కృషిచేయజాలడు. పాపభీతిలేని మానవులు దుష్టకృత్యము లెట్లు మానుదురు. శ్రద్ధలేనివానికి లోక మర్యాద సంభవించనేరదు. శ్రద్ధ గలవానికి ఫలమెట్లనిసందేహించకుము. ఏ కార్యమునందును నమ్మకము లేనివాడు విఫలమును బొందును. గాన నా వచనములయందు శ్రద్ధగలవాడవై నిత్యసుఖ మనుభవించుము. దుష్ట కార్యములయందును ఫలసిద్ధికి నొకవిధమగు శ్రద్ధయే కారణము. గాన యే కార్యమునందును హితవాక్యములయందు శ్రద్ధయుంచుట యుచిత మని చెప్పిన భార్యవచనము లాలకించి, హేమచూడుడిట్లనియె.

హేమచూడుడు:— ఓ సఖీ! సజ్జన వాక్యములయందుగల శ్రద్ధ శ్రేయోదాయకమనియు దుష్టుల హితవునందుగల శ్రద్ధ ప్రమాదకరమగు నని చెప్పునట్టి నీ వచనములయందాసక్తిగలిగి, ప్రవర్తించునన్ను నీవిట్లు దూషించుట యుచితముగాదు.

హేమలేఖ:— ఇతరులుచేయు హితబోధయందు ఉత్తమ నీచము లను గ్రహించదగిన వివేకముచే, హితబోధయందు శ్రద్ధ యుంచుట ఉత్తమమగుచున్నది. హితవాక్యములయందు యుక్తాయుక్తములు విర్ణ

యించలేనివారికి ప్రమాణము యదార్థనిశ్చయమునకు సాధనమగుచున్నది. అట్టి వివేకము లోపమగుటచే ఫలము సంభవింపకున్నను, సత్పురుషుల యందును, శాస్త్రమునందును, శ్రద్ధగలవానికి, ఈశ్వరానుగ్రహముచే సత్సాంగత్యమును, అందువలన ఉత్తమ ఫలమును బొందగలడు. సంశయాత్మకమగు కుతర్కము లేనివాడు కాలానుసారము ఫలమును బొందును గాని, సంశయాత్మకమగు మనస్సు గలవాడు సుఖమును బొందజాలడు. యిందుకొక పూర్వచరిత్ర చెప్పెదవినుము.

పూర్వకాలమున సహ్యపర్వతప్రాంత, గోదావరి తీరమున శాంత శమదమాది గుణములచే లోకజ్ఞానముగల కౌశికుడను బ్రాహ్మనునకు శిష్యులనేకులుండిరి. ఆశ్రమమున గురువుగారు లేనపుడు శిష్యులందరు లోకవ్యవహారములు తర్కించుచుండగా, కుదర్కదక్షుడగు శుంగుడను బ్రాహ్మనుడువచ్చి, తర్కవాదమున వారందరి నోడించెను. కౌశికముని శిష్యులు, శాస్త్రవిరుద్ధముగాని సత్యమే ప్రమాణమని నిశ్చయించగా, ప్రమాణమువందు నిశ్చయములేని యాశుంగుడు, ప్రమాణము లెల్లను ప్రమాదభరితములనియు, దోషయుక్తములగు ప్రమాణములవలన నిశ్చయ జ్ఞానము కలుగదనియు, కుతర్కములచే వాదించుచు, మీరు చెప్పెడి వేదాది ప్రమాణములు దోషరహితమై, సత్యములనియే గ్రంధ ప్రమాణములచే నిశ్చయము చేసెదరు- ప్రమాణములయందు తెలుపబడిన సత్యమగు జ్ఞేయవస్తువేది? దానిని దెలియదకు జ్ఞాతయెవరు, అనుచు కుతర్కములచే ప్రమాణములు శూన్యములని నిర్ణయించెను. కొందరు బాలులా మతమును సత్యమనినమ్మి భ్రష్టులైరి-

మరికొంతమంది తమ గురువులరాగానే యీ సంగతిని వినిపించి, అందు యదార్థమును గ్రహించి శూన్యమతమును శూన్యమైనదిగా దలంచిరి గావున, కుతర్క-స్వరూపమైన మనశ్చాంచల్యమును వదలి, సద్విచారము గలవాడు సుఖమును బొందగలడని చెప్పెను- భార్యతో హేమచూడుడు:— నీకింతటి విజ్ఞానముగలదని యింతవరకు నెరుగనైతి. వివేకము, శ్రద్ధ గలవాడు సర్వ...యుగాంచునని చెప్పితివి. నీ సాంగత్యము వలనను మంత్రాలోచనముల వలనను సపరివార సహితముగ ధన్యుడనైతిని. సత్పురుషుల యందును, వ్యాఖ్యానముల యందును అనేక మతభేదములున్నట్లు దోచుచున్నవి. బుద్ధి సైతము కాలానుసారము యనేకమార్పులు జెందుచుండును.

ఇట్లుండ— "ఆత్మబుద్ధి సుఖంచైవ" యని కొందరు దెలుపుచుందురు. ప్రారబ్ధానుసారము తనకు తోచినమతమెట్లు సమ్మతమగును. ఆ కుంగుడు చెప్పినమతము సమ్మతమేలకాదు? ఏల నమ్మరాదు? వీనినెల్ల విచారించి ప్రేమగల నివు నా మేలుగోరి సంశయమును దీర్పుము.

షష్ఠోధ్యాయము సమాప్తము.



# అథసప్తమోధ్యాయః

హేమలేఖ:- మానవులకెల్లను గల మనస్సు మర్కటమువలె చపల స్వభావముగలదిగాన సావధాన చిత్తుడవైనా పలుకులాకర్ణింపుము.- అవివేకుడు మనస్సుయొక్క చపలమగు సంకల్పముల నియమింపజాలక దుఃఖమును బొందును. సుషుప్తవస్థయందు మనస్సు శూన్యమగుటచే నందరికి గల సుఖము ప్రాప్యమగుచున్నది. చిత్రరువునందు లిఖింపబడిన వృక్షము నేత్రానందమేగాని, ఫలపుష్పముల నివ్వజాలనియట్లు శ్రద్ధ లేక విన్నవిషయములు నిష్ఫలములగును. చపల సంకల్పముగల మనస్సుకు దోచునట్టి తర్కమును, సంశయమును వదిలి, సువిచారముచేసి నిశ్చయించినవారికి త్వరలో కార్యసిద్ధి లభింగగలదు. మనోనిగ్రహములేనివారివలె, దుష్ట సంకల్పముతో గూడిన తర్కమునకవకాశ మివ్వకూడదు. సద్విచారముచే కార్యము నిశ్చయించినవారికి ఫలము లభించగలదు-

సద్విధానమగు పురుష ప్రయత్నమువలన కృషిచేయువారు ధాన్యలాభమును, వర్తకులు అర్థలాభమును, రాజులు రాజ్యలాభమును, బ్రాహ్మణులు శాంతియుతమగు బ్రహ్మపదమును, శూద్రులు జీవనాధారమును, దేవతలమృతమును, ఋషులుత్తమలోకములను బొందుచున్నారు. ప్రమాణములయందు నిశ్చయములేనివారు యెట్టిఫలమును బొందుదురో నీవే యాలోచింపుము. నొకసమయమున లోపముగా ప్రయత్నించి కార్యసిద్ధి లభించలేదని భావించి, నేకార్యమందును శ్రద్ధ వహించక నుపేక్ష చేయువాడు మాయకువశుడై తనకుతాను శత్రువనమానుడగుచు నశించుచున్నాడు. గావున యుక్తానుసారము శ్రద్ధచే పురుష ప్రయత్నమువలన పట్టుదలచే

కార్యము లభించినయడల నిహపరసుఖము పొందును. సద్విచారము చేతను, అనుభవ జ్ఞానముచేతను. యదావిధగ కృషిచేసి ప్రతిబంధ రహిత మగు ఫలమును ఏ విధముగ పొందునో ఆ విధమగు సాధనమే. ఉత్తమ సాధన యనదగియున్నది. సంయోగ వియోగములయందును సదా దుఃఖ దాయకమగును. ధన దారపుత్ర రాజ్యాదులుత్తమ సుఖము నివ్వ జాలవు.

భగ. 6. శ్లో 22-23కముులయందు చెప్పబడినవిధమున, ఏసుఖము యందున్నప్పుడు ఎట్టి దుఃఖమునైనను, చలింపజాలదో ఏ సుఖము లభించి నప్పుడు అంతకు పరమగుసుఖముకాన్పించదో, అట్టి నిత్యానందసుఖము, ఈశ్వరారాధనయందు తత్పరతవలననే లభించగలదు. మనోగతములగు. కామ్య విషయసుఖముల నిత్యములగుటవలన, మోహముచే వాటియందను రాగముంచక, నిత్యసౌఖ్యము నివ్వదగిన, ఈశ్వరారాధనయందు. నమ్మ కము శ్రద్ధగలవాడవైతివేని శ్రేయస్సును పొందగలవు.

శుద్ధ సత్యమైన బుద్ధియందు ప్రతిఫలించిన ఈశ్వర సాన్నిధ్య మందుగల మాయ, నా ఈశ్వరశక్తి వలన శూన్యమైన జగత్తును కల్పించి అజ్ఞానములను భ్రమింపజేయుచుండును. శుద్ధ సత్యమగు బుద్ధియందు ప్రతి ఫలించిన ఈశ్వరుడు వశీకృతమాయ గలవాడగుటచే ఇంద్రజాలకుని జాలవిద్యనుచూచి బుద్ధిమంతులు భ్రాంతిచెందనట్లు మాయాకల్పితమగు ఇంద్రజాలమువలన ఈశ్వరుడు మోహమును పొందడు. ఈశ్వర సాన్ని ధ్యమందుగల మాయ. భగ. అ7. శ్లోకము 14నందు భగవానుడు చెప్పిన విధమున ఈశ్వరారాధనయందు నమ్మకములేక నారాధించని అజ్ఞానులను భ్రమింపజేసి సంకటములపాలు జేయును. ఈశ్వరారాధన తత్పరులగు

భక్తులయందు ఈశ్వరుడు దయగలవాడగుటచే సాన్నిధ్యమందుగల మాయయు అనుకూలముగల ద్వైతత్వరహస్యమును బోధించుచుండును. గావున అనాది సంశ్రితమగు మాయనను వరింపగోరువారు సగుణరూపిణి యగు గాయత్రి యారాధన తత్పరులగుట యుచితమగుచున్నది. జగత్కారణ రూపిణియగు గాయత్రి యారాధన జేయనియడల ప్రాణాయామాది సాధనములు నిరర్థకములగుచున్నవి. గాన ముముక్షువు జగత్కారణ కర్తయగు పరచితియారాధన ముఖ్య కర్తవ్యమగుచున్నది. అవయవ బేధముచే రూపనామాదికమైన ఘటపటాది రూపములెల్లను మానవ నిర్మితములై జీవేశ్వరులవలననే బ్రహ్మాండ సృష్టి స్వజియింపబడుచున్నది. అల్పములగు ఘటపటాదులు సృష్టికర్తలేక స్వజియింపబడనియెడల, సముద్రాగిరి వృక్షాదులు సృష్టికర్తలేనియెడల ఎట్లు వృజియింపబడగలవు. ఏ పదార్థములకు అవయవ నిర్మాణము కలిగియుండునో ఆ పదార్థములెల్లను నొక వ్యక్తి వలన కల్పితములేయగుచున్నవి. అవయవ రహితమగు పరిణాది అవ్యక్తతత్త్వ మెట్లను. సృష్టిక్రమము ననుసరించి క్రమము తెలియబడదగినది అగుటచే కల్పితమే యగుచున్నది. చార్వాక బౌద్ధ తార్కిక మతాదలు సమ్మతించిన అనుమాన. ప్రత్యక్ష శబ్దాది ప్రమాణములెల్లను సృష్టిగతములగుచున్నవిగావి సృష్టికి నాధారమగు పరచితి తత్వరూపణము జేయజాలవు. చార్వాకాదులు పంచభూతములయందును, దృష్టికి గోచరములగు పృథివ్యాది నాల్గు తత్త్వములే సృష్టికి నాధారమనియు, నైదవదగు ఆకాశము శూన్యమగుటచే నిరర్థకమనియు చెప్పెదరు. అద్వైతమునందు "ద్వావాపృదివీజనయన్" ఇత్యాధివచనములచే, పృదివ్యాది భూతములు ఆకాశ సంభవమనియు, అపంచభూతములకు

నాధారమగు అవ్యక్త తత్త్వమైన గాయత్రివలన, జగన్నిర్మాణము జరుగు చుండుననియు, నిశ్చయింపబడియున్నది. గావున, సృష్టికి మరియొక కర్త లేడనియు పృథివ్యాది నాలుగు భూతములలే కారణమనియు చతుర్విధ భూత సమ్మేళనమువలన జన్యమగు తేజస్సువలననే కార్యకారణములు జరుగుచుండుననియు, చైతన్యసహితమగు దేహమే పురుషుడనియు, అకార్ధముచే జగత్కారణకర్త మరియొకడు లేడనియు ఉన్నయెడల ఏలకనిపించదనియు, మద్యపానము చేసినవానికి మదశక్తి నశించు విధమున, చైతన్యము నశించుటవలన దేహము నశించుననియు, మరణించినవారికి స్వర్గ నరకములులేక సర్వజీవులు ముక్తిని పొందెదరనియు ఈ విధమగు మరికొన్ని యుక్తులచే తర్కముచేయు చార్వాకాదుల మతములు సమ్మతించదగినవిగావు. సంసారకార్యమైన మాయా కల్పితమగు మనస్సు మిథ్య యగుటచే, మనోకల్పితమగు సంసారము సహితము మిథ్య యగుచున్నది. పరమసుఖ రూపానుభవమగు ఆత్మ సాక్షాత్కారమే మోక్షమగును. అట్టి పరమ పురుషార్థసాధనమే శ్రేష్ఠమగునని, తర్క వేదాంత యుక్తులచే అద్వైతము సిద్ధాంతము చేయబడియున్నది. గాన, ఇంద్రియగోచరమగు ప్రత్యక్ష ప్రమాణమే యథార్థమనియు, నాస్తికమే మోక్షమనియు, చెప్పునట్టి చార్వాకాది ఇతరమతములను పండితులు విశ్వసింపరు.

చార్వాకాది మతములు చెప్పునట్లు, ధర్మార్థకామములవలె, ఆత్మశూన్యమే. పురుషార్థమయని యంగీకరించెదవేని, నీ మతములెల్లను క్షణికమగుటచే, శూన్యమగు ఆత్మ ప్రతిక్షణమందును నశించుచుండును. గావున, ప్రతిక్షణమందును ముక్తి కలుగవలసియుండును. ఆత్మ నాశన

మగువప్పుడు సాక్షియగు తానునులేనివాడగుచున్నాడు. అట్టి పురుషార్ధ మును పొందువాడెవడు? తానులేని పురుషార్ధము ఎవరికి సంభవింపగలదు. అట్లయినను యితరుల శరీరమందుగల ఆత్మ నశించినపుడెల్లను నీకా పురుషార్ధము సంభవించవలెను. ఆత్మ నాశనమగుననియు, ఆత్మనాశమే మోక్షమనియు, చెప్పుటకు ప్రమాణమేదైనను గలదా, ఉన్నయెడల ఆప్రమాణమెద్ది. యింద్రియములకు, విషయములకు, సాన్నిధ్యమందుండి తెలుసుకొనదగిన ప్రత్యక్ష ప్రమాణము. వర్తమానకాలమందే సంభవిం చునుగాని, గత కాలమందునసించబడిన ఆత్మకు, ప్రత్యక్ష ప్రమాణము కానేరదు. హాస్యాస్పదమును, ప్రమాణ విరుద్ధమునగు, చార్వాకాది మత సిద్ధాంతములెల్లను, అద్వైతమత సిద్ధాంతవేత్తలైన జ్ఞానులకు, యదార్థము వేద్యములని తెలియదగియున్నది-

సృష్టియొక్క యదార్థము సాంఖ్యమతానుసారము చెప్పెద నాకర్ణిం పుము. అద్దమువంటి సత్వగుణాంశమైన బుద్ధియందు ప్రతిఫలించి, మూల ప్రకృతియైన గాయత్రిగాను, మలినసత్వమైన మనస్సునందు ప్రతిఫలించి జగదాకారముగను, భాసించుచుండును. పురుషుడీవిధముగా ద్రష్ట, దృశ్యం సంబంధమువలన ప్రకృతి తాదాత్మ్యమునుపొంది, నేను, యది యని సర్వ విషయములను తెలిసికొనుచు, ఆభాస జ్ఞానమువలన సంభవి మగు ప్రవృత్తియే, సంసారమునకు కారణమగుచున్నది. ద్రష్టయగు పురు షుడు, దృశ్యమగు ప్రకృతికంటె, నన్యుడనని విశ్వయించినపుడు, దొంగయని గుర్తించినవాని యెదుటికి దొంగరానియట్లు మాయావి యగు ప్రకృతిని గుర్తించిన పురుషునియెదుట జూపట్టక నదృశ్య మగును.

అట్టియెడ బుద్ధియందు ప్రతిఫలించిన తనకు, ప్రకృతి కార్యముల యందభిమానముగాని, కర్తవ్యముగాని లేకపోవుటచే, సంసారబంధము నివర్తించుననియు, అదే మోక్షమనియు సాంఖ్యమతము. ఈ మతము నందు కొంత తర్కము గలదు. అదెట్లనిన జాగ్రత్స్వప్నావస్థలలో బుద్ధి ప్రకాశించుచుండుటవలన సర్వకార్యములు జరుగుచుండును. సుషుప్త్య వస్థలో అవిద్యయందు బుద్ధి లయించియుండుటచే, ఇచ్ఛగాని, సుఖము కాని, కార్యముగాని, అభిమానముకాని, లేనందున యివన్నియు బుద్ధి కృతములే కాని ఆత్మకృతములు కావనియు, ప్రకృతియందు చిత్తు ప్రతి ఫలించుటవలన దృశ్యము ప్రకాశించునని వీరి అభిప్రాయము. ప్రతిబిం బితమైనచిత్తు, దానికాశ్రమగు ప్రకృతివలె జడమగునా. లేక స్వప్రకాశ మగు ప్రకృతివలె జడమగునేని దృశ్యమును ప్రకాశింప చేయజాలదు. జడమైనను దృశ్యమును ప్రకాశింపజేయుననిచెప్పిన యడల ప్రకృతికి సత్వాంశమువలన సర్వశక్తి లభించుచుండగా, చిత్ప్రతిబింబ ముతో యెట్టి యవసరమును లేదు. మరియు ప్రతిబింబిత చిత్తుకూడ చిద్రూ పమేయును మరియొక పక్షమందును, దృశ్యమునకు ముఖ్య చిత్సంబంధము నిశ్చయించుటవలన, ప్రతిబింబ కల్పనము వ్యర్థమేయగును. అట్లగుటచే ప్రకృతియే జగత్కారణమని చెప్పెడి సాంఖ్యమతము సహేతుకముగ తోచదు.

యథార్థమును విచారించినయడల అంతఃకరణ రూపమగు బుద్ధి యందు ప్రతిఫలించిన మూలప్రకృతివలననే బుద్ధి యుక్తమై, కార్యములు జరుగుచుండునని, నిర్ణయించబడిన ప్రమాణము ననుసరించి, జగత్కా రణకర్త బుద్ధియుక్తుడై యుండవలెనని నిశ్చయించవలసియున్నది. ఈ మ్మరి

సాలీడు మొదలగువారు సాధనాంతరములచే చేయు సృష్టివలె, ఈశ్వరుడు సృష్టికొరకు, ఉపాదాన, నిమిత్తాది కారణముల నపేక్షింపడు. ఈశ్వరుడు మరియొకనిచే సృజింపబడ్డవాడు కాకపోవుటచే, జీవసృష్టికంటె, ఈశ్వర సృష్టి స్వతంత్రమును, విలక్షణము నగుచున్నది.

ఈశ్వరసృష్టి జీవునిచే నిశ్చయింపశక్యము కానిదియు, అచింత్యమైనదియు నగుటచే, సృష్టి నిర్మాణమునకు సర్వశక్తియుతుడగు పరమేశ్వరుడే తగియున్నాడు. ఆకారణముచే సర్వశక్తియుతయు, సర్వఫల ప్రదాతయునగు పరమేశ్వరి, తనను నిష్కామముతోను, భక్తి విశ్వాసములతోను సేవించు శరణాగతులను రక్షించి, యభీష్టసిద్ధి నొసంగ గలదు గాన, పరమేశ్వరిని సేవింపుము- భక్తాభీష్టముల దీర్చదగిన శక్తి దయానముద్రయగు పరమేశ్వరికి గలదుగాని, కృతఘ్నులును, సామాన్య మానవులకులభింపజాలదు- భక్తులరక్షించు నియమము గాయత్రికి లేదని తలంచితివేని, యీమెచె నిర్మింపబడిన జగత్తునకు నియమము లేకపో వలసి వచ్చును. నియమాదులు లేనియెడల రాజ్యము సహిత మస్థిర మగును-

గావున జగదాధారియగు పరమేశ్వరిని శ్రద్ధా భక్తులతో నియమానుసార మారాధించి పరమశ్రేయస్సును పొందుము- శరీరబాధలు కలవారును ధన పుత్రాదులయందపేక్ష కలవారును, నిష్కాములును పరమేశ్వరి నారాధించి తయభీష్టములు పొందెదరు- చతుర్విధ కామ్యములయందును, పరమేశ్వరి నుపాశించు భక్తులలో, నిష్కామోపాసనచేయు, జ్ఞాను లుత్తము లనబడుచున్నారు-

ఇష్టకామార్థ సిద్ధికొరకు శ్రద్ధాభక్తులతో పరమేశ్వరిని సేవించి, సర్వప్రతిబంధములను వీడి, సుఖములనుభవించుట లోకప్రసిద్ధమై యున్నది. భక్తులు పరమేశ్వరి నారాధించి, తమ కామ్యసిద్ధిని పొందక పోవుట, భక్తుల భక్తిలోపమేకాని, పరమేశ్వరి లోపముకాదు. భక్తి తారతమ్యములచే, భక్తులు వుత్తమాధమ ఫలములను బొందుచుందురు. లోకమునందు ప్రభువులు తమను సేవించువారికి తగిన ఫలమిచ్చుటకు విమర్శించుచూ కాలక్షేపము చేయుదురుగాని, సర్వజ్ఞయు, సర్వాంతర్యామియునగు పరమేశ్వరి కర్మ పరిపాకానుసారము, భక్తాభీష్టమును వెంటనే తీర్చుచుండును. నిష్కామోపాసకులకు, కర్మపాక విధిలేకయే, (యోగక్షేమం వహామ్యహం) యోగక్షేమముల నొసంగెదనని, భగవానుడభయస్థమిచ్చియున్నాడు.

దయా సముద్రయగు గాయత్రి, నిష్కాముల సాధనముల నక్షయముగ పెంచి శీఘ్రముగ నధికఫలముల నిచ్చును. అదృష్ట, ప్రారబ్ధములను పూర్వ సంస్కారములు, గాయత్రిని శరణుజొచ్చని, హీనభక్తులను, త్రాచుపాములవలె ప్రతిబంధములు కల్పించునుగాని భక్తులను బాధింపజాలవు- ప్రారబ్ధము అనుభవింపక తీరనిది యను నియతి, మరి యొక విధముగ మారపడినను ప్రకృతిశాసనములగు యీ రెంటిను, భక్తియను దృఢమగు ప్రయత్నముచే నశించగలవు- ఇందుకు మార్కండేయ మహర్షి చరిత్ర ప్రమాణమగుచున్నది- ఈ విధముగా ప్రాణాయామాది సాధనములచేతను, కుంభకసిద్ధియందును, అట్లే జ్ఞానులకును ప్రాకృత ప్రతిబంధములు నశించును. మానవుల యొక్క యనుభవమును బట్టి ప్రారబ్ధము నూహించబడును. సత్య సంకల్పముగల గాయత్రి శక్తి

వలన ప్రారబ్ధము నియమింపబడిన దగుటచే, భ్రాంతి జనితమగు యీ ప్రారబ్ధము గాయత్రి భక్తులు తప్ప తదితరులు నిగ్రహింపజాలరు. పూర్వ కర్మఫలము పరిపక్వమగుటచే ప్రారబ్ధఫలము సంభవించును, శుభా శుభ ప్రారబ్ధఫలములను భగవద్భక్తుడే నిగ్రహించగల నధికారి, గావున కుత ర్కములమాని, నిష్కామముతో పరమేశ్వరి శరణు పొందుము. నిత్య సౌఖ్యము లభించదగిన మోక్షసిద్ధికి, పరమేశ్వరి భక్తి మొదటిమెట్టని హేమలేఖ చెప్పిన మాటలువిని, అనందముగలవాడై— ఓ పరశురామా? మరల భార్యతో హేమచూడుడిట్లనియె—

ఓ ప్రేయసీ! సర్వకర్తయు, జగన్నియంతయు, భక్త శరణ్య మగు పరమేశ్వరి మహిమను సావిల్యముగ వివరింపుము— జగదా ధారుడు శివుడని కొందరు, మరికొందరు విష్ణువనియు, సూర్యుడనియు, చంద్రుడనియు, గణపతియనియు, నృసింహుడనియు, బుద్ధుడనియు అగ్నియనియు, ప్రధానమనియు, పరమాణువులనియు పలు తెరంగుల చెప్పుదురు. నీవు స్త్రీవైనను వ్యాఘ్రపాద మహర్షి కుమార్తెవగుటచే నీకి యాత్మజ్ఞానము ప్రకాశించుచున్నది గావున నీకు తెలియని యదార్థముండ దని తలచెదను. నాయందు ప్రీతిగలదానవగుటచే నిత్యసుఖము లభించు టకుగాను, భక్తి శ్రద్ధలుగల నాకు యధార్థతత్వమును బోధింపుమనికోరగా హేమలేఖ సంతోషించి యిట్లనియె—

హేమలేఖ:— ప్రాణప్రియా? సర్వేశ్వరియగు గాయత్రి సృష్టి, స్థితి, లయములను జేయుచుండును. ఆ గాయత్రినే బ్రహ్మ, విష్ణు, మహే శ్వరాది నామములచే నాయా మతస్థులు వ్యవహరించుచుండెదరు— ఆయా

తత్వములన్నిటయందును నొక్క రూపముచే ప్రతిఫలించియున్న చైత న్యమె పరమేశ్వరికి లక్ష్యార్థము. బ్రహ్మ. విష్ణ్వాది స్థూలశరీరములెల్లను వ్యవహారమువందు వాచ్యార్థములగుచుండును గాని సత్యములుగావు- ఇందలి యధార్థములు చెప్పెద నాలకింపుము.

పైన ఉదహరించబడిన నాయామతస్థులు, నాయామతాధిష్ఠానమైన స్వరూపములనే కర్తగా భావించెదరు. జగత్తునందు కర్తృత్వము కేవల ప్రతిబింబ చైతన్యమునకుగాని కేవల శరీరమునకుగాని సంభవించనేరదు. వస్తు తంత్రమునకు నొక కర్త యవసరమైనయట్లు జగన్నిర్మాణమునకు చైతన్యసహితమగు శరీరియొకరుండవలెను- స్వప్నమందు స్థూలశరీ రము లేకయే వ్యవహారము జరుగుచుండునని తలచినను నా యవస్థ యందు, సూక్ష్మ శరీరావరణముండి తీరవలయును. ఈశ్వరునకు వ్యవ హార దశయందు నేదో యొక శరీరావరణముండి యుండినగాని వ్యవ హార నిర్మాణము కాజాలదు. శరీరాభిమానియగు జీవునకు స్వతంత్ర జ్ఞానము లేకపోవుటచే సాధనాంతరాపేక్ష నవసరమగుచున్నది.

పూర్ణ స్వాతంత్ర్యముగల పరమేశ్వరి యేవిధమగు సాధనాంత రాపేక్షలేకయే దృశ్యజగత్తును నిర్మించుచుండును. జగత్కర్తయగు పర మేశ్వనికి శరీర పరిగ్రహముండెనేని జగన్నిర్మాణమందుకు లాలునకువలె. నిమిత్త, ఉపాదానకారణములుండవలసివచ్చును. ఆ కారణముచె జీవులవలె యీశ్వరియు పరిమితురాలగుచు సరిపూర్ణమగు షడైశ్వర్యములేని దగు చున్నది.

ఈశ్వరియగు గాయత్రికి కూడా ఉపాదానాధికారణాంతరాపేక్ష యుండునని దలిచినయడల, యా ఉపాదానాదికారణములు సృష్టికి పూర్వ ముండి యుండవలెను. ఆ కారణముచే యీశ్వరి అకర్త యగుచున్నది. అట్లయ్యేనేని యీశ్వరి సర్వకర్తయనుట యసంభవము. ఈశ్వరికి ఉపాదానాద్యపేక్ష వుండుటవలన, అనేక దోషములు సంభవించుటచే సృష్టి నిమిత్తము యీశ్వరి స్వతంత్రయనుట యదార్థమైయున్నది. భక్తాభీష్ట ఫల ప్రదాతయగు పరమేశ్వరి అశరీరియు, సర్వాంతర్యామి యగుచు భక్తుల నుద్ధరించుటయందు దయగలదై; ధర్మ సంరక్షణార్థము కాలాను సారము శివాదినామములను ధరించుచుండును. ప్రతి శరీరమందును, త్రివిధావస్థలచే, మూడు పురములుగని యమించితాను తురీయావస్థ యందు ప్రకాశింపుచు యా మూడుపురములను ప్రకాశింపచేయుచుండును.- నా గాయత్రి సాన్నిధ్యమందు, తన షడైశ్వర్యములను ప్రతిఫలింప చేసు కొని, తురీయావస్థయందు నిలచి, జాగ్రత్స్వప్నాది మూడు పురముల యందుడు ప్రతిఫలించి ప్రకాశింపజేయుచుండుటవలన, యీ జగత్తు చితికి భిన్నముగ తోచినను, చిద్విలాసమగుటచేత చిద్భిన్నముకాదు.

జగత్తు భాసించినటుల చిత్తేల భాసింపదు యని సంశయింపకుము. బాలులు అద్దమునందు ప్రతిబింబితమగు శరీరములను మాత్రము చూచి యానందించెదరుగాని, ప్రతిబింబముల కాధారమును విమర్శింపని విధమున, సామాన్యులగు మందమతులు, చిత్ప్రతి బింబితజగత్తును చూచి భ్రమించెదరుగాని చితిని తెలియలేరు— బ్రహ్మ, విష్ణ్వాది సకలదేహముల యందును యీ చితియే కాకారముగ నుండుటవలన బుద్ధిమంతులకు యీ భేదభావము, అగ్రాహ్యము, అనుచితమగుచున్నది.

ఉత్తమ. నీచభావములు శరీర ధర్మములుగాని చితియందు గాన్పింపదు— గావున బుద్ధిమంతులు నిరవయమగు చితినుపాసింపవలయును. ఈ విధముగ నిర్గుణ చితిని ఉపాశింపలేనివారు. తమ కిష్టమగు, బ్రహ్మ విష్ణ్వాది రూపములను నిష్కామముతో నుపాశించి. వుత్తమ ఫలమును బొందుచున్నారు. శివ. విష్ణ్వాది శరీర గుణసహితమగు. ఉపాసనచేయువారు యెన్నికోట్ల జన్మలకైనను నిత్యానందమును బొందలేరు.

ఏడవ యధ్యాయము ముగిసెను.



# ఎనిమిదవ అధ్యాయః

తన ప్రియురాలగు హేమలేఖచెప్పిన వచనములనువిని. మూల ప్రకృతియైన గాయత్రి తత్త్వము చిన్మాత్రమై యున్నదని హేమచూడుడు నిశ్చయించి. భక్తి శ్రద్ధలచే గాయత్రి మంత్రమును భార్యవలన, నుపదే శింపబడి. నిశ్చలచిత్తముచే, కొంతకాల ముపాసనమొనర్చెను. "ఈశాను గ్రహాదేవైషా యస్సద్గురుస్స మాగమః" అను వచనమువనుసరించి, సద్గురు సమాగమములభించుట శ్రీపురాంబనుగ్రహ లక్షణమేయని నిశ్చ యించి, హేమచూడుడు గాయత్రి కటాక్షమువలన, స్రక్చందనాది విష యములయందు విరాగము గలవాడై స్వస్వరూపజ్ఞానముకొరకు చింతించు చుండెను. అట్టి స్వస్వరూపజ్ఞానము లభించుటకు యా పరదేవతాను గ్రహమే కార్ణమనియు ఉపాయమనియు తలంచి, స్వస్వరూపసాక్షాత్కా రముకొరకు తన భార్యయొద్దకు పోయెను. తనకొరకు వచ్చిన భర్తకు హేమలేఖ నమస్కరించి హితవాక్యములచే నిట్లనియే. ఓ నాధా! నీకారో గ్యమే: దా. సదా నన్ను తలంచుచుందువుగదా. ఇంతకాలము నన్ను జూడక ఎట్లు గాలక్షేపముచేసితిరి. అనుచు ఆలింగనమాచరించి క్షణకాలము మోహము కల్పించుచున్నట్లభినయించెను. ఈ విధముగ భార్యచే నాలిం గన మాచరింపబడియు ఏవిధమగు వికారమును పొందక, ఓ చెలీ నన్నేల మోహమునందు భ్రమ కల్పించెదవు. నీవు స్వయముగ, సర్వజ్ఞురాల వగుటచే ఇంద్రియ విగ్రహముగలనీకు మోహమెట్లు సంభవించును. అహంకారాది వృత్తులతోగూడిన శరీరము తుచ్ఛమనియు ఆభాసమాత్ర మనియు, దానికి సాక్షియగు చైతన్యమేనీవనియు, నిరంతర దృఢాభ్యాసము గల నీకు మోహమెట్లు సంభవించును. నేను నహితమట్టి మోహమునసే

క్షించి రాలేదు. పూర్వమున నీవుచెప్పిన, నీ కుటుంబవృత్తాంతము విస్సం దేహము తెలియగోరి వచ్చితిని. గాన నీ తల్లియవరు నీ చెలియెవరు. దాని భర్త యెవరు. దాని పుత్రులెవరు వారందరిప్పుడెచ్చట నున్నారో సవిస్తర ముగ తెలియచేయుము. నీ విదివరకు సత్యము చెప్పినను, గూఢముగ చెప్పుటచే గ్రహింపజాలనైతిని. నాకు నీకంటె హితము చెప్పువారెవరు. గాన నాకు సుబోధకమగునట్లు స్పష్టముగా చెప్పి సంశయనివారణ చేయు మని కోరుచున్న భర్తను హేమలేఖచూచి ఆనందముగలదై గాయత్రి యనుగ్రహము వీరికి గలిగినదనియు ఆకార్ణముచేతనే విషయములను విషప్రాయములుగ నిశ్చయించుటవలన చిత్తము నిర్మలమైనదనియు అంతఃకర్ణమందు గాయత్రి ప్రతిఫలించినదనియు ఆకార్ణముచే పూర్వ పుణ్యము ఫలించెననియు సద్బోధ చేయుటకిది తరుణమనియు తలచి, మీభాగ్యమెంతని వర్ణించెదను. ప్రాణనాధా! గాయత్రి అనుగ్రహములేక ఆట్టి వైరాగ్యము కలుగనేరదు. విషప్రాయ ములగు కామాది విషయము లను విరక్తిచే తృణప్రాయముగ నిగ్రహించితిరి. విషయములయందు విరక్తియు, స్వస్వరూపాసక్తియు, పరమేశ్వరి యనుగ్రహ లక్షణములు గావున, స్వస్వరూపమగు చిద్రూప లక్షణముజెప్పెద నాలకించుము.

పరచితియగు గాయత్రియె నాతల్లి. బుద్ధి నా సఖి. ఆ బుద్ధి తన సఖుడగు అవిద్యతోగూడి క్రీడించుచుండును. అవిద్యా సామర్థ్యమతి విచిత్రమని, విద్వాంసు విదితమే. ఈ అవిద్య వున్నదానిని లేనట్లుగను, లేనిదానిని వున్నట్లుగను కల్పించుచు, త్రాటియందు సర్పభ్రాంతి కల్పించు విధమున, అతి సంకటములను సంభవింపజేయును. నా యవిద్యకు మహా మోహుడను పుత్రుడుగలడు. అతనికి మనస్సు, కుమారుడు గలడు.

ఆ మనస్సునకు సంకల్పమను భార్య కలదు. ఈ దంపతులకు జ్ఞానేంద్రియములను ఐదుగురు కుమారుళ్ళుగలరు. వీరు చక్షుపురాది గోలములయం దుండెదరు. మనస్సునకు ఇంద్రియములను పుత్రులవలన. విషయములను సంపాధించుటయందనురాగవృత్తియే సంస్కారము. ఈ సంస్కారవశముచే మనస్సునకు విషయభోగములభించుచుండును. ఈ సంస్కారము వలన విషయములయందుగల సంకల్పమునకు ఆశయను సోదరిగలదు. నా యాశకు క్రోధము లోభమను ఇద్దరు కుమారుళ్ళుగలరు. నా యువికి, శరీరము నాకు స్వరూపధ్యానమే వ్రతము. మనస్సునకు స్నేహితుడు ప్రాణము. నీ సంఘాతమునకు సంచారము. (ప్రధానమైన యువికి) నరకమను మహారణ్యము. చిత్స్వరూపమైన నాకు బుద్ధితో సంగము సమాధియగును. పరచితియగు మాతృసమాగమప్రాప్తియే మోక్షమగును. గావున. నా వృత్తాంతమిట్టిదని తెలుసుకొని నీవును అట్టి భావనాసిద్ధి గలవాడవై సద్వివేక జ్ఞానముచే విమర్శించి ఉత్తమ పదమలంకరించుము.

ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము.



# తొమ్మిదవ అధ్యాయః

ఈ విధముగ హేమచూడుడు తన భార్యచెప్పిన జ్ఞానబోధ యాల కించి అతి విస్మయుడై నీవు చెప్పిన ఈ వృత్తాంతమును పూర్వము చెప్పి నప్పుడు తెలియజాలనైతినిగాని ఇప్పుడు సాంగముగ తెలిసినది. వృష్టి నిర్మాణము పరమాశ్చర్యమైనది. త్రిలోకమాతయగు పరచితి ఎవరు. లోకమా పరచితియందెట్లు నుదయించినది. మన స్వరూపములు వేర్వే రుగ నెట్లు సృజియింపబడినవి. ఈ విషయములనెల్ల సాంగముగ తెలియ జేయుమని హేమచూడు కోరగా హేమలేఖ ఇట్లని చెప్పదొడంగె.

ప్రాణేశ్వరా! మీరడిగిన రహస్యములను సావధానముగ నాలకిం చుము. దర్పణ సమానమగు అంతఃక్కరణమునకు రాగద్వేషములను మాలిన్యము సహజముగనుండును. అట్టి మాలి న్యములు నివారించదగిన ఉపాయములచే నిర్మలము గావించి మానసేం ద్రియ వికారములులేపి, నిర్మలబుద్ధిచే అంతఃక్కరణ ప్రతిబింబితమైన పరచితిని విచారించుము. ఆ పరచితి మానసేంద్రియములకు బాంహ్యా మందు దోచు దృశ్యకోటియందు గాన్పించునది కాదు గాన చెప్పుటకును చూపుటకు అలవిగాదు గాని సర్వదృశ్యములను దృగ్రూపముచే తెలుసు కొనుచున్న జ్ఞానరూపమెట్టిదో నిశ్చయించినయెడల లోకమాతయగు చిచ్ఛక్తి నీకు స్ఫురించగలదు. సర్వోపాధులయందంతఃక్కరణ ప్రతి బింబితమై సర్వజ్ఞానముచే తెలుసుకొనుచున్న దృగ్రూపమైనదే. చిచ్ఛక్తి యగు గాయత్రి యగును. వాసనారహితమగు నిర్మలమైన శుద్ధసత్వ బుద్ధిచే నిశ్చయించదగియున్నది గాని మానసేంద్రియములచే వర్ణించతగి నదికాదు. జ్ఞానరూపిణియగు యా త్రిలోకమాతయే స్థావరజంగమాత్మిక

మైన సర్వ ప్రపంచమునందుగల సర్వభూతాంతఃక్కరణయందు ప్రతి ఫలించి సర్వప్రపంచ నిర్మాణమునకు నాధారమైయున్నది- సర్వ ప్రపంచ మును జ్ఞానముచే యా గాయత్రి ప్రకాశింపజేయునుగాన యా గాయత్రి యగు పరచితిని ప్రకాశింపజేయు మరియొక ప్రకాశము లేదు. అకాశము నందుగల సూర్యుడు మేఘరహితమగునప్పుడు సర్వత్ర ప్రకాశించునట్లు వాసనాసరహితమగు బుద్ధియందు ఏ విధమగు సాధనాంతరాపేక్ష లేకయే స్వయముగా నాపరచితి నిర్మలముగ ప్రకాశించుచుండును. ఆ పరచితి స్వప్రకాశమైనదైనను అంతఃక్కరణము వాసనాసహితమగు మాలిన్యము గలదైన యెడల మాలిన్యసహితమగు బుద్ధికి స్ఫురించదు.

మేఘావర్ణమువలన, సూర్యుని స్వప్రకాశమునకును స్వగమనమున కెట్టి ప్రతిబంధము లేనివిధమున, అంతఃక్కరణ రూపమైన బుద్ధియందెట్టి మాలిన్యమున్నను అంతఃక్కరణ ప్రతిబింబితమగు పరచితికి స్వభావ మగు జ్ఞానము అంతర్ముఖమైనయడల స్వప్రకాశమునకును స్వస్వరూప జ్ఞానమునకు నెట్టి ప్రతిబంధము కలుగజాలదు. సూర్యుడు స్నిగ్ధవస్తువు లందు స్ఫురించునట్లు పరచితి నిర్మలమగు సత్త్వగుణాంశమైన బుద్ధి యందు ఇతరాపేక్షలేకయే జ్ఞానము ద్విగుణముగ ప్రకాశించును.

పరాపేక్షలేక స్వయముగ ప్రకాశించు పరచితి స్వసంవేద్యమగును గాని పరులచే ఇట్టిదని నిరూపింప శక్యముకాదు. తన నేత్రమును నేత్ర ముకు జూప ఎంతనేర్పరియగు గురువైనను సమర్థముకానట్లు స్వస్వరూప మగు పరచితిని తాను గ్రహించవనగునుగాని పరులచే జూప సాధ్యమగును. అట్లయినయడల, గురు మహావాక్యమువలన ప్రయోజనమేమనగా.

ఆభాసమాత్రమై కల్పిత నామరూపములచేదోచు జగత్తు అనిత్యమనియు నామరూపముల కాధారమై కాష్ఠరూపమై లక్ష్యార్థమగునట్టియు సర్వాధారమై సర్వ సాక్షియగు పరచితిని తెలియదగిన, అంతర్లక్ష్యమును బోధించు టకు సాధనమగును. ఆ బోధవలన. త్వంపదార్థ లక్షణమైన తనకు తత్పదార్థ లక్ష్యమైన పరచితి సాక్షాత్కారమునకు ముఖ్యసాధన మగుచున్నది. బాహ్యమందు దృశ్యమగు సర్వరూపములు నీచే అన్యముగ గుర్తించ బడునట్లు కరచరణాద్యవయవ సంఘాతముతోగూడిన ఇరువదినాల్గు తత్త్వ ములు నీచే గుర్తించబడుచున్నను నీ కన్యముగ దోచుటలేదు. ఆ కార్ణ ముచే దృశ్యమగు సర్వప్రపంచమునకు దృగ్రూపమైన సాక్షియగు పర చితి తత్త్వమే నీవను అభిమానము సైతము కలుగుటలేదు. అయినను నిర్మలబుద్ధితో విచారించుము. నీ కన్యముగా దృశ్యమగుచు నీవియని యభిమానించుచున్న సర్వపదార్థములు నశించినను విషయభావా భావ ములయందు సదా నిత్యమై ప్రకాశించు చిత్స్వరూపమే నీవని భావిం చుము.

ఈ విషయమునం దనుమానముంచకుము. పరచితి సాన్నిధ్య మందుగల అహంకారమువలన, నాది నేను అను స్ఫూర్తి కలుగుచున్నను నా యహంకారము ఆత్మ కానేరదు. అహంకారాది సర్వవృత్తులనెల్లను సాక్షియై తెలుసుకొనుచున్న జ్ఞానమే నీవని భావించుట సాధనోపాయమగు చున్నది. నహంకారముచే పొరపాటున పరుషవాక్యములు బలికితిని. మనస్సు నిశ్చలములేదు. అనువ్యవహారమువలన అహంకారాది సర్వ తత్త్వ వృత్తులను సాక్షియగు పరచితి గ్రహించుచుండునుగాని, ఆ పరచి తిని గ్రహించదగిన, మరియొక స్వప్రకాశమైన సత్పదార్థములేదు. గాన,

సర్వము తెలుసుకొనుచున్న జ్ఞానమే నీ స్వరూపమని భావింపుము అని చెప్పిన భార్యయగు హేమలేఖ వాక్యముఁనువిని హేమచూడుడు పురోప ఉద్యానవనమందుగల స్ఫటికసౌధముయొక్క తొమ్మిదవ అంతస్థుయందు ఏకాంతముగ ప్రవేసించి సర్వదృశ్యరహితమగు నిశ్చలబుద్ధిచే పరచితిని విచారించుచు తన యనుమతిలేక లోపలికెవ్వరిని రానివ్వవలదని ద్వార పాలకుల నియమించి కిటికీవద్ద శయ్యేయందు కూర్చుండి ఏకాంతముగ, తత్వవిచారణము చేయుచుండెను.

తత్త్వవిచారములేని వ్యవహారకాలమెల్లను స్వప్నతుల్య మగు చున్నది గావున, ఆత్మ విచారము చేయుదునని ఇట్లు తలంచెను.

లోకమునందగ్రాహ్యమగు ధనధాన్య పశుపుత్రాది సేవకులనెల్ల నావియని చెప్పుచుందురు గాని వానినెల్ల నేనని ఎవరు చెప్పరు. యీ విష యములెల్లను దేహయాత్రకు పయుక్తములగుటచే నావియని చెప్పుట కొంత యుక్తమని తలచినను దృశ్యమగు తమతమ దేహ ములను దేహ సంబంధమగు కులరూపాశ్రమ విధుల నాధిక్యముగ తలంచుచు వానియం దాత్మత్వబుద్ధిచే భ్రమజెందు మానవులను అహంకారమను బ్రహ్మ రాక్షసి బహుకాలమునుంచి పీడించుచుండును. అహో మానవులకుగల అజ్ఞాన జనిత మోహమునేమని వర్ణించవలెను. జగత్కారణ రూపిణియగు పర చితి తత్త్వమునెరుంగవలెనను తలంపైనను లేక, శాస్త్రములను జదువుచు ధనమార్జించుచు, రాజ్యమేలుచు మధాంధులై అజ్ఞానాంధకార పశులగుచు, ఇంద్రియ భోగములకొరకు ఆత్మస్తుతి పరనింద గలవారై, సర్వత్రా ద్వేషించుచుండెదరు.

ఈ యజ్ఞానావరణ ప్రభావము వర్ణింప నసాధ్యమైనది. రక్తమాంస పురీషయుక్తమగు ఈ దేహము రోగభూయిష్ఠమై ప్రతిక్షణమునందు, దుఃఖమును పొందుచున్నది. దేహమెన్ని ఖండములు చేసినను, ఆయా ఖండములెల్ల నావియను మమకారము కలుగుచున్నది. సర్వదేహములు రాయికర్రలవలె జడపదార్థమైయున్నది. స్వప్నమందలి సర్వ వ్యవహారములు జాగ్రతయందు శూన్యమైనట్లు జాగ్రదావస్తయందు సంభవమగు సర్వ వ్యవహారములు తురీయమందు శూన్యమగుచుండునట్టి ఈ దేహ భ్రాంతిని విచారించగా ఇంద్రజాలమువలె నసత్యమగుచున్నది. ఆ విధము గానే గతించిన జన్మలును అందలి వ్యవహారములును అసత్యమేయగును. అట్లయినయడల జన్మకు మూలమైన ఈ దేహమెట్లు సత్యమగును. ఆ కార్ణముచే స్థూలదేహ మగ్రాహ్యమైనయడల అట్లె సూక్ష్మదేహమును అజ్ఞానాత్మకమగు కారణదేహమును అగ్రాహ్యము నసత్యమునగుచున్నది. గావ అసత్యమగు త్రివిధ దేహములును వాని వ్యాపారములును పరచితి యనరాదు. జాగ్రదాది సర్వావస్థలయందును త్రివిధ దేహకృతమగు సర్వ వ్యవహారములను సదా గ్రహించుచు వానిసత్యాసత్యముల నెరుంగుచున్న చిద్రూపుడనగు నేను స్వప్రకాశముచే సదా ప్రకాశించుచుండెదను గాని, ఏ యవస్థయందలి వ్యవహారములు నాకు తెలియకుండా జరుగజాలక పోయినను నాచే తెలియబడు వ్యవహార జనిత వికారములు నన్నంట జాలవు.

దేహమును సుషుప్తినుంచి మేల్కొంచినప్పుడు సుషుప్తియందలి సుఖానుభవము నావలన, జాగ్రతయందు బుద్ధికి తోచుచుండును. సర్వా వస్థలయందలి వ్యవహారములను నేను సదా చూచుచుండుటచేతనే, సర్వ

విషయములు తెలుసుకొనతగిన జ్ఞానము నావలన బుద్ధికి సంభవమగు చున్నది. ఈ విధముగ సర్వావస్థలయందును సదా భాసించుచు సర్వము తెలుసుకొనుచున్నను స్వస్వరూప జ్ఞానసిద్ధి లభించకుండుటకు కార్ణము తెలియకున్నది. ఘటపటాదులు నేత్రముచేతను వాయువును త్వగింద్రియము చేతను మనసు సంకల్పముచేతను గ్రహించతగియున్నది గాని, మనస్సును గ్రహించునదేదియో గ్రాహ్యము కాకున్నది. దర్పణమందలి ప్రతిబింబమును చూచినప్పుడు ప్రతిబింబాధారమగు దర్పణమందు స్ఫురణ కలుగనట్లు దేహేంద్రియ వ్యాపారమునందు లక్ష్యముండునపుడు వాని కాధారమగు చిద్రూపము స్ఫురింపదు. గావున పరచితి యవలోకన కొరకు వాసనాసహిత, దృశ్య జగద్భ్రాంతివిడచి విచారించెదననితలంచి, ఇంద్రియాది సర్వదృశ్యము నిరశిలచిన వెనుకదోచునట్టి అంధకారము (శూన్యము)ను జూచి యా శూన్యమే చిద్రూపమని తలంచి మనస్సునం దట్టి ధ్యానము నుపేక్షింపగా క్షణమాత్రములో చిత్తము బహిర్ముఖమై తేజస్సు గాన్పించెను. ఈ విధముగ అంధకారమును తేజస్సుమజూచి అందాత్మ రూపమేదియో నిశ్చయింపజాలక సంశయము గలవాడై చిత్తమును మరల నియమించి సుషుప్తి నిపొంది సుషుప్తినుండి స్వప్నావస్థ నవలంబించి, అందుకొన్ని దృశ్యములుగని తిరిగి జాగ్రతను పొంది జాగ్రతయందంధకార తేజముల వృత్తాంతమును కొంత విచారించి అంతర్మానస ప్రపంచమగ్రాహ్యమని, నిగ్రహించి, క్షణమాలోచించి మానసేంద్రియ ప్రచారము మరల నిరోధించి బాంహ్యాభ్యంతర శూన్యమగు ఆనందము గలవాడయెను.

ఈ విధముగ చిత్తమును నియమించి. ఎన్ని పర్యాయములు విచారించినను క్రమక్రమముగా త్రివిధావస్థల నొందుచు నా యవస్థయందనేక చిద్విలాసములు దోచుచుండుటచే చిత్స్వరూపిణియగు గాయత్రి స్వరూప నిశ్చయము చేయజాలక భార్యను పిలువనంపెను. భర్తచే పిలువనంపబడిన హేమలేకవచ్చి మానసేంద్రియములను నియమించి సుషుప్తియందున్న వానివలె నిశ్చలుడైయున్న భర్త శయ్యయందు కూర్చుండెను.

అంతట హేమచూడుడు ఒక క్షణములో బాహ్యంతృష్టి గలవాడై భార్యనుజూచి ఓ కాంతా! నీవు చెప్పినట్లు ఇంద్రియముల నియమించి ఏకాంతమందు ఆత్మ విచారముచేయుచుండగా ప్రథమమున, బాంహ్య దృష్టినిరపించి అంధకారమును జూచితిని. మరికొంతసేపటికి ప్రకాశమైన తేజస్సు గాన్పించినది. దృశ్యమున్నంతవరకు ఆత్మ రూపస్ఫురణ కలుగదని తలంచి మరల మనోనిరోధము గావించగా ఒకమారంధకారమును మరియొకతరి తేజస్సును జూడగలిగితిని. అందాత్మరూపమేదో వివరింపుమనగా,—

హేమలేఖ:— నాథా! నీచే గావింపబడిన చిత్త నిరోధ సాధనము శాస్త్రసమ్మతమై శుభప్రదమగుచున్నను కేవల చిత్తనిరోధనమను సాధనముచే ఆత్మ సాక్షాత్కారము లభించుట కడు దుర్లభమగుచున్నది, సాధనాపేక్షగల జడవస్తువులవలె కార్య సాధనమందాత్మ ఇతర సహాయమునపేక్షింపబడు ఆత్మ సదా నిత్యమైనది. దృశ్యమెల్లను జడమగుచున్నది. జడమగు అనాత్మ వస్తువుకు కార్యసాధనమందు సాధనాంతర మవశ్యమగును గాని, శాశ్వతమగు ఆత్మకు సాధనమవసరమగును. చిత్త నిరోధ

మను సాధనమువలన చిత్తాత్మకు మపాధియైన బుద్ధి మాలిన్యములను తొలగించుటకే గాని, స్వరూపజ్ఞానమున కుపయోగించదు

ఇట్లు చెప్పుటచే చిత్తనిరోధ మనవసరమని తలంచకుము. అంధకారమందున్న వస్తువు, దీపముచే ప్రకాశించు విధమున చిత్తనిరోధ సాధనమువలన, అజ్ఞానావరణము నశించి ఆత్మ జ్ఞానము సంభవించును. వెలుతుడు వస్తువును గ్రహించుటకు కారణమైనట్లు, చిత్త నిరోధమువలన అజ్ఞానాంధకారము నశించి ఆత్మ జ్ఞానోదయమగును. కంఠాభరణము పోయినదని భ్రాంతి చెందినవానికి భ్రమ నశించినవెనుక ఆభరణము కంఠమందు గలదని సంతసించువిధమున, దేహాభిమానముచే ఆత్మజ్ఞానము లేనివానికి చిత్త నిరోధమువలన, అజ్ఞానము నశించి, స్వరూపజ్ఞానము లభించును. ఆత్మనిత్యమగుటచే మేఘావరణమందును, ఆవర్త హితమందును, సూర్యుడెట్లు సదా ప్రకాశించుచుండునో ఆ విధముగ, జ్ఞానప్రకాశముగల ఆత్మ జ్ఞానా జ్ఞానములయందును ప్రకాశించుచుండును. మేఘ అజ్ఞానావర్తములు, దృష్టి దోషముగల అజ్ఞానులను మాత్రము బాధించునుగాని, యదార్ధ తత్త్వవేత్తలగు జ్ఞానుల దృష్టికి బాధకములుగావు. పరచితి ఘటపటాదులవలె క్షణికముగాక సత్యమై జ్ఞానప్రకాశము గలదనియు నిశ్చయింపుము.

స్వయంప్రకాశమగుచు భాస్వరమై సర్వవస్తు భాసకమగు జ్ఞానమునకే పరిచయ జ్ఞాన మనదగియున్నది. అట్టి స్వప్రకాశమై సర్వము ప్రకాశింపజేయు జ్ఞానరూపమైన పరచితి పరిచయ జ్ఞానము నీకు లభించనందున పరతత్త్వమును గుర్తింపజాలనైతివి. వివేకము లేనివాడు రాత్రికాలమున

రాజసభకుపోయి దీప ప్రకాశమందు సభవారినెల్లజూచి యా సర్వము ప్రకాశింపచేయుచున్న దీపము నెరుంగనట్లు అంధకారమువంటి మోహముచే రాజసభవంటి సంసార విలాసమందు సభ్యులవంటి దేహేంద్రియాదులను దీప స్తంభమువంటి బుద్దిని తెలుసుకొవియు, వీనినెల్ల ప్రకాశింప జేయు దీపము వంటి పరచితి నెరుంగకుండుట లోక సహజమగుచున్నది. గాన సర్వము ప్రకాశింపజేయుచు తాను సదా ప్రకాశించుచుండునదే పరచితియనియు నా పరచితియే నీవనియు గ్రహించుము. అనుచు ఈవిధముగ కొన్ని దృష్టాంతరములనుచెప్పి సులభముగ ఆత్మస్వరూపమును బోధింపదలచి మరియు హేమలేఖ ఇట్లనియె.

ఓ నాధా! దేహాదులకంటె అన్యమై యా దేహాది సర్వలక్షణములను తెలుసుకొనుచున్న జ్ఞానమే ఆత్మ ప్రకాశము చిత్త నిరోధకాలమున ఇంద్రియమనంబులు వృత్తి రహితమగుటచే శూన్యమగు అంధకారము దోచును. ఆ యంధకారమును తెలుసుకొనుచున్న తెలివిమాత్రము మిగిలియుండును. చిత్త నిరోధములేని కాలమున సంకల్ప వికల్పాదులచే మనోకల్పిత జగత్తెల్లను పరచితిచేతనే ప్రకాశించుచుండును. సవికల్ప నిర్వికల్పాది సర్వావస్థాదులయందును నాయా అవస్థా లక్షణములను తెలుసుకొనుచున్న జ్ఞానమునకు నీవే యాధారమగుచున్నావు. చిత్తము నిరోధించబడిన, నిర్వికల్ప దశయందు అవిద్యా సంపర్కములేని ఉపాదిరహితమగు కేవల నిర్విశేష జ్ఞానము ప్రకాశించుచుండును. స్వప్రకాశముగల యా చైతన్యమునే జ్ఞానరూపిణియగు గాయత్రి యనబడుచున్నది. చిత్తమందు ప్రతిఫలించియున్న చిద్రూపము నీ కన్యముగాదని తెలుసుకొనుము.

కొందరు విద్వాంసులు శాస్త్ర పాండిత్యము గలవారై పూర్వపక్ష సిద్ధాంతములనుజేయుచు, వాదమందు జయము గాంచినను, వాసనా ప్రతి బంధమునందుజిక్కి మోహము గలవారై స్వరూప సాక్షాత్కారము గాంచలేక, సదా శోక మోహముల మునుంగుచుండెదరు. ఈ యర్థమునే "పశ్యామీతి, పరాగ్వ్యప్తేరలభ్యం తత్పరంపదం" అను స్మృతి శాస్త్రార్థ పరిజ్ఞానమువలన పరోక్షజ్ఞానము సంభవించినను స్వరూపజ్ఞానము లభించ దని తెలియగోరుచున్నది. శబ్దాతీతమై సర్వాధారమగుచు రూపనామ రహితమగు పరచితి అజ్ఞానరహితమగు నిధి ధ్యానలచేతను సద్గురు యనుగ్ర హము వలనను లభించదగియున్నది. సంకల్ప త్యాగమువలన, జ్ఞాన రూపిణియగు పరచితి సాక్షాత్కరించును సంకల్ప సహితమగు మనస్సు చలించుచున్నంతవరకు పరచితి స్ఫురణ కలుగదు గావున, లోకమాత యగు పరచితిని సామాన్యులు గ్రహించజాలరు.

తన నీడయందుగల శిరోభాగమును పాదములచే దాటదలచి ఎంత పరుగెత్తినను దాటజాలని విధమున, సంకల్పరూపమగు మనోచలనము నందు లక్ష్యమున్నంతవరకు స్వరూప జ్ఞానసిద్ధి లభించనేరదు. బాలుడు దర్పణ ప్రతిబింబమునుజూచి సంతసించునుగాని, ప్రతిబింబాధారమగు దర్పణమందు లక్ష్యముంచ విధమున, మానవులు ప్రతిబింబితమగు జగ ద్విలాసములను జూచి మోహపడుచుండెదరు గాని, జగత్తున కాధారమగు చిద్దర్పణము నెరుంగజాలరు. ఆకాశస్వభావమెరుగనివాడు, అకాశమందు ఇమిడియున్న జగత్తునుజూచి భ్రమపడునుగాని ఆకాశాది సర్వజగత్తెల్ల నాభాసమనియు, అసత్యమనియు తెలియజాలడు.

ఆత్మావలోకన తత్పరుడగు జ్ఞాని తనకు తెలియబడుచున్న జగత్తు కల్పితమనియు, దృశ్యమాభాసమనియు నిశ్చయించి నహంకారాది సర్వ

తత్వములను వాటి వృత్తులను నిరసించి సర్వాధికారమును, స్వప్రకాశ
మును, శాశ్వతమునగు పరచితి తత్వమును తెలుసుకొనుటయందు తత్వ
రుడగును. సమాధియందువలె సుషుప్తియందును, అవిద్యా విలాసమెల్లనూ
లయించుటచే ఆనందము భాసించునుగాని, సమాధియందు సర్వము
తెలుసుకొనదగినదీ వృత్తి జ్ఞానము ప్రకాశించుచుండును. సుషుప్తి
యందట్లుగాక, అంతఃకరణాది సర్వేంద్రియములు అవిద్యయందు
లయించుటచే ఆనందమును తెలుసుకొనతగిన ధీవృత్తి నశించుచున్నది
గాన, సుషుప్తి సమాధులయందు అవిద్యావిలాసమెల్ల నశించుటచే, పర
చితి స్వయంప్రకాశమై ప్రకాశించుచుండును.

ఆకాశమువలె సర్వత్రా వ్యాపించియుండు పరచితి జ్ఞానముచే సదా
ప్రకాశించుచు జ్ఞేయమగు జగత్తును ప్రకాశింపచేయదగిన శక్తిచె సర్వము
తెలుసుకొనతగిన వృత్తులుదయించుటకు అవిద్యా కల్పితాంతఃకరణ
సాధనమై యున్నది. అట్టి అంతఃకరణ సంభవమగు వృత్తి సమాధి
యందును, సుషుప్తియందును, అవిద్యయందు లయించుటచే జ్ఞేయమగు
మరియొక వస్తువు గాన్పించదు. గాని సర్వావస్థలయందును సర్వాధిష్ఠాన
మగుచు విద్యా విద్యలను ప్రకాశింపజేయదగిన పరచితి ప్రజ్ఞానముచే సదా
ప్రకాశించుచుండును. ఆకారణముచే జ్ఞానము రెండువిధము లగుచున్నది.
అందొకటి బుద్ధ్యుపాధి సహితమైనప్పుడు వృత్తిజ్ఞానమనియును మరి
యొకటి ఉపాధిరహితమైనప్పుడు వృత్తిరహితమగు ప్రజ్ఞానమనియు
తెలియదగియున్నది. గావున "తస్యభాసా సర్వమిదం విభాతి" అను
ప్రకాశము తెలుపబడియున్నది. పరచితి అంతఃకరణమందు ప్రతి
ఫలించి బుద్ధ్యుపాధి జనిత, జ్ఞానవృత్తిచే జ్ఞేయమగు జగత్తును జ్ఞానముజ్ఞే

యము జ్ఞాతయను త్రిపుటి లక్షణములచే భాసింపజేయునట్టి ప్రజ్ఞనే అవిద్య యనదగియున్నది.

నాయవిద్యా మహిమవలన. నిర్మితమగు ప్రకృతి, ప్రమాణ సంభవమగు వృత్తిజ్ఞానమగుచున్నది. అట్టి వృత్తిజ్ఞానము బుద్ధ్యాది సంభవము గాని, జ్ఞానస్వభావముకాదు. జడమగు జగత్తు జడమగు అంతఃకరణ యందు జ్ఞానముప్రకాశించినప్పుడు మాత్రమే ప్రకాశించునుగాని, జ్ఞానప్రకాశము లేనియెడల అంతఃకరణయు ప్రతిబింబిత జగత్తును భాసింపజాలవు. దర్పణ ప్రతిబింబ ప్రకాశమునకు దర్పణము కారణమైనట్లు జ్ఞాన ప్రకాశమునకు అంతఃకరణ కారణముగాదు. వాచ్యార్థమందు నిమిత్తకారణ మగుచు స్వప్రకాశముగ సదా ప్రకాశించుటయే గాక జగత్తును ప్రకాశింప జేయుచుండును. ప్రతిబింబితశక్తియు తదభావశక్తియు, దర్పణ ధర్మములైనట్లు జగత్తును తెలుసుకొనదగిన జ్ఞానము, తదభావజ్ఞానమును, అంతఃకరణ యందు బుద్ధి ధర్మములగుచున్నవి. స్వయంప్రకాశమగు జ్ఞానము ప్రతిఫలించదగిన, అంతఃకరణము, గుణదోష మాలిన్యము గలదైనయెడల నిర్దోషముగ ప్రకాశింపజాలదు. ఆ కారణమువలన. దర్శన దృశ్యములకు ద్రష్టత్వము మనస్సుయందు భావించి వికారమును పొందుచుండునుగాని, సర్వద్రష్టయగు పరచితిని తెలియజాలదు.

"నహికర్తవం జ్యోతిః దీపాలోక మపేక్షతే" అను వచనాను సారము సర్వసాక్షియగు పరచితి ప్రకాశమునకు ఇతరాపేక్ష సంభవించదు. ప్రత్యక్షాది సర్వమును సర్వ ప్రమాణములను ప్రకాశింపజేయు పరచితిప్రమేయాది సాధనములనపేక్షింపక సర్వమును ప్రకాశింపజేయ సమర్థత గలదగుచున్నది.

కార్యసాధనములగు పనికరములు వ్యక్తి సహాయమువలన కార్య సాధకమునట్లు, జడమగు మానసేంద్రియములు జ్ఞానదీప్తివలన, జ్ఞేయమగు జగత్తును భాసింపజేయుచుండును. ఆ విధముగనే మనసేంద్రియాది జడ వస్తువులెల్లను, జ్ఞానప్రకాశమువలన, స్వప్రకాశము గలవై ప్రమేయ వస్తువులందు ప్రమాత యాజ్ఞానుసారము ప్రవర్తించుచుండును. జ్ఞానమేక రూపమగుటచే యాజ్ఞానమును తెలుసుకొనదగిన మరియొక జ్ఞానము సృష్టియందు సంభవింపదు గావున, పరిచితిని తెలుసుకొనుటకు నిర్విశేష జ్ఞానమే ముఖ్యసాధన మగుచున్నది. జడ పదార్థములెల్లను పరచితి జ్ఞానాభాసములేనియెడల, ఎట్టి కార్యమును చేయుటయందుగాని సిద్ధిగాంచుట యందుగాని స్వతంత్రములుగావుగాని, యీ పరచితికెట్టి ఇతరాపేక్ష యులేక, త్రిపుటి రూపము దానయగుచు కార్యము సాధించుచుండును.

ఇట్టి అవిద్యాప్రభావముచే జగన్నిర్మాణ సామర్థ్యముగల గాయత్రి యందు ఆస్తిక్యముగల భక్తులకు మాత్రమీ విలాసార్థ రహస్యములు సుబోధకములగును గాని, నాస్తికులకెట్టి యుపయోగమును చేయజాలవు. జగదుత్పత్తిస్థితిల యాదులు సర్వావస్థలయందును ప్రతిబింబమునకు దర్పణాధారమువలె జ్ఞేయమగు జగత్తునకు జ్ఞాతయగుచు, జ్ఞానముచే తెలుసుకొనుచున్న స్వప్రకాశమగు చిద్రూపము సర్వత్రా సదా గోచరించు చుండ, యాత్రిక లోకమాతయగు పరచితిలేదని తలంపకూడదు. జ్ఞానముచే తెలియబడుచున్న జగత్తునందు నియామకములై దోచుచున్న దేశ కాలాది ధర్మములు, వస్తుతంత్రములై ఉపాధికల్పితములగును గాని, జ్ఞాన బాధకములు గావు. వృత్తిశూన్యమగు సత్వగుణాంతఃకరణ (సమాధి) యందు ప్రతిఫలించి ప్రకాశించు వృత్తిరహితమగు పరచితిరూపమే నీవని భావించుము.

అంతఃకరణ తదాత్మ్యమును పొందినప్పుడు ఆ పరిచితి స్వభావ మగు అవిద్యా ప్రభావమువలన జగదాకారముగ భాసించుచుండును. ఘట మందిమిడియున్న మట్టి సూక్ష్మరూపముచే సామాన్యముగభాసించి పృధివి యైనట్లు జగద్రూపముగ భాసించుచితియే. సమాధియందు సూక్ష్మాకార ముగ భాసించుచుండును గాన, ఆ సూక్ష్మచైతన్యమైన పరచితియేనవని. నిర్మలబుద్ధిచే మననము చేయుము. జగదాధారమగు అంతఃకరణ ప్రతి బింబితమై, అంతఃకరణ జనిత ఉపాధిధర్మములేని సూక్ష్మచైతన్యమే నీవని సదా భావించుచుండునట్టి నిర్వికల్ప సమాధివలన జగత్కారణ రూపిణియగు పరచితి యందైక్యస్థితి లభించగలదు. యా స్థితికి నొక్క యుపాయ మాకర్ణింపుము.

నిర్వికల్పమగు గాఢ సుషుప్తికిని సవికల్పమగు జాగ్రతకును, మధ్య సంధికాలమందు భాసించుచు. చైతన్యజ్ఞానమే పరచితి యనియు, యాజ్ఞానమే నీవనియుభావించుము. జాగ్రదాది త్రివిధావస్థలు లోకవిదితమై యున్నవి. నీ యవస్థలు దేహస్వభావములగుటచే చితి స్వభావజ్ఞానము నావరించియుండును. యాచితి జ్ఞానమువలన త్రివిధావస్థ లక్షణములను సదా తెలుసుకొనుచుండును. సుషుప్తి జాగ్రతావస్థల సంధికాలమున మనస్సు సూక్ష్మాకారముగ నుండుటచేతను, దృశ్య జగత్తును తెలుసుకొన దగిన సత్తాలేని సమయమున, ప్రకృతి సంభవమగు తమోగుణాదులు విజృంభించి యావరించకపోవుటచే స్వస్వరూపజ్ఞానము గోచరించుచుం డును ఘటపటాది రూపములను వేర్వేరుగ జ్ఞానము తెలుసుకొనుచున్నను జ్ఞానమేకరూపమై యున్నది. జ్ఞానమొకప్పుడు విశేషముగను మరియొక

తరి నిర్విశేషముగను. భాసించుట తటస్థించినను యాజ్ఞాన కర్తమగు పర
చితి నేకాకారమై యున్నది.

విషయములకును. విషయములను తెలుసుకొను జ్ఞానమునకును
మధ్య ప్రకాశించు నిర్విశేష జ్ఞానము. పరచితి స్వభావమై యున్నది.
ఆ జ్ఞానము అంతఃకరణ తాదాత్మ్యను పొందినప్పుడు నహంకారాత్మక
మగు ద్రష్ట యగుచున్నది. నదీ జలము కాల్వలద్వార తూములయందు
ప్రవహించి మళ్ళయందదేక రూపములను దాల్చు విధమున అహంకార
యుతమై ద్రష్టత్వమును పొందిన జ్ఞానము ఇంద్రియముద్వారా అనేకము
లగు ద్రవ్యాకారములను పొందుచున్నది. ఆకాశమందుగల సూర్యబింబ
మునకును దర్పణ ప్రతిబింబమునకును మధ్యగల ప్రకాశమువలె ద్రష్ట
రూపమగు నహంకారమునకును. చితికిని మధ్య ప్రకాశించు జ్ఞానమే
నిర్విశేషజ్ఞాన మగుచున్నది. సూర్యబింబాహారాదులు చైతన్య ప్రకాశమగు
పరచితిని గ్రహించుట కుపాదులగుచున్నవి.

జగత్తును తెలుసుకొనుచున్న ఇంద్రియములను, సర్వేంద్రియాధి
ష్ఠానమగు నహంకారమును సదా తెలుసుకొనుచున్న నిర్విశేష జ్ఞానమే,
పరచితికి యుపాధియగును. అట్టి జ్ఞానోపాధి సహితమగు పరచితి తానని
భావించిన తత్త్వవేత్తకు, పరమగు ప్రధానమెద్దియు గాన్పింపదు. అట్టి
తత్వవేత్త మోహసాగరమున జిక్కుపడదు. సంశయ పర్యాత్మకమగు
మనోవిగ్రహములేని అజ్ఞానికి దుఃఖరూపమగు సంసారము ప్రాప్తమగును.
అవిద్యా నిలయమగు అంతఃకరణోపాధి సంపర్కములేని నిర్విశేష
జ్ఞాన చైతన్య ప్రకాశమే గురుస్థానముగ భావించునట్టి జిజ్ఞాసులకు జగన్ని
వాసునగు సద్గురు వానుగ్రహమువలన, ప్రతిబింబిత జగత్తెల్లను అంతః

క్కరణ జనితమని భావింపదగిన నిశ్చయజ్ఞానములభించగలదు. చిత్తరువు నందు గోచరించు వ్యాఘ్రమువలన, ఎట్టి సంకటసంభవించని విధమున, పరిదృశ్యమగు జగత్తునందెట్టి విషయమువలనను, దృగ్రూపుడగు తనకెట్టి ప్రతిబంధకము కలుగజాలదు. అట్టి శుద్ధసత్వ ప్రధానమగు నిర్విశేష జ్ఞాన సిద్ధియె స్వరూపసిద్ధియనియు, పరమ పదమనియు తెలుసుకొనుము, అట్టి పద మలంకరించినవారికే, "అభయంవైజనక ప్రాప్తోసి" అను వచనముచే ప్రమాణము తెలుపుచున్నది.

ఆభాస ప్రతిబింబాధారమైన దర్పణ జ్ఞానము సంభవించునప్పుడు ప్రతిబింబరూప సంభవమగు భయభ్రాంతులు నశించువిధమున, సర్వాధిష్టానమగు పరచితి జ్ఞానము లభించినతోడనే "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే, పరిసమాప్యతే" అనువచనముచే, ఉపాధి సంభవమగు సుఖదుఃఖాది కర్మబంధమెల్లను నిర్విశేష జ్ఞానోద్భవ కాలమందు అదృశ్యమగును, ప్రతిబింబము, బింబావలోకన మైనప్పుడభావమైనట్లు, సర్వజగదాధారమగు పరచితి జ్ఞానసిద్ధి సంభవించినయడల అంతఃక్కరణ ప్రతిబింబిత జగత్తునందభావము సంభవమగుటచే భ్రాంతివలన ఆభాస మాత్రముగ దోచుచుండును.

భ్రాంతి నశించినయడల శూన్యమగును. ఇదివరకొక పర్యాయము చెప్పబడిన, నా కుటుంబస్థితిని గురించి మరల ప్రశ్నచేసి యుంటివిగాన, మరల చెప్పెద నాలకించుము.

నిత్యము నిర్మలము నిరాకారమునగు శుద్ధ చైతన్య అసంగ చిద్రూపిణియే నాతల్లి, జగత్తునందుగల పిపీలికాది బ్రహ్మపర్యంతమైన సర్వ

భూతాంతఃకరణ వాసియగు యా చిద్రూపిణి సర్వలోక మాతయగు గాయత్రి యనదగియున్నది. తురీయపద మాక్రమించి యుండుటచే త్రిలోకమాత యనదగియున్నది. యా పరచితియే బ్రహ్మాది త్రిమూర్తుల కాధారమై అగ్రహానుగ్రహములకు నిధానమగుచు ప్రకాశించుచుండును. ప్రతిబింబమునకు దర్పణ మాధారమైనట్లు అంతఃకరణ దర్పణ ప్రతి బింబిత జగత్తునకాధారమై నానా స్వరూపముల కాలయమగుచున్నది. ప్రతి భూతమునందును వర్వావస్థల సంధి కాలమందు నిర్మలముగ ప్రకాశించు చున్న సర్వాధిష్ఠాన చైతన్యమే. త్రిలోకమాతయగు గాయత్రి యగు చున్నది.

సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములను అయిదు విధము లైన ప్రపంచ రచనాశక్తిగల త్రిలోకమాతచే నిర్మితమైన ఇంద్రజాలము వంటి పరతంత్రజాలమునుజూచి మోహమును జెందనివాడు అంతర్ముఖుడై స్వాత్మ సాక్షాత్కారమును గాంచును. ఉపాధిసహితమగు సవిశేష జ్ఞానము వలన, ప్రకాశించు మనస్సును నిరోధించి, అంతర్లక్ష్యము గలయోగి, నిర్విశేష జ్ఞానముగలవాడై స్వస్వరూపమందు లయించగలడు. బుద్ధ్యుపాధిరహిత నిర్విశేష జ్ఞానమువలన, స్వస్వరూపసిద్ధి లభించును. బాహ్యదృశ్య నిరోధమే అంతర్దృష్టికి మూలమైనను. వ్యష్టియందును, నివృత్తియందును, కర్తృత్వాభిమానములను వదలి, త్రివిధావస్థల మధ్యకాల మందు సంభవమగు నిర్లేప స్వరూపానుసంధానలక్ష్యము గలవాడవై, నిత్యానందసుఖ మనుభవింపుము.

స్వరూప సాక్షాత్కారమనగా, త్రివిధావస్థలయందును నిర్వికల్ప జ్ఞానవైభవమగును. ఆదర్శనమనగా, సుషుప్తియందు గల అరూప జ్ఞాన

మగును. ఈ విధముగ సర్వావస్థలయందును. సదా ప్రకాశించు సాక్షియై త్వంపద లక్ష్యార్థమైన స్వరూపమునందు లక్ష్యము గలవాడవై నిర్వికల్ప సమాధిచే తురీయ పద మాక్రమించి. యానందించుమని బోధించిన హేమలేఖ వాక్యము లాలకించి, హేమచూడుడు బాహ్యదృష్టిని వదలి నిర్వికల్పన సమాధియందు చైతన్యమాత్ర స్వరూపుడై యుండెను.

తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

# పదవ అధ్యాయః

తన ప్రియురాలగు హేమలేఖచే బోధింపబడిన హేమచూడుడు కొంతకాలమువరకు చిత్తవృత్తులు లేక సమాధియందు కన్నులు మూసి యుండి, స్వయముగ, బాహ్యజ్ఞానము గలవాడై, అచటగల భార్య మొదలగు సర్వవిషయములను, తటస్థలక్షణముచే నవలోకించుచు, సమాధి వాసనా బలమువలన, ఉన్మత్తలోచనుడగు భర్తను గాంచి, హేమలేఖ, నాథా: నేత్రములు మూయుటచే తెలియబడినదేది? తెరచుటచే తెలియు చున్నదేది యని యడిగెను.

ఈ విధముగ బలికిన భార్యవచనములకు సమాధానము చెప్పుట యందు కర్తవ్యమును పొందుట కిచ్ఛగించకున్నను పరేచ్ఛవలన ఈ విధ ముగ చెప్పెను.

ఓ ప్రియసీ, నా యునికెట్లు వర్ణించవలెనో తోచుటలేదు. బాహ్య దృశ్యమెల్లను నమలిబడిన చెరుకుపిప్పి మరల నములుట కసహ్యమగు నట్లు చూచుటకు సహిత మసహ్యముగ నున్నది. మరియు బాహ్యదృష్టి వలన, చిత్త విశ్రాంతికి భంగమగుటచే, చిత్తవృత్తుల నిరసించిన శాంతిచే ఇంతకాలము పరమానంద మగ్నుడనై యుంటిని. పెరటియందున్న పెన్నిధి నెరుంగలేక బిచ్చమెత్తు అజ్ఞానివలె, క్షణభంగురమగు విషయ సుఖములయందు భ్రాంతిచే, అనుభవించుచు సుఖమించుకయైన గాంచ జాలక, సదా దుఃఖమునే పొందుచు, శాంతిని పొందజాలక, కాలక్షేపము చేయుచు స్వాత్మానందసుఖ మెరుంగజాలనైతిని. మానవులెల్ల ఈ విధ ముగ, మాయయందు పరిభ్రమించుచు, సుఖముకొరకు ప్రయత్నించి,

సదా దుఃఖమనుభవించుచు ఈవిధమగు సంసారమునందు నిమగ్నులైయుండె దరు. ఇట్టి కల్పిత మాయా కార్యము సర్వదా వ్యర్థమని తలంచెదను. సదా విశ్రాంతి సుఖమునుగోరు నాకు జ్ఞానసిద్ధిగల నీవు స్వస్వరూప సంధానరూపమగు సమాధివలన పొందదగిన పరియొక సుఖమెట్టిదో చెప్పుమని కోరుచున్న భర్తనుజూచి హేమలేఖ మందస్మిత వదనార విందయై ఇట్లనియె.

నాదా! నిర్వికారా సంగ చిద్రూపము నీకు సుబోధకమైనట్లు నాకు తోచుటలేదు. మూల ప్రకృతియగు చిత్ప్రతిబింబిత గాయత్రి యందు "అహం బ్రహ్మాస్మి" అను వచనముయొక్క లక్ష్యార్థానుసారము పరచితి స్వరూప జ్ఞానసిద్ధిగల బ్రహ్మవిదులు నేత్రోన్మీల నిమీలితములైన (వృత్తుల) చేష్టలచేతనే, స్వరూపసిద్ధి లభించినట్లు తలంచరు. అందువలన ఆకాశమువలే నీకా స్వరూపసిద్ధి లభ్యముగాక యున్నది. చిత్త నిరోధము చేతను చిత్తవృత్తి నిరోధముచేతను నేత్రోన్మీలనాది లక్షణములచేతను, సంభవమగునది పరిచ్ఛిన్నమగు అల్పపదార్థమేగాని, చిత్త ప్రతిబింబిత మగు అసంగ చిద్రూపముగాదు. ఆ చిద్రూపము ఒకక్రియ చేయునదిగాని చేయక యుండునది గాని, చలించునది గాని, అచలమై యుండునది గాని, మరియొక సాధ్యముచే పొందబడునది గాని కాదు. ఎనిమిది ధాన్యము గింజల ప్రమాణముగల కనురెప్ప మూయుటనే బ్రహ్మాండావర్ణము నతిశ యించియున్న పరచితి గనుపించుటయు, ఆ కనురెప్ప తెరచిచూచినపుడు కనుపించకుండుటయు, ఆశ్చర్యకరమగు విషయమై యున్నది.

ఇట్టి విపరీత భ్రాంతి మీకెట్లు సంభవించినది. అనేకకోటి బ్రహ్మాం డములెల్ల నా పరచితియొక్కానేక పాదాంశమగునని, శ్రుతిమాత తెలుపు

చుండగా, అట్టి విశాలావరణముగల పరమపదము నీవు కన్నులు మూయుటచే మరుగుపడి నీ కన్నులు తెరుచుటచే బయల్పడునా. రాజనందనా! ఆ పరతత్త్వ రహస్యము సావధానముగ వినుము.

త్రివిధ గ్రంధిఛేదనము కానంతకాలము గాయత్రి యనుగ్రహము సంభవించదు. ఆ కారణముచే నిత్యానందము సంభవించనేరదు. పరచితి స్వరూప సాక్షాత్కారమునకు ప్రతిబంధకములైన గ్రంధులనేకములుగలవు. అందు భ్రాంతియను గ్రంథి అజ్ఞానావరణముగలదై జ్ఞానబాధకమగుచుండును. అట్టి భ్రాంతికి కర్ణము దేహమగుటచేతను దేహభ్రాంతి ప్రథమ గ్రంధి రూపమున, సర్వభూతములను మోహింపజేయుచుండుటచే, స్వరూప జ్ఞానము ప్రకాశింపనేరదు. అహంకారాది సర్వదేహాభిమాన సంభవమగు కర్తవ్యభ్రాంతి, సంసారమును కల్పించుచుండును. పరచితి జ్ఞానప్రకాశమువలన పరిణమమును పొందుచున్న జగత్తునందుగల మానవులు జ్ఞానముచే విద్రవీగుచు, జ్ఞానప్రకాశమగు పరతత్త్వమును గ్రహించక యుండుట మరియొక గ్రంధియగుచున్నది. మానవులయందు కొన్ని జన్మలు మానుష శరీరమును ధరించి, కర్మ సంస్కారములను పొంది, గాయత్రిని మాత్రరూపమున ధరించి, ఉపాసనచేయుచు, మాత్రార్థజ్ఞానమెరుంగక యుండుట మరియొక గ్రంధి యనదగియున్నది.

ఈ విధముగ, జగదుత్పత్తికి కారణములగు జీవేశ్వరులను సృజియించి వారిరువురు భిన్నరూపులనుచేత భ్రమకల్పించి, సంసారాభివృద్ధికి కారణములైన గ్రందులనేకములు అమూల ప్రకృతివలన సృజియింపబడియున్నవి. సర్వగ్రంథులు జ్ఞానాగ్నివలన దహించినయెడల బంధవిముక్తి కలుగును. కన్నులు మూసినప్పుడు కనుపించిన, యాత్మ కన్నులు తెరచి

నప్పుడు మాయమగునేని, అట్టి లక్షణము పరిపూర్ణమునకు సంభవించదు. సర్వత్రా పరిపూర్ణమగు పరంజ్యోతి సదా పరిపూర్ణమై దేశకాల వస్తు పరిచ్ఛేదములేని యాచిద్రూపము నిరంతరము ప్రకాశించుచుండును. కన్నులు తెరచినప్పుడు జగత్తు కాన్పించుననియు, యా కన్నులు మూయుటవలన, జగత్తు దోచక ఆత్మ సాక్షాత్కారమగును. దేహభ్రాంతి యందు కర్తవ్యము నిల్చియున్నంతవరకు పరటితి దర్శనమైనను సంభవించదు. ప్రతిబింబదర్పణ సంబంధానుసారము ప్రకృతికి నాధారమగు అసంగ చిద్రూపమునే యాకారమందు ప్రకి యున్నరో బాహ్యదృష్టి యందు విచారింపుము.

అద్దము లేకుండా ప్రతిబింబము ప్రకాశించనట్లు, చిద్రూపము లేనియడల జగత్తు ప్రకాశించనేరదు. గొడ్రాలి కొడుకని చెప్పినట్లు సర్వలక్షణ లక్షితమగు చిద్రూప ప్రకాశము లేనియడల జడమగు జగత్తు ప్రకాశింపజాలదు. గావున, సర్వత్రా పరిపూర్ణమగుచు దేశకాల వస్తు పరిచ్ఛేదము లేక ప్రకాశించు చిద్రూపము కన్నులు మూసినప్పుడు గనుపించి, కన్నులు దెరచినప్పుడు కాన్పించకుండుట యసంభవమగును. కన్నులు మూయుటచే గాన్పించునను కర్తవ్యాభిమాని ముండునంతవరకు స్వరూపసిద్ధి లభించజాలదు. కన్నులు తెరచినప్పుడు గాన్పించు జగత్తు యా చిద్రూపమున కన్యమని భావించునట్టి నీ సంచిత్‌జ్ఞానము ఖండజ్ఞాన మగుచున్నది. బాంహ్యాభ్యంతరముల యందుగల పరిపూర్ణాఖండ జ్ఞానమువలననే, సర్వ జగత్తు ప్రకాశించగలదు అట్టి నిర్విశేషాఖండ జ్ఞానమునందు సంకల్ప సహితమగు వికల్పాజ్ఞానమును దహించితివేని సర్వసాక్షియగు స్వరూపసిద్ధి లభించలదు.

నేను చిత్తనిరోధముచేసి తెలుసుకొనుచున్నానను అభిమానత్యాగము చేసితివేని, శాంతియుతమగు స్వరూపానందము లభించగలదు. నేత్రో

వృత్తిన కాలమందు సంభవించునది అల్పమగు చిత్తనిరోధమే గాని, చిద్రూపము కాదు. చిత్తనిరోధ కాలమున, దృశ్యరహితమగు చిద్రూపము నిశ్చయుండును. అట్టి శుద్ధ చిద్రూపము సర్వదా సర్వావస్థలయందును, సర్వదృశ్యములకు సాక్షియై ప్రకాశించుచుండును గాని, రూపనామాత్మకమైన దృశ్యమెల్ల నా చిద్రూపమునకు వాచ్యార్థమగును. ఆ చిద్రూపము పరిపూర్ణము నిర్గుణముఅని చెప్పుటకొరకు జడముగాని జ్ఞానరూపమనియు, దుఃఖరహితమని చెప్పుటకు ఆనందరూపమని, వాచ్యార్థములచే వర్ణింపబడుచున్నను అద్వైత లక్షణమున కెట్టిభంగము రానేరదు.

ఎన్నివిధముల పూర్వ పక్షము చేసినను ప్రతిబింబిత చిద్రూపము అద్వైతమే యగును. "కామా ఏవ మహాదుఃఖః నిష్కామస్య కుతస్తు తత్" అను వచనముచే కామమువలన దుఃఖ సంభవమగుననుటచే కామ నివృత్తికొరకు చిత్త నిరోధము చేసినయడల సంభవమగు దుఃఖాభావమే. బ్రహ్మానంద మనతగదు. సంకల్పజనిత సంభవమగు విషయానందము, అస్థిరమని బుద్ధిచే నిశ్చయింపబడిన ప్రజ్ఞ గలవానికి, చిత్తరువునందుగల శృంగారాదులవలె, ఏవిధమగు జగద్భ్రాంతియు సంభవింపక, చిత్త నిరోధాది సాధనములతో బనిలేకయే, స్వరూప జ్ఞానసిద్ధి లభించగలదు. బాహ్యాభ్యంతరములయందు దోచు నామరూపాత్మిక జగత్తు కల్పితమైన దనియు, వానిని సదా సాక్షియై ప్రకాశింపజేయు చిద్రూపముగను, అంతఃకరణ చిద్దర్పణ ప్రతిబింబిత జగత్తు మిధ్యగా భావించి, యా చిద్రూపమే నీవను నిశ్చయము గలవాడవై స్వరూపానందసుఖ మనుభవించుము.

ఈ విధముగ బోధించిన హేమలేక వాక్యములను హేమచూడుడు విని జగద్భ్రాంతి వదలి పూర్ణ సమాధి నిష్ఠయందు స్వరూపానంద

మగ్నుడై శాంతినిపొంది హేమలేఖాదులతో రాజ్యమేలుచుండెను. ఈ విధముగ నిర్విచారముచే రాజ్యమేలుచు, శాస్త్రచింతనచేసి ఇతరులకు బోధించుచు, ధన మార్జించి అశ్వమేధాది యజ్ఞములను చేయుచు, ఇరువదివేల సంవత్సరములు జీవన్ముక్తుడై రాజ్యాది సర్వ వ్యవహారములయందు వ్యవహరించుచుండెను.

ఇట్లుండ తండ్రియగు ముక్తాచూడుండును, తమ్ముడగు మణిచూడుండును, హేమచూడుని వ్యవహారనిపుణత్వమునుజూచి, అనుమానముగలవారై, ఇట్లని తలచిరి. ఇతను పూర్వమువలె దోచుటలేదు. సర్వదా ఆనందమగ్నుడైయుండియు, సర్వ రాజకీయ వ్యవహారములను అతి నిపుణతగా నిర్వర్తించుచున్నాడు. సుఖదుఃఖములయందును, లాభా లాభములయందును సముడైనటువిరలె రాజ్యము చేయుచున్నాడు. కార్యములయందున్మత్తునివలె పరాయత్తముచే ప్రవర్తించుచున్నాడు. దీనికేమి కార్ణమని నేకాంతముగ హేమచూడుని విమర్శించిరి.

ఈ విధముగ నడుగబడిన తండ్రి తమ్ములు, హేమచూడుని వలన పరతత్త్వార్థ రహస్యమును బోధించబడినవారై వారిరువురు జీవన్ముక్తులైరి. ఆ విధముగనే మంత్రి సామంతాది పురవాసులెల్లను జగత్తుయొక్క అనిత్యత్వమును విమర్శించి, అసంగ చిద్రూప తత్త్వవేత్తలైరి. క్రమక్రమముగా నగరవాసులైన దాస దాసీజనంబులును, అంతఃపుర స్త్రీలును, పరతత్త్వ రహస్యమును గ్రహించి, దేహాభిమానమును కర్తవ్యమును లేనివారై సుఖియించుచుండిరి.

ఈ విధముగ ఆ నగరవాసులెల్లను కామ, క్రోధాది అంతఃకరణ వృత్తుల నిరసించి. సమయానుకూల వ్యవహారములయందు సంభవమగు గుణములను పొందక, నటునివలె నటించుచుండెదరు. పరతత్త్వార్ధ రహస్యములగు వాక్యములచే తల్లులు, బిడ్డల నాడించుచుండెదరు. ఈ విధముగ యా నగరవాసులందరు తత్త్వవేత్తలైనను వారివారి కార్యములను యథావిధిగ జరుపుచునే యుండెదరు. గడచిన సుఖదుఃఖాది విషయములను పామరులవలె స్మరింపకపోవుటయేగాక, భావిత సుఖదుఃఖ సంభవమగు శోక మోహములను పొందకయే, వర్తమానకాల వ్యవహార సంభవమగు, విషయాదులయందు సుఖివలెను, దుఃఖివలెను, కోపివలెను నటించుచుందురు.

సనక సనందనాదు లొకతరి యా గ్రామమునకు విలాసార్ధముగ వచ్చి, అచ్చటి మానవుల ప్రవర్తన జూచి, యా నగరమునకు విద్యానగరమని సార్థక నామమిడిరి. మరియు ఈ నగరమందు పంజరమున పెంచబడు రామచిలుకలు సహితమిట్లని పలుకుచుండును.

మానవులారా! చిత్త వ్యవహారములయందుపేక్ష గలవారై చిత్ప్రకాశమగు చిద్రూపము నుపాసింపుడు. దర్పణ ప్రతిబింబము దర్పణము కంటె న్యముగాని విధమున, చిత్త ప్రతిబింబిత జగత్తు చిత్తమున కన్యము గానేరదు. చిత్తము చరాచరమగు జగతు నేసు సహా, తత్కల్పనాధిష్ఠానమగు చితియే యగును. ఎట్లన చరాచరమగు ఈ జగత్తెల్లను, జడమగు చిత్తమునందు చితియొక్క స్వప్రకాశమువలన ప్రకాశించుచుండును గాని, కేవల జడమగు చిత్తమువలన ప్రకాశింపజాలదు. గాన, మానవులారా! చిత్త విభ్రమభ్రాంతిని వదిలి స్వప్రకాశమై సర్వాధారమగు చితినభజింపుడని పక్షులు పలుకుచుండును.

ఈ విధముగ హేమలేఖచే బోధింపబడిన హేమచూడుడును, అతని పరిపాలనా విధాన బలమువలన, ఆ నగరవాసులగు స్త్రీ పురుషులగు మానవులేగాక, పక్షులు సహితము మానవ సాంగత్య దోషమువలన, పరతత్త్వ రహస్యమెరింగి సుఖియింపుచుండిరి. సకల సంపదలకు సత్సాంగత్యము ప్రథమ కారణము గాన, శ్రేయోభిలాషి సత్సాంగత్యమును గోరుచుండవలెను

పదవ అధ్యాయము
సంపూర్ణము.



# పదకొండవ అధ్యాయము

ఈ విధముగ హేమలేఖచే బోధింపబడిన హేమచూడుని వృత్తాంతము కథా రూపముగ విన్న పరశురాముడు సంశయము గలవాడై దత్తాత్రేయ గురునితో ఇట్లనియె.

అయ్యా! మీరు చెప్పిన అత్యద్భుతాశ్చర్యకరమైన, జ్ఞానసహితమగు ఈ కథ అనుభవ విరుద్ధమును అసాధ్యము నగుచున్నదని తలచెదను. దృశ్యప్రపంచమెల్ల చిన్మాత్రమగునని ఎట్లు నిశ్చయింపదగును. ప్రమాణోద్భవములగు దృశ్యాదృశ్యములు రెంటియందును, అదృశ్యమును, అవ్యక్తమునగు చితి, కేవల భక్తిగమ్యమై యున్నది గాని వ్యవహారయోగ్యము గాదు. మనస్సు, చైతన్యశక్తివలన సంకల్పరూపము గలదగుటచే తెలియదగియున్నది. చిత్త సంబంధములేని చితి, వృత్తి రహితమగుటచే ఇంద్రియగోచరము గానేరదు. ఇట్టి చిత్తునా చిత్తమునకు తెలియు విధమున బోధింప వేడుచున్నానని పరశురాముడు కోరగా, దత్తాత్రేయు డీవిధమున దెల్పుచున్నారు.

పరిదృశ్యమగు జగత్తెల్లను దృక్కుకంటె నన్యము గాని విధమున, సర్వ దృశ్యములు, వాని కాధారమగు చిత్తునకంటె వేరుగావు. ఇంద్రియ గోచరమగు జగత్తును, అనుభవముచే విచారించి, వానికాధారమగు చిత్తును నిశ్చయింపదగును. దృశ్య జగద్వి చిత్ర రచనానుభవమెల్లను హేమచూడోపాఖ్యానమందు మూడు మొదలు పదవ అధ్యాయములందు సవిస్తారముగ తెలుపబడి యున్నది. జగదుత్పత్తికి ముఖ్యకార్య మింతవరకు వివరింపబడియున్నను, జగన్నిర్మాణము, కర్తృ వ్యాపార తంత్రమై

యుండుటచే, సర్వదా నూతనమగుచు విచిత్రగతులచే పరిణమించు చుండును.

అనేకులగు మతస్థులు తమతమ మతానుసారముగ, జగత్కార్తృత్వమునుగురించి అనేక విధముల వర్ణించుచున్నారు. అందు విజ్ఞానవాదులు జగత్తెల్లను రూపనామాది విధములచే నిర్ణయమగుచు, ఘటపటాది నాకార జ్ఞానమెల్లను, వస్తు విజ్ఞాన జన్యములనియు, విజ్ఞానమువలననే వ్యవహారము సిద్ధమగుచుండుననియు చెప్పుచు, సృష్టి అస్థిరమనియు, దేశకాల వస్తువు లెంతెంత భాసించుచుండునో అంతటి జ్ఞానవ్యాప్తి సిద్ధమై విజ్ఞానానంద మతిశయించుననియు ప్రతిక్షణమునను జగత్తు మారుచున్నట్లు దోచినను, విజ్ఞానము మాత్ర మఖండమై కరసమేయగుచున్నదని యెదరు, తర్కవాదులు పరిమాణు రూపమగు ఆకాశాదికము నిత్యమనియు, ఘటాది వస్తుతంత్ర మనిత్యమనియు, స్థావర జంగ మాత్మికమగు వస్తు సముదాయమే జగత్తనియు చెప్పెదరు. ఎవరెట్లు వర్ణించినను జగత్తు ఇంద్రియగోచరమైనదగుటచే దృశ్యమనియు, దృశ్యము నశ్యమనియు తెలియదగియున్నది.

కార్ణము కార్యము నపేక్షింపని విధమున, కార్యము కార్ణము నపేక్షింపదనియు, జగత్తు స్వభావ జన్యమనియు, చార్వాకాదులు చెప్పెదరు. ఘటపటాదులు మృత్తు, ప్రత్తి మొదలగు కార్ణనిర్మితము లగుచుండును గాని, ప్రత్తివలన ఘటమును మృత్తువలన పటమును, వ్యతిరేక కార్ణములచే సంభవమగుట లేదుగావున, కార్ణాపేక్ష లేక కార్యము సంభవించదు. అందువలన కార్ణ సామర్థ్య విశేషముండుటవలన చార్వాకాది మతములు, సిద్ధాంతములు గావు. సిద్ధాంత మతానుసారము ఏది దేనికి కార్ణమో, అది

దానివలన సంభవ మగుచుండుటచే, కార్యమందు కార్ణమున్నదనుట కంటె కార్యకార్ణములు, కర్తృయాధీనమని భావించదగిన నిర్విశేష జ్ఞానమువలన కార్యములకెల్ల కార్ణమొకటి గలదను నిశ్చయము సంభవమగును. ఏ విధ మగు సుఖదుఃఖము లాకస్మికముగ సంభవించినను, అందుకు తగిన అదృష్టకారణ మొకటి గలదని అంగీకరించక తప్పదు. అదృష్టమను నొక కార్ణములేక నెట్టి సుఖమునైనను సంభవించనేరవను శాస్త్రాభిఙు మత మవలంబించుట న్యాయముగాని, అనుభవములేని కుతర్క మతములు సిద్ధాంతములు గాజాలవు.

ఈ విధముగ సర్వ కార్యములు ప్రమాణానుసారము నిశ్చయించిన యడల కార్యసిద్ధి లభించును. ఆ కారణమువలననే సద్విధానముగ నిశ్చయింపబడిన, సిద్ధాంతమువలన, లోక నిర్మాణమునకెట్టి ఆటంకములు లేకుండ శాశ్వితముగ జరుగుచుండుటకు కార్ణమైయున్నది గాన, ఎట్టి కార్యమునకును, కుమతములు సిద్ధి యొసంగజాలవు. పూర్వ కృతాదృష్ట పరిపాకముచే ఈశ్వరేచ్ఛానుసారము పరమాణువులయందు చలనక్రియ సంభవమగుచుండును. అట్టి పరమాణుద్వయ సంయోగమువలన, అధిష్టాభిమతానుసారము క్రియారూప మేర్పడును. ఈ విధముగ మూడురేణువులు కలియుటవలన, కార్యముసిద్ధియగును. అట్టి క్రియాసిద్ధికి పూర్వము కార్యములేదనువాదము సిద్ధాంతము కాదు. కార్యకార్ణ సంభవమగు సృష్టి యనిత్యమగుచుండును గాన, ప్రకృతి సంభవమగు జగత్తునిత్యమని గ్రహించుటయే నిర్విశేష జ్ఞానసాధన మగును.

ఒక వ్యక్తియొక్క సంకల్ప మాత్రముచేతనే కార్యకార్ణ క్రియావిశేషములు సంభవించనేరవు. సంకల్ప రహితుడగు ఈశ్వరుని వలన, పర

మాణు సహిత క్రియా కలాపము సంభవించదు గాన, పరమాణువుల చేతనే జగత్తు నిర్మింపబడునను, పరమాణువాదము సిద్ధాంతము కానేరదు. త్రిగుణ సహితమగు సామ్యావస్థవలన, ప్రకృతి స్వయముగ ఈశ్వర సాన్నిధ్యశక్తి నపేక్షింపకయే గుణసంయోగ బలమువలన జగదాకార మును పొందుచుండునని యెదరు ప్రకృతి, సృష్టికాలమందు గుణవైషమ్య మును ప్రళయకాలమందు గుణ సామ్యమును, అల్ప ప్రళయమందు అల్ప గుణ వైషమ్యమును గలిగి అవస్థాభేదములచే పృథగ్రూపములను పొందు చుండును. ఇట్టి యవస్థాభేధ వికారములుగల ప్రకృతి జగత్తును నిర్మించు టకు స్వతంత్రయనుట యసంభవము. సర్వాధిష్ఠానచైతన్యా సంగ చిద్రూ పిణియొక్క సాన్నిధ్య బలములేని ప్రకృతి పరిణామమును పొందుట యసంభవమగుటచేతను చేతనా రహితమగు జడపదార్థములకు ప్రవృత్తి నివృత్తి లక్షణములు స్వభావము కాకపోవుటచేతను, అచేతనమగు ప్రకృతి వలన జగత్పరిణామము సంభవించనేరదు.

ఈ విధముగ ఆరంభ పరిణామ సాంఖ్యమతములు నిరాకరించ బడినయడల జగత్పరిణామ స్థితికి ప్రకృతికి పరమందుగల పరచితి జగ త్కర్తయగు వేదాంత సిద్ధాంతము నిరూఢ మగుచున్నది. ఇంద్రియ గోచ రమగు జగత్తు సత్యమనుటకు ప్రత్యక్షాది ప్రమాణము లంగీకరించుము. అజ్ఞానావర్ణ బద్ధులగు ప్రమాతలు ఇంద్రియ ప్రమేయములను నిశ్చయిం చుచు, స్వర్గ నరకాది లోకములను అందలి విశేషములను నిశ్చయింప జాలనందున, ప్రత్యక్షాది ప్రమాణములు నిరర్థకము లగుచున్నవి. ప్రత్య క్షానుమానాది సర్వ ప్రమాణములు నిత్యా పరోక్షజ్ఞానమునందు వగ్రా హ్యము లగుచున్నవి. అనుమాన ప్రమాణమునకు వ్యవస్థయే కావించ నందున, మతభేద విమర్శనయందు లక్ష్యముంచుము.

సర్వదా కార్యములెల్లను కర్త లేకుండా సృజియింప బడజాలవు గావున, జడమగు ప్రకృతి, చేతనమగు కర్తలేకుండా జగత్కార్యము చేయజాలదు. విచిత్ర నిర్మాణ రచనా తంత్రముగల జగన్నిర్మాణమునకు అచింత్యములగు నా ఘటనా సామర్ధ్యముగల చేతనమొకటి ఉండి తీరవల యునను విషయము ఉపనిషత్ ప్రమాణములచే నిశ్చయింపబడియున్నది. ఇట్టి స్వతంత్ర కల్పనాశక్తిగలిగి సర్వలక్షణములచే ప్రకాశించుచు, సర్వ భూతాంతఃకరణలయందు నేకరూపముచే ప్రతిఫలించి, ఉపాదానాది కార్ణాంతరాపేక్షలేకయే సర్వము తానే యగుచు, పరిపూర్ణ శక్తిజ్ఞాన సామర్ధ్యము వలన, సృష్ట్యను సంధానము గావించుచు సదా నిత్యముగా ప్రకాశించు త్రిలోకమాలయగు పరచితియే, గాయత్రియని తెలుసుకొనుము.

మానవులు, మనస్సువలన, విచిత్రమగు స్వప్న ప్రపంచ నిర్మాణమునకు కర్తలైనట్లును, గోడయందు రంగులతో అనేక రూపములను చిత్రించు విధమునను, డిగత్కారణ రూపియగు దాయత్రి ఉపాదానాది కారణాంతర సహాయము లేకయే, తాసను గోడయందు జగద్రూపమను చిత్తరువును సృజియింపుచుండును. మానవులకు స్వప్నమందు నిర్మితమగు వ్యవహారములెల్లను మనస్సుకంటె నన్యముకాని విధమున పరచితి యగు గాయత్రి నిర్మితమగు జగత్తెల్లను. తన సత్త్వగుణ రూపముకంటె నన్యముగాదని తలంచుము. స్వప్న కల్పిత వ్యవహారమెల్లను జాగ్రత యందు నశించు విధమున, చిద్రూపమగు పరచితి నిర్మితజగత్తెల్లను, ప్రళయకాలమందు నశించినను తాను సదా ప్రకాశించుచునే యుండును. మనో నిర్మిత స్వప్నప్రపంచమువలె, తన నిర్గుణ తత్త్వమున కన్యము గాని సగుణరూపములను జగదాకారముగ సృజియింపుచుండును.

ఏమే రూపములను నే కాలమందు సృజియింపుచున్నను, నాయా రూప సామర్థ్యములెల్లను చిద్రూపములే యగుటచే జగత్తు తనకంటె నన్యముగాకుండును. చితి సామర్థ్యములేక, నేవస్తువు ప్రకాశింపజాలదు గావున, దేశకాల వస్తువులయందెట్టి పృథగ్భావము దోచినను, దృశ్య వస్తువులయందు నామరూపముల నిగ్రహించి, మిగిలిన సాక్షి చైతన్య చిద్రూపము గాయత్రియని గ్రహించుము.

దేశకాలాది సర్వవస్తు పరిచయజ్ఞానముగలిగి, పురుషార్థసిద్ధికి మూలమగు సర్వాధిష్ఠాన చైతన్యజ్ఞానము లేకయుండుట ప్రకృతి స్వభావమగుచున్నది. ఆ పరచితి తన యనంతశక్తిని ప్రకాశింప చేయదలచి తన మహిమవలన, స్వతంత్రముగ జగత్తును భాసింపజేయుచు తన జగద్భక్షణా సామర్థ్యమును ప్రకాశింప జేయుచుండును. సూర్య సముద్రాదులనువిడచి, ప్రకాశతరంగాదు లుండనట్లు దేశకాల వస్తు సముదాయములెల్ల చిద్రూపమును విడచి ప్రకాశింపజాలవు గావున, శుద్ధ చైతన్యస్వరూపిణియగు గాయత్రి జగత్కారణ రూపమనదగియున్నది. గావున, జగత్తుయొక్క సృష్టి స్థితిల యాదులకు గాయత్రి మూలమైయున్నది.

ఈ విధముగ జగత్కారణత్వం ఉపనిషత్తులవలన, గాయత్రియందు నిశ్చయింపబడియున్నది, మణిమంత్ర అణిమాది సిద్ధులు ఈశ్వరాంశగల దైవజ్ఞులకే గాని, రాక్షసాంశగల అల్పజ్ఞులగు మానవులకు సంభవించనేరవని మానవులకు స్వభావ జన్యములగు దైవాసుర లక్షణములను, భ 17 అ. 6.7 శ్లోకములయందు వివరించబడియున్నది. ఉపనిషద్వాక్యములచే సిద్ధాంతము చేయబడిన శుద్ధ సత్త్వమును పరిపూర్ణమును అగు చిద్రూపము సృష్టికి పూర్వమందును ప్రకాశించుచు, తన స్వతంత్ర

మహిమవలన, ఉపాదానాది సాధనాంతరాపేక్ష లేకయే, జగత్తును సృజియింపుచుండును గాన, జగత్తు చిదాత్మకంబె వన్యముగా సంభవించ నేరదు. ఆ కారణముచే పరిపూర్ణ సామర్థ్యముగల పరచితికంటె జగత్తువం దన్యమేమియు లేదని గ్రహించుము.

యోగి యోగమహిమవలన సృజియించబడిన విషయములెల్లను, యోగికంటె వేరుగాని విధమున, చిద్రూప నిర్మితమగు జగత్తెల్లను యీ చితికంటె వేరు కాజాలదు. నీకు స్వప్నదృశ్యమగు సూక్ష్మప్రపంచ ముద యించదగిన మనిస్సు నీకంటె అన్యముకాని విధమున, చిద్రూప నిర్మిత ప్రపంచమెల్లను చిదాత్మకంటె అన్యము కాదు. కాలత్రయములయందును జగత్తు పరచితియందే ప్రకాశించును, ప్రళయమందా చితియందే లయించుచున్నను, పరచితియగు గాయత్రి ప్రకృతితో నెటి సంబంధము లేక, అసంగ చిద్రూపముచే ప్రకాశించుచుండును. సర్వాధారమగు నా పరచితి అంతఃకరణ ప్రతిబింబితమై, చిద్రూపముచే అనాంత శక్తియుతమై, అనంతరూపములచే విహరించుచు సాక్షియై శివాది పురుష వాచకములచేతను, మూల ప్రకృతి, గాయత్రి బాల దుర్గ భ్రమ రాంబయను, స్త్రీ వాచకములచేతను, దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేక సదా ప్రకాశించుచుండును. దేశకాల వస్తు సముదాయము లీచితికి నుపాధు లైనను, స్వతంత్రశక్తిలేని జడములగుటవలన, సర్వము చిదాధీన మాత్ర ములై ప్రకాశించవలసి వున్నవి. ఏకాలమందు దేవస్తువైనను, చిద్రూపశక్తి లేని ప్రకాశించగల రూపమేదియో విచారించుము.

సర్వ పదార్థ సత్తా లక్షణమే చితి యనబడును. చిద్గోచరముగాని వస్తు వుండనేరదు. బాంహ్యాభ్యంతరములయందు దోచు నహంకారాది సర్వ విషయములు జడములైనను, చిత్సాన్నిధ్య బలమువలన స్వప్రకాశ

ముకై ప్రకాశించుచుండుటవలన. ఆ పరచితి మాత్రము స్వప్రకాశమగు సత్పదార్థ మనదగియున్నది. సర్వ పదార్థములు ఆకాశాంతర్గములైన విధమున, ఆకాశాది సర్వభూత సముదాయములెల్లను సదా చిత్తు నాశ్రయించి ప్రకాశించుచుండును. వున్న వస్తువు ప్రకాశించుటయు, ప్రకాశించు వస్తు వుండుటయు సంభవించును గాన, ఉండుటయు ప్రకాశించుటయు వేర్వేరు లక్షణములు గావు. దీప ప్రకాశములు వేర్వేరు గాని విధమున, సత్తాప్రకాశములు భిన్నములు కాజాలవు.

ప్రతి బింబిత సత్త్వము, దర్పణ సత్త్వమైన విధమున. వస్తు సత్త్వమెల్లను, చిత్ప్రకాశమే గాని వేరుగాదు. చిద్రూప ప్రకాశమగు జగత్తును, చిద్రూప మనుటచే బాధితమేమియు నుండజాలదు. ఒకానొక కాలమున, జగత్సాత్తా, చిత్ప్రకాశము కంటె విలక్షణమై స్ఫురించుట తటస్థించినను, ఆ ప్రకాశమెల్లను, చితియొక్క నిర్మలసత్తా యనదగియుండును. దర్పణ మాలిన్యమువలన ప్రతిబింబము స్ఫుటముగ దోచినయట్లు అంతఃకరణ శుద్ధా శుద్ధ విశేషమువలన, అందు ప్రతిఫలించిన చితి, శుద్ధముగను, అశుద్ధముగనుజ్ఞానా జ్ఞానములచే ప్రకాశించుచుండును.

జలమందు ప్రతిఫలించిన రూపముకన్న దర్పణ ప్రతిబింబము స్వచ్ఛముగ దోచు విధమున. అంతఃకరణ ప్రతిబింబితమగు చితికి. బింబాపేక్ష లేకపోయినను. చిత్త మాలిన్యమువలన. చిత్ప్రకాశమగు జ్ఞాన స్ఫూర్తి సంభవించదు. సర్వ మాలిన్యములు అంతఃకరణ జనితములేగాని చితి కెట్టి మాలిన్యములు స్వభావముగలేని స్వయంప్రకాశ మగుచున్నది. ఉదకము, మృత్తుయొక్క సూక్ష్మాంశ సమ్మేళనమువలనను, దర్పణము ప్రతిబింబిత సత్తాహీనమై కళారహితమగుటవలనను, మాలిన్యము సంభ

వించునట్లు, అవయవ సహితమగు అంతఃకరణకు అన్యవస్తు భావనా పేక్షవలన, మాలిన్యము సంభవించునుగాని, నిరవయమును స్వప్రకాశమును అగు అసంగ చిద్రూపమునకెట్టి మాలిన్యమును సంభవింపనేరదు. అఖండమగుటచే శూన్యమైనదిగాదు. సర్వాధారమగుటచే శూన్యమువలె నవ్యక్త మనదగి యున్నది.

ఆ కారణముచే పాషాణాదులయందు మిగుల కఠిన్య శక్తిచేతను, జలమందు మలిన, కాఠిన్యశక్తులు సూక్ష్మముగను ఉండును. పరిపూర్ణ వ్యాపకముగల పరచితి అతి కఠినముగను, నతి మృతువుగను ఉండదగిన స్వభావము గలదై సంయోగవస్తు సంబంధము ననుసరించి ప్రకాశించుచుండును. పరచితి అంతఃకరణ తదాత్మ్యమును పొంది చిద్రూపమై, వృత్తి జ్ఞానమునుపొంది, రూపనామగుణ సామ్యమును పొందుచుండును. ఆ కారణముచే సృష్టికి కారణమగును. అందువలన అవిద్య నతిశయించుచుండును.

మరియొకప్పుడు అనేక జన్మ సుకర్మ పరిపాక విశేషమువలన, కల్పిత జగత్తునందును, అందలి విషయములయందును, అభావము, విరక్తి సంభవించుటచే, ఉపాసనావిధుల ననుసరించి, తురీయపద మాశ్రయించి, సర్వాంతఃకరణ వృత్తి జ్ఞానమందు నుపేక్ష సంభవించినప్పుడు, వృత్తి, రహితమగు నిర్విశేష జ్ఞానము సంభవించి, యా జ్ఞానము పరచితియందు లయించి యుండును. ఆ యవస్థనే "యదా పంచావతిష్ఠంతి, జ్ఞానాని మనసాసహ, బుద్ధిశ్చన విచేష్టిత, తమాహుం పరమాంగతిం" యనియు, "యస్మిన్ స్థితో న దుఃఖేన, గురుణాపి విచాల్యతే" అను వచనములచే స్థిత ప్రజ్ఞ లక్షణములను వర్ణన చేయబడి యున్నది.

ఆ పరచితికి స్వభావమగు జ్ఞానము, అంతఃకరణ తదాత్మ్య మునుపొంది, వృత్తి సహితమైనను, లేక, నిర్విషయమై ఆత్మాకారమైనను సర్వాధిష్ఠానమగు చితికెట్టి ప్రతిబంధకమును లేదు. దర్పణమందు వస్తువుల ప్రతిఫలించినప్పుడును, లేనప్పుడును, దర్పణమునకెట్టి వికారములు నంటని విధమునను. సర్వ దృశ్యా దృశ్యములకు దర్పణము నిదానమైన విధమునను జగత్తుయొక్క వ్యక్తావ్యక్తములకు, దర్పణ రూపమైన అంతఃకరణ నిలయమని తెలుసుకొనుము.

ఈ విధముగ జగత్తెల్లను ప్రతిబింబ లక్షణమని, నిశ్చయించిన యడల చిత్తము అదృష్టమువలె చిత్ప్రతిబింబ సాధనమగుచున్నది. బింబ రూపమగు పరచితికిని ప్రతిబింబిత జగత్తుకును భేదములేదని తెలుపబడి యున్నది. చిత్తు చిత్తముచే వ్యాపకమొందినను, స్వస్వరూపము మారకయే పరిణామమును పొందుదానికి, ప్రతిబింబ గ్రహిణి యనబడుచున్నది. దర్పణము ప్రతిబింబిత వస్తు వికారములను పొందకయే, రూపమును ప్రదర్శింపచేయు విధమున, త్రిగుణసహితమగు జగత్తువలెభాసించు చితికి, జగద్వికారములను పొందక నిర్మలముగ, గుణరహితమై ప్రకాశించుచుండును. దర్పణ ప్రతిబింబమునకు బింబము కారణమైనట్లు చిత్ప్రతిబింబము ను స్వతంత్రయగు చితియే కారణమగువను విషయము జ్ఞాపక ముంచుకొనుము.

ఓ పరశురామా! సంకల్ప వశముచే అంతఃకరణ భాసితమగు పదార్థములెల్ల దర్పణ ప్రతిబింబమువలె నాభాసము లగుచుండుటగాని బింబము నపేక్షింప జాలవు. ప్రతిబింబాధారమగు దర్పణమునకు సూర్య బింబాపేక్ష గలదు గాని, సూర్యునకు దర్పణాపేక్ష లేనివిధమున, అంతఃకరణ ప్రతి

బింబిత జగత్తునకు, చితి నాశ్రయాపేక్ష గలదుగాని, బింబారూపమగు చితికి జగత్తువందెట్టి నాపెక్షయు లేదు. ప్రజ్ఞాన లక్షణమై సర్వసాక్షియగు పరచితికి జగత్తు యొక్క సర్వ లక్షణములను తెలుసుకొన దగియున్నది గాని, ప్రతిబింబిత జగత్తునందే భూతము జగత్కార్ణ రూపియగు చితిని తెలుసుకొనుట కసాధ్యమగుచున్నది. ఆ కార్ణముచే ఆ పరచితి చిద్రూప ముచే సంకల్పముగలదై విజృంభించి జగద్వాపకముగలదై సర్వము తెలుసు కొనుచుండును. చిత్సంబంధ రహితమగునప్పుడు నిర్విశేష జ్ఞానముచే ప్రకాశించుచుండును.

ఈ విధముగ నా పరచితి అంతఃకరణ తదాత్మ్యమును పొందుట కును పొందకుండుటకును తగిన స్వతంత్రి శక్తిగలదై చిత్త పరిగ్రిహ ణము గలిగినపుడు స్వతంత్రమగు సంకల్ప శక్తిగలిగి, ఉపాదానాది సాధనాంతరాపేక్ష లేకియే జగత్తను సృజియింపుచు, శాశ్విత మైనట్లు భాసింప చేయుచుండును. మానవులయందొకరి సంకల్పము మరియొకరికి భాసిం చదు గాని సర్వభూత సంకల్పములు సర్వాధారమగు పరచితికి భాసిం చును. మానవులు ఆత్మ సంకల్పములను గోప్యముగనుంచుట కెట్లుప్రయ త్నించెదరో అట్లె పరచితి తన సంకల్ప ప్రకాశమగు జగత్తును సర్వత్రా శాశ్వితముగ ప్రకాశింపజేయుటకు దగిన సమర్థత గలదగుచున్నది.

ఏ జిజ్ఞాసుడు శుద్దాంతఃకరణయందు ప్రతిఫలించిన చిదాత్మ స్వరూ పము తానవనియు, స్థూల సూక్ష్మాది దేహవృత్తులకు సాక్షిననియు, అసం గుడననియు, సదా నిరంతరాభ్యాసము చేయుచున్నాడో, అట్టి యోగి మణి మంత్రాదులవలన సంభవమగు శక్తివలె, సంకల్ప సిద్ధి గలవాడగు చున్నాడు.

ఓ పరశురామా! ఇంద్రజాలకుడు, ఉపాదానాది కార్యాంతరాపేక్ష లేకయే సంకల్పమాత్రముచే కల్పించు, వస్తు సముదాయ సమృద్ధి నీవెరుంగుదువు గదా! అట్లే చిదాభాస కల్పితమగు జగత్తు నిత్యమైనది గాదు. ఇంద్రజాలకుని సంకల్ప వశముచే కల్పితమగు వస్తు సముదాయమెల్లను, మరల నాసంకల్పమందే లయించువిధమున అనంతశక్తియుతమగుపరాశక్తి తన సంకల్పమువలన, జగత్తునుసృజియించి, వినోదము గావించుచున్నను తనకెట్టి ప్రయోజనము లేకయే సంకల్ప బలమువలన, మరల తనయందు లయింప చేయుచుండును.

మానవులు సృష్టి గతములను భూత పంచక సహాయమువలన, కొన్ని వస్తువులను సృష్టింపుచున్నను, యోగసిద్ధిగల యోగులు, అంతఃక్కరణ సంభవమగు పరచితివలన, ప్రపంచోద్భవకార్య మగుచుండునని సంతసించెదరు. సర్వవ్యాపకముగ పరచితియొక్క పరిపూర్ణ స్వాతంత్ర శక్తి ఉపాసనా విశేషమువలన, ఉపాసకులను సృష్టి రహస్యము ప్రబోధమగుచుండును. దర్పణ ప్రతిబింబము జ్ఞానమువలన, మిధ్యగా దోచినను, దర్పణము స్థిరముగా నుండువిధమున, చిత్ప్రతిబింబిత జగత్తు విచార దృష్టియందభావమైనను, చితి మాత్రము శాశ్వితముగ ప్రకాశించుచుండును. ఆ కార్యముచే చలన స్వభావముగల జగత్తసత్యమనియు, అచల స్వభావముగల చితి శాశ్వితమనియు నెరుంగుము. మరియు, చిత్ప్రతిబింబిత జగత్తనిత్యమనియు, దర్పణమువంటి చిత్తు నిత్యమనియు, విమర్శించి నిశ్చయింప దగియున్నది. అసత్యమగు ప్రతిబింబిత రూపములు విమర్శనార్హములు గావు.

సర్వ పదార్థావలోకన దృష్టికి ననుకూలమగు సూర్యప్రకాశము దివాంధము దృష్టికి ప్రతిబంధమగుచు, దివాంధముల దృష్టికి ననుకూల

మగు రాత్రికాలము సర్వత్రానంద కారముగనుండుట సర్వత్రా విదితము గానే యున్నది. ఆ కారణముచే ప్రకాశాంధకారములు, సత్యాసత్యముల యదార్థస్థితి నిర్ణయించుట కారణాంతరములచే వ్యత్యస్తములుగ దోచుట సహజమగుచున్నది. నాభి సర్వజీవులకు, మృత్యురూపమైనను యా నాభి యందుదయించి, వృద్ధినొందుచున్నపురుగులకు అమృతప్రాయమై యున్న విధమున, అవిద్యా పర్ణములైన జీవులకు అజ్ఞానజనిత జగత్తు వివిధ విష యములచే విలాసార్థ ముపయోగించును. తత్త్వవేత్తలగు యోగులకు, జగద్విలాస మంధకారమైయుండును. అజ్ఞానులు కాలానుసారముగ సంభ వమగు అదృష్ట ఫలములను సుఖ దుఃఖములను కర్తృత్వముచే ననుభవిం చెదరు. జిజ్ఞాసులగు యోగులు, దేహ సంభవములగు అదృష్ట ఫలముల యందు కర్తృత్వరహితులై సాక్షిరూపమున విహరించుచుండెదరు. దూర స్థములగు నెంతటి పెద్దవస్తువులైనను, అద్దమునందు సామీప్యములై దోచు విధమున, చిత్ప్రికాశమగు జగత్తు అజ్ఞానులకు చిద్రూపముగ దోచకు న్నను, విమర్శనా విశేషమువలన, శూన్యము కాగలదు. గావున చిత్ప్రతి బింబిత జగత్తెల్ల చితి కన్యముగాక అస్తి, భాతి, ప్రియములచే ప్రకాశించు జగద్రుపమెల్లను మూల ప్రకృతియగు గాయత్రియే యగును.

పదకొండవ అధ్యాయము

సంపూర్ణము.



# పంద్రెండవ అధ్యాయః

జగత్తు సత్యమనియు, చిత్తుంచె అన్యము కాదనియు, బోధించిన దత్తాత్రేయగురు వాక్యములకు సందేహముగలిగిన పరశురాముడు ఓ గురుస్వామి అసత్యమనియు, జడమనియు తాము శలవిచ్చిన, జగతు సదా సత్యముగనే భాసించుచున్నది. ద్వైతులను, తార్కికులను జగత్తు సత్యమని, సిద్ధాంతము చేయుచుందురు గదా! ఆ విధముగనే నాకును సత్యము దోచుచున్నది గావున, నా సందేహము నివారించి నన్ను కృతార్థుని జేయ వేడుకొనుచున్నానని కోరగా దత్తాత్రేయగురు ఇట్లనియె.

ఓ రామా! జగత్సత్యత్వ భ్రాంతి అవిద్యా సంభవమగు సర్వజీవులకు అనాదివాసనా విశేషమువలన సంభవమగుచుండును. అట్టి భ్రాంతికి కార్త మవిద్య యగుటవలన, అవిద్యా పరిణామసంభవమగు జగతు సత్యమని తోచునట్టి జీవులవలె నీవును భ్రాంతినిపొందక కొంచెము వివేకము గలవాడవై కొంచెము విచారించుము.

ఆ పరిభిన్న చిద్రూపమే తానను జ్ఞానములేక, మాయా కల్పితమగు శరీరమే తామను తలంచుచు జన్మ దుఃఖములను పొందుచుందురు. దేహము రక్త మాంసాస్థి చర్మరోమములతోగూడినదై దేహికి జ్ఞానముచే తెలియదగిన, ఉపాధి రూపమగుచున్నది. దేహికి తెలియదగిన, ఇట్టి శరీరమే తానను వాసనా ప్రతిబంధ రూపమగు భ్రాంతి కంటె విశేషమగు ప్రతిబంధము జిజ్ఞాసునకు మరియొకటిలేదు. బలవత్తరమగు ప్రాకృత వాసనా సంస్కార విశేషమువలన, తనకు తెలియబడుచున్న దేహాది సంఘాతమే తానను తలంచునట్టి భ్రాంతిచే, బహువిధ జన్మ దుఃఖములు సంభవించుచుండును. సత్పురుషు (సద్గురువు) లోక సమయమున, అభిమానముచే అనధికారులగు శిష్యులకు దేహమాత్మ

కాదనియు, దేహధారియగు చిత్స్వరూపమే నీవని బోధించినను, దేహాత్మ జ్ఞానము నశింపక తదనుగుణ్యముగ ప్రవర్తింపుచుండుట అవిద్యా ప్రభావమని వర్ణింపదగియున్నది. అవిద్యా విశేషమువలన, విపరీత భావనా దారుఢ్యము గలిగిన జగన్సత్యత్వ భ్రాంతి దోచుచుండును.

ఇట్టి విపరీత భావనాదారుఢ్యమువలన వస్వప్నావస్థయందు దోచు విషయముల యందును సత్యత్వభ్రాంతి కలుగుచుండును. స్వప్నావస్థ సంభవమగు విషయములెల్ల జాగ్రత్తయందెట్లు అసత్యములని దోచునో అట్లై జాగ్రదాది త్రివిధావస్థా సంభవములను సర్వ విషయములు తురీయావస్థయందు శూన్యములని తలంపదగిన తుష్ణీభావము నొకతరి యను భవ జ్ఞానముచే సద సద్వివేకముగల యోగులకు మాత్రము జగత్తనిత్యమని దోచును గాని అవిద్యా జనితమగు త్రివిధావస్థలయందు మాత్రము పరిచయముగల సామాన్యజీవులకు, అజ్ఞానజనిత భ్రాంతిని వర్తించుట యసంభవమగు జీవుల భ్రాంతి ననుసరించి జాగ్రత్స్వప్నాదులయందు జ్ఞానము పరిణామము గలదైనా యా రూపములను పొందుచుండు విధమున యోగుల భావనా దారుఢ్యమువలన, చిద్రూపము నాయా రూపములను దాల్చుచుండును. జగత్పరిణామ స్థితిని గురించి నొక కథ చెప్పెద నాల కించుము.

పరమపావనమగు వంగదేశమునందు సుందరపురమును పాలించు సుషేణుడను నొక రాజుగలడు. అతనికి సర్వజన సమ్మతమైన సుగుణ సంపత్తిగల మహాసేనుడను తమ్ముడు రాజ్యమేలుచుండెను. ఆ మహాసేను డొక కాలమునందు పరమేశ్వర ప్రీతికొరకు అశ్వమేధ యాగము చేయ దలంచి, యజ్ఞాశ్వమును ప్రయాణము చేయగా, కొందరు పరరాజులా

యశ్వమును బంధించిరి. అప్పుడా మహాసేనుని కుమారులా రాజన్యుల జయించి, అశ్వము గొనివచ్చునపుడా మార్గమధ్యమున, ఐరావతీ నదీ తీరమున తపమాచరించుచున్న గణుడను రాజఋషిని జూచియు, బలదర్పోల్లాసములచే యా ఋషిని గౌరవించి బూజింపక, నుపేక్షచే వెడలిపోవుచుండెను.

అంతట యా గణమహర్షియొక్క కుమారుడా రాజపుత్రుని దురభిమానమును, అందువలన తన తండ్రికి సంభవించిన యవమానమును దలంచి సహింపజాలక, నాగ్రహవృత్తి గలవాడై యా రాజసైన్య సమేతముగా బోవుచున్న గుఱ్ఱమునుపట్టి బంధించి తెచ్చి యొకగుహ ప్రవేసించి ఆగుహా ద్వారమును నొక గొప్ప పత్రాతిచే బంధించెను. అంతట నా రాజకుమారుడు సైన్య సమేతముగ వచ్చి, అనేక శస్త్రాస్త్ర జాలములచే నా గుహాద్వారమును గప్పియున్న చత్రాతిని భేదించగా, యా గుహనుండి గణసుతు డపార సేనా సమేతుడై బయలువెడలి, ఆ సుషేణుని సైన్యమును కొంతవరకు బరిమార్చి ఆయన కుమారుని జయించి, కొంతమంది రాజన్యులసహా యా రాజపుత్రుని బంధించి, గుహాయందు ప్రవేసించెను.

అంతట పరాజితసైన్య మీవృత్తాంతమునుతెలియజేయగా, సుషేణు డాలోచించి తమ్మునిచూచి సోదరా! తపో సామర్ధ్యమతి దుర్ఘటమైనది. తపోధనుల సాకల్ప మమోఘమై యుండును. వారి సంకల్పమునకు దేవ దానవులుసైత మడ్డుపెట్టజాలరు. గాన ఆ గణమహర్షి యనుగ్రహమును పొంది, వసంతకాల మతిక్రమించకుండ, యజ్ఞాశ్వమును గొనిరమ్మని, మహాసేనున కాజ్ఞాపించెను.

ఆ విధముగ అన్నగారి యాజ్ఞానుసారము మహాసేను డభిమాన రహితుడై అరణ్యమునకుబోయి నిర్వికల్ప సమాధియం దచలుడై మౌన ముతోయున్న గణమహర్షి చెంతకు నతివినయముచే నరిగి, సాష్టాంగ దండ ప్రణామ మాచరించి. కృతాంజలి బద్ధుడై మూడు దినములు తదేక నిష్ఠచే ధ్యానించగా యా గణమహర్షి కుమారుడు సంతసము గలవాడై నీ కోరిక తెలియచేయుము. నేనీ గణమహర్షి కుమారుడను. వీరిప్పుడు నీతో మాట్లాడుట యసంభవము. ఈ విధమగు సమాధియందు వీరు చలిం చకయుండుట కిప్పటి కైదు సంవత్సరములైనది. మరి నేడు సంవత్సర ములకుగాని సమాధి చాలించరు. నీకు వారివలన, కావలసినకార్యము నేను సమకూర్చెదను. నన్ను బాలునిగా తలంచకుము. యోగసిద్ధిగల నేను నీకు కావలసిన కార్యము నెరవేర్చెదను.

తపోధనుల కసాధ్య ముండజాలదను మునికుమారుని పలకులాల కించి బుద్ధిమంతుడగు మహాసేనుడా బాలునకు నమస్కరించి, మునిపుత్రా నీవు నాకు సత్యముగ హితమొనర్పదలచితివేని, మీ తండ్రిగారి దర్శన మునకు పాత్రుడను గావలయునను కోరిక నెరవేర్ప వేడుచున్నాననగా, మునిపుత్రుడు రాజపుత్రా! నీ సంకల్ప మతి దుర్ఘటమైనదైనను, నా ప్రతిజ్ఞా భంగము కాకుండదగిన ప్రయత్నమాలోచించెదనని. కొంతదడ వాలో చించి. ఇట్లనియె.

రాజకుమారా! శాంతియుతమగు నిర్వికల్ప సమాధియందున్న ఈ మహాత్ముని వికల్పము చేయుటకు నొరులెవ్వరు సమర్థులుగారు. అయినను నీ కభయదాన మొసంగితిని గాన, నీ సంకల్పము నెరవేరదగిన నా యోగ సామర్ధ్యము విచారించుమనుచు, తన యోగ సామ ర్థ్యము వలన. ప్రాణాపానముల నైక్యముచేసినట్టి కుంభము వలన

బాంహ్యాస్మృతిని వదలి, తన నిజ ప్రాణమును తండ్రి శరీరమందుగల ప్రాణశక్తియందు లయింపజేసి, అంతఃకరణయందు ప్రవేసించి, మన స్సును చలింపజేసి, సంకల్పరూపమున, బహిర్గతమై తన శరీరమందు ప్రవేసించెను అంతఃకర్త యందు తమోగుణాధిక్యమువలన, సుషుప్తియు, రజోగుణాంశమువలన, ప్రబోధజ్ఞానమును, సత్వగుణ సంపక్తివలన, నిరోధ జ్ఞానముమ సంభవించుచుండునట్టి త్రివిధావస్థలు సర్వత్రాసంభ వించుచుండును, అంతఃకరణము చిత్ప్రకాశమువలన, అతీంద్రియ మవ దగి యుండుటచేతను, దానిని చలింపజేయుటకు, ఆత్మజ్ఞాన రూపలైన యోగులకు సర్వ వ్యాపకత్వ సిద్ధిచే సంభవించునుగాని, సర్వత్రా నతి దుర్లభ మగుచుండును.

అంతట నా గణమహర్షి తన కకార్యముగ, బాంహ్యాస్మృతి సంభ వించి తనఎదుట చేతులు జోడించి, స్తోత్రముచేయుచు విధేయుడై యున్న రాజునుచూచి, నిర్విశేష జ్ఞానముచే సర్వము గ్రహించి ప్రసన్నవదనుడై కుమారునిజూచి, వత్సా! నీ విప్పుడునుచేయకుము. తపస్సుచే శ్రేయాభి వృద్ధిని గోరువారికి, కామ, క్రోదము లంతరంగిక శతృవులగుచున్నారు. రాజన్యులు యజ్ఞములను చేయుచు లోకమును ధర్మముగ పాలించుటవలన గదా, దుష్ట శిక్షణయు, సుభిక్షము సంభవించి, తపోధనుల తపస్సు నిర్వి ఘ్నముగ సిద్ధి యొసంగదగి వర్ధిల్లుచుండుట ఆ కార్యమువలన, రాజన్య కృత యజ్ఞములకు విఘ్నము గావింపదలచుట రాక్షసకృత్య మనబడు చున్నది గాని, మనవంటివారికది భావ్యముకాదు. గావున, నీచే బంధించ బడిన యజ్ఞాశ్వమును సైన్యముతోసహా వసంతఋతువు సమీపించక ముందు శీఘ్రముగ వారి కొసంగమని చెప్పిన తండ్రి వచనముల నసున

రించి, వెంటనే గుహ ప్రవేశించి, ఆ గుఱ్ఱమును సైన్య సమేతముగ ఆ మహాసేనున కొసంగెను. అంతట మహాసేనుడా యశ్వమును, భార్య పుత్రాది సేనా సమేతముగ పురమునకుబంపి, ఆత్యాశ్చర్యముగలవాడై యా గణమహర్షికి నమస్కరించి ఇట్లనియె.

మహాత్మా! నా భార్య పుత్రాదులు గుఱ్ఱముతో సైన్య సమేతముగా, వీ రాలక్రింద నింతకాలమెట్లు దాగియుండిరో తెలుప వేడుచున్నాననగా, ఆ గణమహర్షి దయగలవాడై, రాజపుత్రా! పూర్వము నేనొక మహా రాజును. చిరకాలము రాజ్యమేలుచు మహాదేవు నారాధించి, వారి యను గ్రహమువలన, చిత్తు సర్వలోకమాతయగు గాయత్రియని తెలుసుకొంటిని. చిత్ప్రతిబింబితమగు సర్వలోకములు అందలి వ్యవహారములు చిత్కలిత ఇంద్రజాలములనియు, మాయా విలాసములనియు నిశ్చయించి రాజ్యము కొమరుల వశముచేసి, భార్యా సహితముగ వనవాసము చేయు చుంటిని.

ఈ విధముగ వనవాసము చేయుచు వాసనా సహితమగు సర్వ భ్రాంతులను వదలి, సదా సమాధియందు రమించుచుండగా నూరుకోట్ల సంవత్సరములు గడచినవి. నా భార్యయు, దృఢభక్తితో నా సేవ యొనర్చుచుండ కొంతకాలమునకు శాగల భావికర్మ విశేషము ననుసరించి, కామప్రేరేపితయై సమాధియందున్న నాకు చలనము గావించి, నాతో రమించదలచెను. పరేచ్ఛా ప్రారబ్ధము ననుసరింపదలచిన నా సమ్మతి ననుసరించి రతిక్రీడ సలిపి గర్భమును ధరించి, ఈ కుమారుని గని, సమాధియందున్న నన్ను చలింపజేసి ఈ పసిబాలుని నాతోడ యందుంచి, భౌతికదేహమును వదలి, పరమపద మలంకరించెను. తర్వాత మాతృ హీనుడగు ఈ పశిబాలుని పెంచి పెద్దవానినిగ జేసితిని.

కొంతకాలమునకు యుక్త వయస్సుగలవాడై నాచే పాలితమగు రాజ్యాంగతంత్రములను జూచి, తాను రాజ్యమును చేయదలంచి నన్ను బ్రార్థింపగా, నేనందులకు సమ్మతించుటచే నా యుపదేశానుసారము, ఉత్తమ యోగసిద్ధి గలవాడై నా యోగమహిమవలన నీయెదుట కాన్పించు చున్న చట్రాతి క్రిందిలోకములను సృజియించి, యా లోకములను పరిపాలించుచున్నాడు. ఆ లోకమునందే నీ కుమారులు అశ్వసైన్య సమేతముగ దాచబడిరని చెప్పిన గణమహార్షి వాక్యము లాలకించి, అయ్యా! మీరు శలవిచ్చిన చరిత్ర మత్యద్భుతమని తలచెదను. అట్టి చరిత్రమున కాధారమై తమ కుమారునిచే పాలించబడు విచిత్రమైన యా దేశమును చూడ గోరెద. నాయందనుగ్రహించి, ఆజ్ఞచేయమని వేడగా, ఆ గణమహర్షి దయగలవాడై కుమారునితో నీచే పాలితమగు రాజ్యమును చూపుమని యానతిచ్చి ఆ గణమహార్షి మరల సమాధియందు సమాగన మొందెను,

అంతట గణమహార్షి కుమార్డు తండ్రి యాజ్ఞానుసారము రాజకుమారుని వెంటనిడుకొని యా గుహాద్వారము ప్రవేశింప దొడంగెను. గాని యా రాజకుమారుడా గుహను ప్రవేసింపజాలక, ముని కుమారుని బిలువ నారంభించెను. అంత మునికుమారుడు వెలుపలికి వచ్చి ఓ రాజకుమారా! యోగసిద్ధిలేని వారలీ గుహను ప్రవేసింపజాలరు. అయినను మా తండ్రి గారి యాజ్ఞానుసారము నీకు పురమును జూపించుట కర్తవ్యముగాన, నీ స్థూలదేహమును ఎండిపోయిన, నీ చెట్టు తొఱ్ఱయందుంచుము. మనస్సును మాత్రమీ గుహయందు ప్రవేశపెట్టుమనుచు బోధించబడిన, యా రాజకుమారుడు తన స్థూల దేహమునుండి మనస్సును బయలు పరుచు నుపాయ మెరుంగక, మునివర్యా! ఈ దేహము విడుచు నుపాయమెద్ది.

బలత్కారముచే విడిచినయడల మరణము సంభవించును గదా! యనుచు విలపించు రాజపుత్రునిజూచి, మందహాస వదనముతో మునిపుత్రుడు.

రాజా! నీవు యోగవిద్యనెరుంగవు. అయినను నీ కన్నులు మూసు కొనుమని చెప్పి మునిపుత్రుడు తన యోగసామర్థ్యమువలన, అతని మన స్సునందు ప్రవేశించి, స్థూల శరీరము నొక చెట్టుతొఱ్ఱయందు విడచి, గుహయందు ప్రవేసించెను. అప్పుడు లింగా దేహధారియగు రాజకుమా రుడు ఆకాశమునందు పోవుచున్నట్టి తన గమనమును గాంచి, భయ భ్రాంతిగలవాడై మునికుమారుడు తన్ను విడిచిపెట్టినయడల క్రింద పడి పోదునను శంక గలవాడై మునికుమారా! నీవు చేవదలిన పడిపోదునని విలపించు రాజకుమారుని గాంచి, పరిహాసముచే నిట్లనియె.

రాజకుమారా! నిన్ను విడువను. భయమువదలి, ఈ గుహయందు గల లోకములను జూడుమనుచు చెప్పగా, రాజకుమారుడు తన కతిదూర మున గాన్పించు ఆకాశమందుగల నక్షత్ర సహితమగు చంద్రమండల మును, అచ్చటగల నతిశీతలము గాంచినతోడనే శరీరము నతిశీతల బాధ గలదయ్యెను. అప్పుడు చంద్రునికంటె చల్లని మనస్సుగల మునికుమా రుడు అప్పటికి తగిన, ఉష్ణోపచారములనుజేసి, తనకెట్టి శీతలబాధ లేకుం డునట్లు గావించెను. అటుతర్వాత, సూర్యమండలమందు సంచారము చేయుచు, అచ్చట సంభవించిన తాపమునకు తగిన శీతోపచారమును ముని కుమారునివలనపొంది శాంతినొందుచు, ఈ విధముగ యోగనిర్మిత ములగు అనేక లోకములను అందలి విశేషములను లింగ శరీరముచే గాంచుచుండెను. తర్వాత యా మునికుమారునివెంట హేమాద్రి శిఖరము నకుబోయి, అచ్చటి విశేషములను జూచుటయేగాక, దూరదేశములను

చూడదగిన దూరదృష్టి మునికుమారునివలన పొందినవాడై, లోకాలోకన పర్వతములను ఇంద్ర యక్ష సాతనాదులను, సత్య తపో కైలాస లోకములయందువిహరించు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాది సగుణరూపములను జూచుచు, భూభాగమునందు రూపాంతరలమును పొందియున్న అనేక విషయములను విమర్శించుచు సర్వత్ర ప్రకాశించు విరాట్స్వరూపుడగు మునికుమారుని యోగసిద్ధికి దిగ్భ్రమ చెందుచుండ, యా మునికుమారుడు

ఓ రాజకుమారా! నీవీలోకములను అందుగల విలాసములను జూచుచుండ, మానవమానమునందు పండ్రెండద్భుత వర్షములు గడిచినవి. గాని ఇక్కడ నొక్కదివ ప్రమాణమైనది. గావున, మా తండ్రిగారున్న తావునకు పోదామని చెప్పి, రాజకుమారునితోగూడ, ఆకాశ వీధియందు పర్యటన చేయుచు గండశైల గుహాద్వారమున పూర్వమువలె బయటికి వచ్చిరి.

పండ్రెండవ అధ్యాయము
సంపూర్ణము.



# పదమూడవ అధ్యాయః

మునికుమార్డు కొండగుహను వెడలి వెలుపలికి రాగానే రాజకుమా రుని మోహితునిగజేసి, వాని మనస్సును స్థూలదేహమునందుచేర్చి కృశిం చిన దేహమందు జాగ్రదావస్తను కలిగించెను. అంత రాజకుమారుడు బాంహ్య ప్రపంచ దృష్టిగలవాడై కనుపడుచున్న వృక్షగిరి తటాకాది నూతన ప్రపంచ లక్షణములనుజూచి కలవరపడుచు ఆ స్థలమునందు తాను పూర్వముచూచిన దృశ్యములు కనబడకపోవుటచే నాశ్చర్యము గలవాడై మునిపుత్రా! ఈ స్థలము పూర్వము మనముజూచిన యాకారములు లేక మార్పుగలిగి మరియొక విధముగ కనబడుచుండుటకు కారణము తెలుపు మని కోరగా మునికుమారుడు ఇట్లనియె.

రాజపుత్రా! పూర్వము మనముచూచినదీ ప్రదేశమేగాని, చిరకాల మగుటచే, క్రొత్తగ దోచుచున్నది. సర్వసృష్టియు, కాలానుసారము రూపములు వ్యవహారము భాష మారుచుండును. జగత్తెల్ల కాలగతిననుస రించి పరిణామము బొందుచుండును. ఈ విషయమును గురించి విచారించ తగదు. పూర్వము నీవు అశ్వముకొరకు వచ్చి మా తండ్రిగారిని దర్శిం చిన స్థలమిదియే. నీవప్పుడు చూచిన గుహయు నిదియె. మీ వంశమువారికి వేలకొలది తరములు గతించినవి. వంగదేశమందున్న సుందరపుర మిప్పుడు క్రూర జంతుసంచారయోగ్యమగు మహారణ్యముగ నుండెను. నీ వంశములోని వీరబాహుడను రాజు, మాలవదేశమును పాలించుచు శిప్రా తీరమున నుజ్జయినియందును. సుశర్మ యనురాజు ద్రవిడ దేశ మందు, తామ్రపర్ణీ తీరంబున, వర్ధన నగరమందును వర్ధిల్లుచున్నారు.

మరియు పూర్వము పల్లపు ప్రదేశములు పర్వతములుగను, పర్వత ప్రదేశములు పల్లములుగను, మరు స్థలములు జలమయములుగను, శిలా ప్రాయములగు కఠినభూములు మృదు రూపముగను, మృదు భూములు పాషాణ మయముగను, ఊసర క్షేత్రములు సారవంతములుగను, సార వంతభూములు, ఉసర క్షేత్రములుగను, ఉప్పునీర్ మధురముగను, నదీ జలములుప్పుగను స్థావర జంగమాది సర్వ ప్రపంచము పరిణామమును పొందుచుండుట సహజమైయున్నది. అస్థిరమగు జగత్తునందు స్థిరపే దియు గాన్పించదు గావ, మీ దేశమిప్పుడీ స్థితియందున్నదని చెప్పిన ముని పుత్రుని వాక్యములను విని విశేషశోక వ్యాకుల చిత్తముగలవాడై మూర్ఛ నొంది మరల తెలివిని పొందియు గత బంధుమిత్రాదులను తలంచుచు మోహముచే విలపించు రాజకుమారునిజూచి, మునిపుత్రుడు దయగలవాడై జ్ఞానము నుపదేశింపదలచి ఇట్లనియె.

రాజపుత్రా, నీవు బుద్ధిమంతుడవయ్యు ఈ విధముగ సామాన్యుల వలె దుఃఖించుటయుచితముగాదు. సద్విచారములేక, కార్యము చేయువారు అజ్ఞాను లనబడుచున్నారు. నీ కిప్పుడిట్టి శోకముకలుగుటకు కారణము దెలుపుమనగా, మహాసేనుడు దుఃఖావేశముచే, అయ్యా: నా బంధుమిత్రా దులందరు గతించినప్పుడు ఎట్లు దుఃఖము సంభవించక యుండును. లోకమునందొకరు గతించినపుడే దుఃఖము సంభవించుచుండగా, వంశము లోని వారందరు గతించినపుడు దుఃఖములేక యుండుటెట్లు. నావంశము వారినందరిని నేనెట్లు చూడగలనని రాజపుత్రుడు విచారించుచుండ, ముని కుమారుడు నవ్వుచు,

రాజపుత్రా: బంధువులు గతించినప్పుడు దుఃఖించుట మీ కులాచా రమా: అట్లు దుఃఖించకున్నయడల ఆపద యేమైనను సంభవించునా, లేక

దుఃఖించకున్న యడల గతించినవారు సజీవులగుదురా? యను విషయము లను చక్కగానాలోచింపుము. ఫలములేకున్నను దుఃఖించుట విధియని తల చినయడలపూర్వాదులు గతించినందులకేల దుఃఖించలేదు. వారుమాత్రము నీకు బంధువులుకారా? యను విషయములను చక్కగా విచారించుము.

రాజా! తొలుత నీ వెవ్వరవో నీ స్వరూపమెట్టిదో దుఃఖ మేకార్యము వలన సంభవించుచున్నదో విచారించుము. రక్తమాంసాస్థిమయమై శుక్ల శోణిత మిశ్రమజన్యమగు ఈ స్థూలదేహమా నీవు. లేక ఈ స్థూలదేహ మును ధరించిన, అక్షరుడగు దేహివని తలంచెదవా, నొకవేళ అజ్ఞాన ముచే దేహమే నీవని తలచినను మూత్ర పురీషాదులయందు జనించిన కీటకము లేక దేశజన్యములైనను పరస్పరానురాగము లేక నిర్వి చారముగ ప్రవర్తించుచున్నవి గదా! ఆ కార్యముచే ఏకమాతృ గర్భజనితు లైనను, ప్రారబ్ధము ననుసరించి భిన్న ప్రవర్తన గలవారగుచుందురు గదా! ఏకదేశ జనితములగు క్రిములకు సోదరత్వాది భ్రాంతి లేకయుం డుట నీ వెరింగియు, ఉత్తమ జీవుడనదగిన మానవునకిట్టి భ్రాంతి సంభవించుట నుచితమగును. దేహము సైత మెప్పుడును నశించు నదిగాదు. మొక్కొక్క అవయవ సంఘాతము నశించినను దేహము నశించునని చెప్పతగదు. దేహస్వభావమగు బాల్య యౌవనకౌమార వృద్ధాప్య మరణాద్యవస్థలచే మార్పు చెందుచు మరల జన్మాద్యవస్థలచే సదా పరిణామమును పొందుచుండునుగాని, సంపూర్ణముగ నశించనేరదు. అవస్థలు మారినప్పుడు దేహము నశించునని తలంచకూడదు. మరియు పంచభూతాత్మకమగు దేహమున కొకప్పుడు పృథివ్యాంశము నశించినను, గగనాంశము నశించదు గదా! దేహమొకవేళ నీవు కాదని తలచినను నీ

దేహమని విభాగించుచున్నాననుటయు ఉచితముకాదు. నీవు దేహమున కన్యమైనయెడల దేహబంధువులను గురించి నీవేల దుఃఖపడవలెను.

ఓ రాజా! బాగుగ నాలోచింపుము. నీవు దేహమునకన్యమై దానిని ప్రకాశింపజేయుచు త్రివిధ దేహావృత్తులకు సాక్షియైన చిద్రూపుడవు. వస్త్రము దేహమున కాచ్ఛాదితమైనట్లు చిద్రూపుడవగు నీకు దేహ మాచ్ఛాదిత మగుచున్నది. దేహమునకు బంధువులగు వారినిగురించి, దేహమునకు మమకారము అజ్ఞానముచే సంభవించినను, అసంగ చిద్రూపుడవగు నీకు దేహముతో నైన నెట్టి సంబంధము లేనప్పుడు, దేహాభిమానులగు బంధుమిత్రాదులయందు నీకెట్లభిమానముండును. నీదేహము భాతృదేహము. నొకతల్లి గర్భవాస జనితములగుటచే సోదరుడవై యుండవచ్చునుగాని, చిద్రూపుడవగు నీవు దేహమునకంటె నన్యుడవగుటచే దేహముతోగాని దేహ సంబంధీకులతోగాని, ఎట్టి సంబంధ ముండజాలదని బోధించు ముని పుత్రుని వాక్యములను కొంతవర కాలోచించి, నిశ్చయజ్ఞానములేనివాడై ఇట్లనియె.

ఓ మునిపుత్రా! మీ యుపదేశానుసారము నా స్వరూపమెట్టిదైనది నిశ్చయింపజాలక యున్నాను. క్షుత్పిపాసాదులవలె శోకకార్యము తెలియక యున్నది దుఃఖమావహించి దీనుడనై మీ శరణు వేడితిని. భ్రాంతి నివారణోపాయ మెరింగించి నన్ను కృతార్థుని జేయగోరుచున్నాడను. లోకమునందు బంధుమిత్రాదులు గతించినప్పుడు దుఃఖించుట సహజమై యున్నది. వారందరు తమ్మెదామెరుగని వారైనయెడల ఎట్లు దుఃఖించెదరు, బంధువులు కానివారు గతించినప్పుడు దుఃఖించరు గదా, ఇందలి యథార్థము నాకు వివరింపుడని వేడగా, మునిపుత్రుడు,—

రాజకుమారా! లోకమునందు జీవులెల్లను గాయత్రి మాయామోహితులై, తమ్ము దామెరుంగక, వ్యర్థముగా జన్మదుఃఖము లనుభవించుచు, కాలక్షేపము చేయుచుండెదరు. అనేక జన్మార్జిత పుణ్యపరిపాక విశేషము వలన మానుష దేహము లభించి, సద్గురు కటాక్షమువలన, తమను దామెరింగినవారి కించుకయైనను దుఃఖము సంభవింపనేరదు. స్వప్నావస్థయందు వ్యాఘ్రాది భయంకరాకారములను గాంచి, భయకంపాదుల పొందుచుండుట అజ్ఞానజీవులకు స్వభావమగుచున్నది. ఆ విధముగనే మానవుడజ్ఞానముచే తన మర్మమును గురించియు బంధుమిత్రాదుల మర్మమును గురించియు, దుఃఖించుచుండుట సహజమగుచున్నది. స్వప్నావస్థయందలి సర్వ వ్యవహారములు జాగ్రత్తయందు మిధ్యయని తలంచును. అట్లే స్వరూపజ్ఞానముగల బ్రహ్మవిదులు మాయను తరించిన వారగుటచే, తాము దుఃఖమును పొందకపోవుటయేగాక, మీవంటి వారికి సంభవమగు అజ్ఞాన జనిత భ్రాంతి నివారణోపాయమును బోధించెదరు.

దుఃఖమున కజ్ఞానమే కారణముగావున, ఓ రాజతనయా! నీవు తత్త్వమును బాగుగ విమర్శించిన జ్ఞానముచే అజ్ఞానజనిత, శోకమును తరించి ఆనందించుమని చెప్పగా రాజకుమారుడు, మునిపుత్రా! సంసారభ్రాంతికి కారణము మీరు శలవిచ్చిన స్వప్న వ్యవహారము తుల్యముగ నుండజాలదు. స్వప్నావస్థయందు దోచు సర్వవిషయములు కల్పితములని చెప్పతగును గాని, సర్వదా సర్వేంద్రియోపేతమై సర్వవ్యవహార యోగ్యమగు జాగ్రత్ప్రపంచ వ్యవహారము శూన్యమని తలంపుటెట్లు. స్వప్నకల్పిత వ్యవహారమెల్ల ఉత్తర క్షణమందు శూన్యమగుచున్నది గాని జాగ్రత్ప్రపంచ వ్యవహారము త్రికాలములయందును సత్యముగ భాసించుచుండుటచే అను

బ్ాక్తము చూపబడినదృష్టాంతము వ్యతిరేకముగమన్నదని చెప్పు రాజపుత్రు నితో మునికుమారు డిట్లనియె.

రాజా! కండ్లు పసికర్లయినవానికి లోకిమెల్ల పచ్చగదోచు విధమున. దృష్టాంతము వ్యతిరేకమని తలంచుట నొకవిధమగు భ్రమ యగుచున్నది. జాగ్రత్ప్రపంచము సత్యమని తలంచుట మరియొక భ్రమ యగును. ఈ రెండును అజ్ఞానజనితములై ఒకదానినొకటి యాశ్రయమై రెండును సత్య ముగ భాసించుచుండును. స్వప్న ప్రపంచమునందు దోచు ఫలవృక్ష జలా దులు తత్కాలితక్షుత్పిపాసాది శ్రమ నివర్తనోపాయములై మార్గస్థులకు తృప్తి నిఁ కలిగించుచుండునుగదా! నా యవస్థ యందా వృక్షజలాదులు శ్రమ నివారణోపాయములై సత్యముగ దోచుచుండును గదా! ఆ యవస్థయందా వృక్షజలాదులు క్షుత్పిపాసాది శ్రమకు నివారణోపాయములగుట సత్యమా అసత్యమనియెదవా! ఆలోచింపుమనగా, రాజపుత్రుడు స్వప్న దశయందు దోచు వృక్షజలాదులు జాగ్రద్దశయందు శూన్యమగుచుండు ననెను.

అట్లయిన రాజపుత్రా! జాగత్ప్రపంచము సుషుప్తియం దెచటి కేగి నది. జాగ్రత్ప్రపంచమునందలి విషయములు మరుదినమునందుకూడ దోచునని తలచినను, స్వప్నమందలి మాత్రము పరదినమందు దోచుచుం డును గదా! స్వప్న జాగ్రదాది త్రివిధావస్థలయందు దోచు సర్వవిషయ ములు తుర్యావస్థయందు శూన్యములగును. జాగ్రత్స్వప్నాద్యవస్థలు సర్వదా అనుభవమై స్వప్నావస్థ శూన్యమని తలచుట సర్వజన సామాన్య మగునుగాని. తుర్యావస్థ యనుభవము కానంతవరకు జాగ్రదావస్థయందలి విషయములు శూన్యమని తలచుట సంభవించదు. సూక్ష్మబుద్ధిచే విచారిం చిన యెడల, ప్రతిక్షణమందును మారుచుండునట్టి జాగ్రత్ప్రపంచ వ్యవ

హారము సత్యమెట్లగును. స్థావరములనదగు పర్వములు సైత మనేక కార్యములచే మార్పుచెందుచు, నశించుచుండ శాశ్వత వస్తువు ప్రపంచము నందెట్లు సంభవింపగలదు. ప్రథమమున నీ విచ్చటికి వచ్చినప్పటి స్థితియు ఇప్పటి స్థితియు విచారించి చూచినయడల ప్రపంచముయొక్క యదార్థ స్థితి నీకే తెలియగలదు.

ఈ క్షణమందు జూచిన, సముద్ర పర్వతాదు లుత్తర క్షణమందు మార్పు చెందుచుండుట నీ వెరింగిన విషయమే గదా! సృష్టియందు గల సర్వవస్తువులు ఉత్తరక్షణమందు మార్పునొందుచుండుట సత్యము గావున, ఇంద్రజాల తుల్యమగు ప్రపంచ సత్యత్వములు గురించి విశ్చలబుద్ధిచే విచారింపుము. సత్యము పరమార్థకమనియు, వ్యవహారమనియు, ప్రాతి భాసికమనియు, మూడు విధములు, అందు పారమార్థిక సత్యము చిదాత్మ యగును. స్వప్నప్రపంచము ప్రాతిభాస కసత్యమనబడును. జాగ్రత్ప్ర పంచము వ్యవసార సత్యమనబడును. అందు వ్యవహార, ప్రాతిభాసక సత్యములకు కార్ణమై సాక్షీత్వముచే సర్వాదారమగుచు, జనన మరణాద్య వస్థలులేని, చిద్రూపము పారమార్థిక సత్యమనబడును. దేశకాల వస్తు పరి చ్ఛిన్నత, జగత్తునకు సంభవించును గాని, చిద్రూపమున కట్టి ప్రతిబంధ ముండదు, గావున త్రికాలములయందు త్రికాయములను సదా ప్రకాశింప జేయుచుండు చిదాత్మయె గాయత్రి యగును.

ఈ గాయత్రి త్రివిధావస్థలయందలి విషయములు మార్పుజెందు చున్నను, నాయా కల్పిత వ్యవహారములను సదా సాక్షియై ప్రకాశింప జేయుచుండును, జడమగు కల్పిత జగత్తుయందు, అ జడమును స్వప్రకాశ మును అగు చిద్రూపమెట్లు పమ్మేళన మగును. గాన చిదాత్మరూపుడవగు

ప్తి స్వరూపమునందు లక్ష్యముంచి విచారించినయడల జడ ప్రకృతి స్వరూపములయందు నీకెట్లు అభిమానము సంభవించగలదు. నిశ్చలుండవై విచారింపుమని చెప్పు మునికుమారుని వాక్యములను మహాపేనుడువిని, మునివర్యా! ఘటమందు మృత్తికచేరి యున్నట్లు కార్యములయందు కార్ణరూపమనుసరించుచుండును గదా యన. మునిపుత్రుడు రాజకుమారా! ఘటాదులకు పృధి వ్యాదికము కార్ణమైనయట్లు స్వప్నాద్యవస్థలయందు దోచు పృధివ్యాది భూతాంశ జన్యములగు విషయములకు కులాలునివలె సర్వసాక్షియగు ఆ పరిచ్ఛిన్న కారణమైన చిదాత్మ అనువర్తించుచునే యున్నను జాగ్రదావస్థలయందు దోచు ప్రపంచవిషయములు వరుసగ నసత్యములేగాని సత్యములుగావు.

ఓ రాజకుమారా! జాగ్రత్స్వప్నాద్యవస్థలయందు దోచు సర్వవిషయములు సుషుప్తియందు దోచుటలేదు. తురీయావస్థయందు క్షణికముగ కల్పితముగ దోచుచుండును గాన, త్రివిధావస్థలయందు గల వ్యవహారములయందు దోచు విషయములకు సాక్షియైన నీవు సర్వ విషయములను తూష్ణీభావముచే నెరుంగుచు కల్పిత వ్యవహారములు శూన్యములేయని గ్రహించుమనెగా, రాజపుత్రుడు జాగ్రదావస్థయందలి విషయములు స్ఫుటముగ దోచునట్లు స్వప్నావస్థయందలి వ్యవహారములు స్ఫుటముగ దోచకుండుటకు కార్ణము తెలుపుమనికోరగా మునిపుత్రుడు ఇట్లనియె.

రాజకుమారా! జాగ్రద్దశయందు దశేంద్రియ భ్రాంతిచే దోచు సర్వవిషయముల యందును ఇంద్రియ స్ఫురణ గలిగి యుండుటచే పత్యముగ దోచును. స్వప్నమందు ఇంద్రియములు అవిద్యా వర్ణమునందు లయించి యుండుటచే. మనఃకల్పిత వ్యవహారమెరుంగిక పోవుటచేతను

స్వప్నవ్యవహారములయందు నిశ్చయింపదగిన ఇంద్రియ సాక్ష్యము శూన్యమై యిుండుటచేతను ఇంద్రియ స్ఫురణగల జాగ్రతయందు, స్వప్న వ్యవహారములు శూన్యమని ఇంద్రియములు నిశ్చయించుటచే కేవల మనస్సునకు స్వప్న వ్యవహారములు కల్పితములని దోచుచున్నది. అట్లయినను నిజతత్త్వ మెరుంగనివారికి మాత్రము జాగ్రత్స్వప్నాదుల యందొకటిసత్యమని మరియొకటి కల్పితమనిదోచునుగాని తత్త్వవేత్త లగు యోగులకట్లు తోచక, రెండవస్థలయందలి వ్యవహారములెల్లను కల్పిత మగుటచే శూన్యమని తలంచెదరు. అట్లు తలంచుటకు కారణమును వినుము.

వారు తుర్యావస్థానుభవము గలవారగుటచే త్రివిధావస్థల వ్యవహారములకు సాక్షి రూపు లగుచు నాయా వ్యవహారములు కల్పితములని భావించెదరు. తురీయపద మెరుంగని. అజ్ఞానులు జగత్సత్వ భ్రాంతిచే అనేక జన్మ వాసనా దారుఢ్యము గలవారగుటచే, జాగ్రత్ప్రపంచ వ్యవహారములు సత్యమని తలంచుచు అందుకు తగిన, యనేక జన్మల పొందుచుండెదరు. తుర్యావస్థానుభవ వాసనాసనా విశేషమువలన జగచ్ఛూన్యత్మ నిశ్చయబుద్ది జ్ఞానము నిరాటంకముగా ప్రకాశించుచుండును. నా యుపదేశానుసారము నీవిప్పుడు జగత్తు శూన్యమని తలచినను అది సత్యముగనే భాసించుచున్నదని భావించినను, జాగ్రద్దశయందు వర్ణించబడిన, స్త్రీ సౌందర్య విలాసాదులెల్లను స్వప్నావస్థయందనుభవింపదగిన యోగ్యత గలిగినట్లు స్ఫురించు విధమున, దృఢ భావనాసిద్ధి వమనవించి ప్రకృతి సిద్ధమగుచుండును.

ఆడెట్లనిన, నీవిప్పుడీ గండశైల గుహయందు నేను పాలించు లోకములను జూచితివిగదా! నీచే చూపబడిన లోకముల యాదరణ మెంతగలదో, ఈ కొండ యాధర్ణమెంత యుండునో చూతము రమ్మని యా రాజపుత్రుని వెంటవిడుకొని యా కొండచుట్టు తిరిగివచ్చి,

ఓ రాజపుత్రా! ఈ కొండయొక్క చుట్టుకొలత షుమారొక మైలు దూరము గలదు దీని గర్భమందు నీకు చూపబడిన దేశముల పరిమాణ మెంత యుండునో నీవు యోచింపుము, అక్కడ జరిగిన దినమిక్కడ, పండెర్రెండర్బుద వత్సరములైనది. కాలము దేశము మారుటచేగదా నీకింత దుఃఖము సంభవించినది. ఈ వ్యవహారమేయవస్థయని తతిచెదవు. నీ యభిప్రాయము సత్యమనియెదవా? లేక నసత్యమందువా? ఇందు సత్యాసత్య విమర్శనము తగదు. మరేమన, జగత్తెల్లను యోగసిద్ధుల భావనా మాత్రమై యుండునుగాని, భాదించదగిన సిద్ధపురుషుని భావనాసిద్ధిలేని యడల' క్షణమాత్రములో శూన్యమగును. అట్టి దుఃఖ హేతువగుచు భావనా మాత్రముచే సిద్ధమగుచు దుఃఖదాయకమగు ప్రపంచవిషయములను భావించకుండుటయే దానికి పతిమౌషధ మగుచున్నది. గాన రాజకుమారా! ప్రపంచము యొక్క అస్థిరత్వమును, అదిప్రకాశించ దగిన, యవకాశముగల భావనా దార్ఢ్యమును, భావనా సిద్ధికి నాదారమగు అవస్థా లక్షణమును సాంగముగ విచారించి, శోకమును తరించి, చిదాత్మ కావర్ణమగు అంతఃకరణ స్వభావమగు అవస్థా బేదములను విమర్శించి, అంతకరణ ప్రతివింబ రూపుడవగు నీవు ప్రతిబింభాధారమగు దర్పణ మాలిన్యముల వంటి అంతఃకరణ మాలిన్యములైన అవస్థా లక్షణములకు చిత్తి రూపమైన నీ స్వరూపమందు లక్ష్యముంచి, అంతఃకరణ ప్రతిబింబిత, జగత్ప్రత్వ భ్రాంతిని వదలి, చిద్విలాసములకు సాక్షివై శోకమోహ వికారముల ని యందారోపించుకొనక, అనంద సామ్రాజ్య మనుభవించుము.

పదమూడవ అధ్యాయము

సంపూర్ణము.

# పదునాల్గవ అధ్యాయము

రాజకుమారుడు మునిపుత్రుని యుపదేశము ననుసరించి త్రివిధావస్థల వ్యవహారములు మాయా మయములని తలంచి ఆభాస కల్పిత వ్యవహార సంభవ వికారములను తరించి ధీరుడై, ఓ మునిపుత్రా! పరావరజ్ఞుడవగు నీకు తెలియని విషయముండదని తలచెదనుగాన, దయతో నాకుగల మరియొక సందియమును దీర్పవేడుచున్నాను. అదేమన, జగత్తెల్ల అధిష్ఠానముయొక్క భావనా విశేషము ననుసరించి, ప్రకాశించునని, తాము శలవిచ్చితిరి. పర్వత గుహయందు తమ సంకల్పము ననుసరించి రాజ్యమును సృజియించి దానిని జూపు సమయమున బాహ్యప్రదేశము చూడవలెనని నేనెంత తలంచినను కనుపడలేదు. నేకకాలమున దేశము వస్తువులు వేరుగ నున్నట్లు దోచినవి. ఇందు సత్యాసత్యమును వివరింపుమనగా మునిపుత్రుడు,—

రాజా! సంకల్ప ప్రధానమగు భావన సిద్ధమనియు, అసిద్ధమనియు రెండు విధములు. అందు దృఢభావనా సహితమగు సంకల్పము సిద్ధసంకల్ప మనబడును. సంశయ భావనారూపమగు సంకల్పము వికల్పమునకు హేతువగుటచే సిద్ధి యొసంగజాలదు. గాన, వికల్పములేని సంకల్పము జగన్నిర్మాణ హేతువగును. వికల్పములేని సంకల్పము బహుకాలాభ్యాసము వలనగాని. సిద్ధి యొసంగజాలదు. బాహ్య జగత్తు సత్యమని తలచి స్వసంకల్ప సృష్టియం దనుమానము కలిగియుండుటచే, వికల్పము కలుగుచుండు నంతవరకు సంకల్పసిద్ధి సంభవించనేరదు. వికల్పము లేని సిద్ధ సంకల్పమువలన ప్రకాశించు హిరణ్య గర్భాది సత్పురుషుల సృష్టి అమోఘసిద్ధి గలదగుటచే సామాన్య మానవుల దృష్టికి సత్య

షని దోచుచుండును. గావ నీకు గలిగిన సంకల్పమునందు నీకుగావి ఇత రులకు గాని సత్యత్వభావన లేకపోవుటచే, సిద్ధి పొందజాల దయ్యెను. భావన లనేక విధములగుచున్నవి. అందు జన్మభావన, హిరణ్య గర్భున కును. మణిభావన, యక్షరానులకును, తపోభావన. మునులకును, యోగ భావన. యోగులకును ఔషధభావవ దేవతలకును, మాంత్రభావన మంత్రి కులకును వరభావన. విశ్వకర్మకును, ' యొసంగదగినవిగా యున్నవి. సర్వ దేశకాలములయందును సృష్టికి స్వతంత్రమై ప్రకాశించు భారూప మగు పరచితినే గాయత్రి యనియు, గాయత్రియనియు, త్రిపురాంబ యనియు, పరా ప్రకృతియనియు, మూలప్రకృతి యనియు, పరమేశ్వరి యనియు, బ్రహ్మయనియు, విష్ణువనియు. శివుడనియు, ఈశ్వరుడనియు జీవుడనియు. ఉపాదిబేదముల ననుసరించి. పర్యాయ నామములచే వాడు చున్నారు.

ఈ భారూపమున కన్యమగునదెల్లను నామరూప కల్పిత, జగద్వ్య వహార యోగ్యమగుచున్నది. దానినే యాభాస జగత్తనియెదరు. సర్వత్రా పరిపూర్ణమగుచు సత్పదార్థమైన భారూపమే ఆనందస్వభావమగు గాయత్రి యగుచున్నది. అన్యమగు నాభాస రూపమెల్లను దుఃఖదాయకమగును. దర్పణము ప్రతిబింబమున కాధారమైనయట్లు పరచితియగు గాయత్రి, సర్వదృశ్య జగత్తున కాధారమై వ్యాపించియున్నది. నిర్గుణ పరతత్త్వ స్వరూపిణియగు పరచితియందు భాసకత్వ లక్షణము భాస్యవస్తు సంబంధముచే సంభవమై నారోపితమగునుగాని, సహజ ధర్మముగాదు. దర్పణ ప్రతిబింబితాకాశ సముద్ర నగాదులు, దర్పణాకారమున కతిశయించి యున్నట్లు చిత్ప్రతిబింబిత జగత్తు తన కాధారమగు చితికి మీరి యుండ

జాలదు. ప్రతిబింబము దర్పణమందువలె, జగద్భానము చితియందేల చెప్పవలెను.

ఆకాశమందేల చెప్పరాదని తలచెదవేని, సంపూర్ణమును సర్వవ్యాపకము నేకరూపమునగు చిద్దర్పణమునందు దాని కన్యరూపము ప్రతిఫలించదు. దర్పణమువలె మార్పు చెందనేరదు. దర్పణమునకు చిద్దర్పణమును పోల్చుట సంభవించును గాని నేకదేశీయమైన జడరూపమగు నాకాశమును పోల్చుట సంభవించదనగా, మునిపుత్రా! అట్లయిన యడల. చిద్దర్పణ తుల్యమగు ఆకాశమునందు దోచు గంధర్వ నగరాదులవలె, నెందుకు పోల్చకూడదో తెలియచేయకూడదో తెలియజేయుమనగా..

రాజా! దర్పణమువలె తన కన్యవస్తువును పరచితి కూడుట సంభవించదు. ప్రతిబింబమునకు దర్పణాపేక్ష యవసరమైనట్లు నిమిత్తోపాదాన కారణముల యపేక్షయే జగమును విచిత్రగతులచే అఖండైక రసరూపమగు తనయందుగల, సర్వ స్వాతంత్ర్యమువలన అన్యాపేక్ష రహితముగ ప్రకాశింపచేయుటకు పరచితి సామర్థ్యముతో ప్రకాశించు దర్పణము, తన శుద్ధ సత్వము వదలనట్లు నానా రూపమగు జగత్తును తనయందు భాసింప జేయునట్టి చితి, శుద్ధసత్త్వమగు తన నిర్వికారమును వదలకయేయుండును. జాగ్రదాద్యవస్థలయందు అంతఃకరణ ప్రతిబింబిత జగద్విలాసములను తన కన్యముగా సాక్షియై చూచుచున్నను, తన కన్యముగాదని తలంచునట్టి నిశ్చయ జ్ఞానదృష్టిని నీవు విచారించినయడల, సర్వదా సత్తామాత్రమై ప్రకాశించు నేకరూపమగు చిద్రూపమొక్కటియే జగత్కారణమైన శాశ్వతరూప మగుచున్నది. ప్రతిబింబము భాసించునప్పుడు లేనప్పుడును దర్పణ మేకరూపమై యున్నట్లు, సంకల్పరూపమగు క్రియాకలాప

మందును, సుషుప్తి ప్రళయాదుల యందును. చితి నేకాకారముగనే యుండును. బాంహ్యాభ్యంతర కల్పిత ప్రపంచమెల్లను ఉపాధి కల్పిత ములగుటచే సర్వదా బారూపమగు చితికెట్టి సంగములేదని గ్రహించు మనుచు చెప్పగా రాజకుమారుడు,—

అయ్యా! చితి నిర్వికల్పమనియు, సృష్టి ఉపాధి కల్పితమనియు మీరు శెలవిచ్చిరి. నిర్వికల్ప చితియందు సృష్టియెట్లు కల్పితమైనదో వివరింపగోరెదననగా,

ఓ రాజకుమారా! చితి నిర్వికల్పమైనదైనను, సర్వస్వతంత్ర యగుటచే దర్పణమునకువలె, బింబాపేక్ష లేకయే, జగన్నిర్మాణ సామర్థ్యము గలదగుచున్నది, అవిద్యోపాధియందు ప్రతిఫలించిన కార్ణమువలన, జగన్నిర్మాణ సామర్థ్యము గలదగుచున్నది. జగత్తెల్లను పరిపూర్ణరూపమైన పరచితి నేకపాదాంశమని శృతిమాత చెప్పుచున్నది. నిర్వికల్ప చిదేక రసమయమగు పరమేశ్వరి జడముగాక పోవుటవలన, సర్వ స్వతంత్రయగు సత్పదార్థ మగుచున్నది. జడపదార్థమెల్ల పరభాసనాపేక్ష గలదగును. చితి స్వపర భాసనమందన్యాపేక్ష లేనిదగుటచే, స్వతంత్ర యగుచున్నది. సర్వాధిష్ఠానమగు పరబ్రహ్మము నాశ్రయించి, దీపమునకు వెలుతురువలె పరబ్రహ్మమున కన్యముగాని పరచితి ఉపాధి సంయోగమువలన జ్ఞాన, ఇచ్ఛా, క్రియశక్తులుగలదై, జగత్కారణ రూపముచే సర్వదా ప్రకాశించు చుండును.

ఈ స్వతంత్ర శక్తినే ఆగమములందు శక్తి, క్రియ, విమర్శము లను నామములచే వర్ణింపబడియున్నది, పరాత్పరుని కన్యముగాక, సాన్నిధ్యమందు ప్రకాశించు జ్ఞానరూపిణియగు పరచితి స్వాతంత్ర శక్తివలన

జగత్తును సృజియింపుచు ప్రళయకాలమందు తనయందు లయింపచేయుచు తాను మాత్రము సదా ప్రకాశించుచుండును ప్రళయమందు సృష్టి నశించి నను, స్వరూపస్ఫూర్తికి నాశన ముండజాలదు. పరమేశ్వర సాన్నిధ్య ప్రకాశమగు, చితి, జ్ఞానరూపముచే పంచభూతాహంకార మనోబుద్ధులు ఎనిమిదింటియందు ప్రకాశించి ప్రకృతి యనబడుచున్నది.

ఈ ప్రకృతికి నాధారమగు పరచితియే మూలప్రకృతి యనదగి యున్నది. యా మూల ప్రకృతినే మాయయని వాడుచుందురు. మాయా కల్పిత జగత్తును, అందు పాలకులగు త్రిమూర్త్యాదులను, చిదాత్మ కన్యముగాని, నిర్మాతలగుచున్నారు. అందువలన పరచితి విస్మృతమైన ఆత్మ ప్రకాశకులగు త్రిమూర్త్యాదులు చితి కన్యముగాకపోవుటచే అద్వైత భంగము సంభవించనేరదు. అంతఃకరణప్రతిబింబమగు చిద్రూప ప్రకాశ సంభవమగు నహంకారతత్త్వము ఇరువదినాలుగుతత్త్వములను ప్రకాశింప చేయుచు, నేను నా యదియను కర్తవ్యముగలదై తనకంటె నన్యమే దియు లేదను నహంభావము గలదై అవిద్యా వర్ణమును వతిశయింప జేయుచుండును.

శ్లో॥ జ్ఞాతా చిన్మాత్రరూపశ్చ । సర్వం చిన్మాత్రమే వహి
యచ్చ యావచ్చ, దూరస్థం । సర్వం చిన్మాత్రమేవహి ।
చిన్మాత్రాన్నాస్తి లక్ష్యంచ । సర్వం చిన్మాత్రమే వహి ।
ఆత్మనోఽన్య గాతిర్నాస్తి ।సర్వమాత్మ మయంజగత్.

ఇత్యాది మహావాక్యముల ననుసరించి తెలుసుకొను యధిష్ఠానము తెలియబడు ప్రపంచము చిన్మాత్రమనియు, చిద్రూపముగాని రూపముండ

జాలదనియు తెలుపబడి యుండుటచే ఆ చిద్రూపము అహంకారాది చతుర్వింశతి తత్త్వ లక్షణముల కంటని సాక్షియగుటచే సర్వము చిదాత్మ లక్షణమగుచు అహంకార ప్రతిబింబిత లక్షణమువలన జగత్కారణత్వము సంభవించినదని గ్రహించుము. పరిపూర్ణ చిద్రూప స్వాతంత్ర శక్తివలన ఆ పరిచ్ఛేదావభాసక వృత్తిలత్యమే అహంకార తత్త్వమై అవిద్యా ప్రకాశమునకు కారణమగుచున్నది. దీనిని మూలా విద్య యనియెదరు. అనగా అవిద్యా మూలమనియు, అవ్యక్తమనియు, జడశక్తియనియు, పర్యాయ నామములచే వాడుచుండుట శాస్త్రాచారమై యున్నది.

నీ యవిద్యకు మూలమై పరా ప్రకృతికి నాధారమగు పరశివతత్త్వ సాన్నిధ్యమందు స్వతంత్రయై ప్రకాశించు అవ్యక్త రూపమైన ఆ పరా ప్రకృతి. ఇరువదినాల్గు తత్త్వములచే ప్రకాశించు పరాప్రకృతి సంభవమగు జగత్తును ప్రళయకాలమందు లయింపజేయుచు, సృష్టియందు స్వతంత్ర శక్తివలన సర్వము ప్రకాశింప జేయుచుండును. జ్ఞాన స్వరూపమగు చిద్రూప చైతన్యము సర్వాధిష్ఠాన పరతత్త్వమగు పరశివుని, భారూపమనదగియున్నది. ఈ పరతత్త్వము సూక్ష్మభౌతిక వ్యాప్తమై జగన్నిర్మాణమున కాధారమగు తత్త్వాభాసమే పరచితి యనబడుచున్నది. దీపము వెలుతురు నేకమైనట్లు, ఈ రెండు (బింబ ప్రతిబింబములు) ను, అభేదమగు నేకాంశ మగుచున్నది.

ఈ చితి కుపాధిరూపమున ఆశ్రయించియున్న యవకాశమే చిదాకాశ మనబడును. ఈ చిదాకాశము, చితి ప్రతిఫలించుట కాధారమగుటచే, అవిద్య యనబడుచున్నది. అవిద్యా వర్ణసహితమగు చితి, అహంకార భావనా సహితమగు సదా శివతత్త్వ మగుచున్నది. ఈ సదాశివ తత్త్వము

జడ ప్రధానమై ఈశ్వరతత్త్వ మనబడుచున్నది. ఈ సదాశివేశ్వరాదులు, విమర్శనా జ్ఞానమువలన. వృత్తి నవలంబించి అహమిదం, ఇదమహం బను అవిద్యా వర్ణమువలన, బుద్ధి తత్త్వ ముదయింపును. ఈ సదాశివాది పంచతత్త్వములు, శుద్ధవిద్యాంశములని గ్రహింపుము.

తత్త్వములు శుద్ధములనియు, అశుద్ధములనియు, మిశ్రమములనియు మూడు విధములై యున్నవి. కార్యమగు కల్పిత జగద్రూప నిశ్చయ జ్ఞానము శూన్యమై సర్వసాక్షియై అద్వితీయ చిన్మాత్రముగ నుండుటవలన శుద్ధ సత్వ ప్రధానమగునవి. ఆగమములు వర్ణించుచున్నవి. జగత్తునందు దోచు జడరూపములెల్లను బీజాంకుర వృక్షముల చందమున, అవస్థా భేద ములచే రూపములు మారుచుండుట యాచారమై యున్నది. బీజమందు అంకురాది రూపములు గనుపింపనియట్లు జడమగు దేహమునందు స్వప్ర ధాన రూపశక్తి స్ఫురింపకయుండును, ఆ సిద్ధియందు, చితి, ఉపాధిసహిత మగు వృత్తి జ్ఞానశూన్యమై నిర్విశేష జ్ఞానిముచే భాసించుచుండును. గాన ఈ యైదు తత్త్వములు శుద్ధ సత్వ ప్రధానమైయుండును.

ఉపాధియగు చిత్తవృత్తితో సంకలితమగు చితి, జడశక్తివలన, అంకురింపబడిన, సూక్ష్మకార్య రూపముగల చిత్తు మాయా విద్యలను రెంటికి ప్రధానము గలదగుటచే, మాయాది, పురుషాంతము వరకుగల అష్ట ప్రకృతి తత్త్వములు జడశక్తినుండి బయలు వెడలి వృక్షమువంటి స్థూలకార్య రూపము సంభవించి, అవిద్యాప్రభావమువలన, అశుద్ధమగుచు ప్రకృత్యాది పృథివ్యాంతమగు చతుర్వింశతి తత్త్వము లుదయించు చున్నవి. ఈ విధముగ శివాది శుద్ధ విద్యాంశమగు శుద్ధతత్త్వములైదును,

మాయాది పురుషాంత మిశ్రమ తత్త్వము వేడును. ప్రకృత్యాది పృథి వ్యాంతమగు అశుద్ధతత్త్వము ఇరువదినాలుగును కలసి ముప్పదియారు తత్త్వము లగుచున్నవి.

ప్రకృత్యాది పృథివ్యాంతమగు అశుద్ధ తత్త్వము లిరువది నాలు గును. మాయా ప్రేరిపిత జడశక్తి ప్రేరేపితమై ఇచ్ఛా క్రియాకలాపము లకు సామర్ధ్యము గలవగుచున్నవి. క్రియాకలాప మధికమైనప్పుడు చితి సంకుచితమై కలా. విద్యా, రాగ. కాల, నియతులను పంచకంచుక వ్యాప కమువలన, నహంకార. పురుష తత్త్వ మగుచున్నది. కార్య కర్తృత్వము, కలయనియు, జడత్వలోపము విద్య యనియు. విషయ సామాన్యేచ్ఛ రాగమనియు, శత సంవత్సరాయుష్య వాంఛ వలన. పరిచ్ఛేదకాల నియ మమును, కార్యసాధనయందు పరాశక్త్యాపేక్షవలన. నియతియు సంభవిం చును. పరశివునియందు స్వభావములగు, సర్వకర్తృత్వ. సర్వజ్ఞత్వ. నిత్యతృప్తత్వ. నిత్యత్వ. స్వతంత్రత్త్వములను పంచశక్తులు సంకుచిత ములై, సూక్ష్మ రూపమున. కలా. విద్యా. రాగ. కాల. నియలతును పతుంచకంచుక రూపమున జీవులయందు ప్రకాశించుచున్నవి. జీవులకాశ్ర యమైన విచిత్రమగు అనాదికర్మ సంచితమెల్లను. చిలియద్దాశయమై ప్రకృతి యనబడుచున్నది. జీవుల సుఖ దుఃఖభావనా విశేషమువలన. ప్రకృతి త్రిగుణ భేదములచే త్రివిధము లగుచున్నవి. ప్రకృతియొక్క గుణావస్థా భేదము ననుసరించి. చిత్త సంస్కార వాసన సంభవించును. ఈ చిత్తము సుషుప్తియందు ప్రకృతిరూపమై నిశ్చలముగను. సుషుప్త్యంత మందు: వాసనా సహితమగు స్మృతి సంభవించినప్పుడు చిత్త మన బడును.

ఈ చిత్తమునే అవ్యక్తమనియెదరు. ఉపాధి బేధమువలన చిత్త స్ఫూర్తి ధర్మము మారుచుండును. సర్వజీవులకు, సుషుప్తియందు చిత్త స్ఫూర్తి శూన్యమగుటచే, ప్రకృతి యనబడుచున్నది. సుషుప్త్యాంతమందు ప్రకృతి అవ్యక్తమగు చిత్తరూప మగుచున్నది. అవ్యక్త ప్రధానమువలన చిత్తమును, చిత్త ప్రతిబింబిత జగద్విలాసమువలన, జీవత్వము సంభవ మగుచున్నది. చిత్త వాసనా విశేష సంభవమగు వ్యవహారము ననుసరించి అహంకారము మనస్సు బుద్ధియను నామాంతరములను పొందుచుండును. అందు నహంకార సత్వగుణాంశమువలన, శ్రోత్రాది జ్ఞానేంద్రియ పంచక మును, తమోగుణాంశమువలన, శబ్ద స్పర్శాది తన్మాత్రలను గుణపంచక మును, వీనివలన, అకాశాది పంచమహాభూతములను సంభవించెను.

ఈ విధమగు షడ్వింశతి తత్త్వముల సృష్టిక్రమ మెరుంగదగి యున్నది. పరమేశ్వర సాన్నిధ్యమందు సర్వ సాక్షియై జ్ఞానరూపముచే ప్రకాశించు పరచితి, సృష్టి స్థితి లయాదులకు కారణమై సర్వత్రా సంగ చిద్రూపమై నిరపేక్షచే. క్రీడించుచుండును. ప్రకృతి కాది బీజరూపమైన గాయత్రి, సృష్టారంభమున, హిరణ్యగర్భుని సృజియించెను. ఆయన వలన, జగత్తు సృజియింప బడుచుండును. జగత్తునందు నీవు, నేను, అన్యమనుచు ప్రవర్తించు నహంకారాభాస వృత్తి, జ్ఞానమెల్ల, గాయత్రి విలాసమగుచున్నది. ఉపాధి రహిత, నిర్విశేష జ్ఞానమువలన, ఘటాకాశ, మఠాశములకు నేకత్వసిద్ధి ననుసరించి, నహంకారయుత వృత్తిజ్ఞానము నశించి గాయత్రి యందైక్యము సంభవించగలదు సర్వదా యనుభవ మగుచున్న వృత్తిజ్ఞాన ముపాధిసంభవముగాని, స్వభావముగాదు. హిరణ్య గర్భ నిర్మిత దేహభ్రాంతి నశించినయెడల, స్వదగ్మావము నసించును. దృశ్యము కల్పితమగుటచే మిధ్య యని, నిశ్చయించినయెడల దృశ్య

మగు పృదగ్భావము నసించి, దృగ్రూపమగు చితి మాత్రము విల్చియుం డును, ఆ చిద్రూపమే నీవని, భాసించినయడల సర్వ సందేహములు నివ ర్తించగలవు.

చిదాత్మకు, స్వాతంత్ర్యశక్తి సహజమైనయడల నా భావన యేల సిద్ధిని పొందలేదని తలంచితివేని, రాజపుత్రా! నీ హృదయ కమలవాసి యగు చిచ్ఛక్తి నావరించియున్న అంతఃకరణోపాధి మాలిన్యము నసిం చినయడల వికల్పము నశించి సంకల్పము సిద్ధి కాగలదు. దేశకాల వ్యవ హార వ్యత్యాసములెల్ల స్థిర భావనవలన సిద్ధి గాంచగలవు. మన మిప్పు డొక దినములో భావించిన విశేషములెల్లను, బ్రహ్మ సృష్టియందు మానవ మానమునమసరించి అనేకార్బుద సంవత్సరములు గతించినవి, ఆ విధముగ వికల్పములేని దృఢభావమువలన, శీఘ్ర చిరకాల బేధములు కల్పిత మగుచుండును. బ్రహ్మ నిర్మితమగు నొకమైలు వైశాల్యముగల పర్వతమందు, అనేకవేల యోజన పరిమితిగల దేశములను నీ విప్పుడు చూచితివి గద! ఇందు సత్యాసత్యములు రెండును గలవు. అట్లె నీవును దృఢభావనాసిద్ధి గలవాడవై స్వల్ప పరిమితిగల ప్రదేశమును, బహుళ పరిమితిగల దానినిగ భావించదగిన సిద్ధి సంకల్పము గలవాడవగుము.

దృఢ భావనాదార్ఢ్యమువలన, స్వల్పకాలమైనను అనంతకాలముగ మారగలదు గాన, దృశ్యమగు జగమెల్ల దృఢభావనా మాత్రమని గ్రహించుము. ఈజగన్నిర్మాణ విచిత్రరచనాసామర్థ్యమెల్ల, అవ్యక్తిజడ శక్తిసభిత్తి చిద్రూపమాత్రమై యున్నది. మహాయోగులు అతిదూర ప్రదేశ వ్యవహారములను క్షణమాత్రములో దర్శించగలరు. దేశముయొక్క

దూర సామీప్యములను, కాలము యొక్క చిర బాహుళ్యములను చిద్ద ర్పణమందు చితిచే భావింపబడునవిగా నిశ్చయించి. భ్రాంతిని విడచి, శుద్ధ చిద్భావనగలవాడవై ఆనందించుమని చెప్పిన మునితనయుని. వచన ములను శిరసావహించి, నిజతత్త్వమెరింగి, సమాధ్యభ్యాస బలమువలన దృఢభావనాసిద్ధి గలవాడై, స్వతంత్ర శక్తియుతుడై చిరకాలము విహరించి దేహస్వభావమగు. అజ్ఞానమును తరించి. స్వభావ. చిద్రూపాను సంధాన మగ్నుడై తరించెను గాన చిత్త ప్రతిబింబిత జగత్సత్వ భ్రాంతిని విడువు మని దత్తాత్రేయులు పరశురామునకు బోధించిరి.

పదునాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

---

# పదునైదవ అధ్యాయః

పరశురాముడు ఓ గురువర్యా! మీరు చెప్పిన శైల లోకోపాఖ్యానము వలన, నాకు తోచినదేమనగా, జ్ఞానము సత్యమగు దృగ్రూపమనియు, జ్ఞానమువలన జ్ఞేయమగు జగత్తు, దర్పణ ప్రతిబింబితనగ రాదులవలె కల్పితమనియు, జ్ఞాన ప్రకాశమునకు కారణమగు పరచితి మహాశక్తియు సంవిద్రూపయు, నగు గాయత్రి యనియు, ఆగాయత్రి స్వతంత్రశక్తియైన చిత్తి రూపముచే, తనయందవ్యక్తాది జగన్నిర్మాణమును ఉపాదానాద్యపేక్ష లేకనే నిర్మించుచుండునని తెలుసుకొంటిని గాని, అందు కొంత సందేహము కలుగుచున్నది. ఆ పరచితెట్టి వేద్యములేని, నిర్వికల్ప మనియు, సంవేద్యమగు జగత్తుతో గూడుచుండుననియు శెలవిచ్చితిరి. వేద్యముగాని చితి వేద్యమగు జగత్తుతో నెట్లు కూడుట సంభవించును. మరియు నెట్లు తెలియబడును. ఆ పరచితి నెరుంగక, పురుషార్థము లభించదు గదా! మోక్షమన నేమి, విజ్ఞాన సంపత్తిగల ముక్తునకు వ్యవహారమెట్లు సంభవించును, జ్ఞానులనదగిన కొందరు వ్యవహార సమృద్ధి కలిగియున్నట్లు వినుచున్నాము గదా! సంకల్ప సహితమగు వ్యవహారము జ్ఞానులకెట్లు సమకూడును. వారికి వ్యవహారమునందెట్టి ప్రయోజనము గలదు జగద్వ్యవహారమునకు వ్యతిరేక లక్షణముగల పరచితియందు వ్యవహారమెట్లు సమకూరును మోక్షసాధనమగు విజ్ఞాన మేకరూపము గదా! పరిపూర్ణ జ్ఞానమై, నేకరూపమగు విజ్ఞానము గల ముముక్షువుల యందు భిన్న జ్ఞాన లక్షణ మెట్లు సంభవమగును.

జ్ఞానులయందు కొందరు శాస్త్రోక్త కర్మిష్ఠులుగను, కొందరుపాసనా పరులుగను, మరికొందరు జితేంద్రియులై సమాధ్యభ్యాస పరులై

గను, కొందరు కృచ్ఛ్ర చాంద్రాయణాది కాయశోషణము చేయుచు, తప మాచరించువారుగను, మరికొందరు, శిష్యులకు వేదాధ్యయనము చేయు వారుగను, కొందరు సభలయందు వాక్యార్థ రచనచేసి పూర్వ పక్ష సిద్ధాంతము చేయువారుగను, మరికొందరు, నీతి తప్పక, ధర్మముగ, రాజ్యపాలన చేయువారుగను, కొందరు జ్ఞానము గలిగియు, నింద్యప్రవర్తన గలవారుగను, ఈ విధగముగ ననేక, మార్గప్రవర్తకులుగ నున్నవారెల్ల, జ్ఞానులై యున్నారుగదా! జ్ఞానమేకరూపమైనయడల, ఇట్టి భేదప్రవర్తనలెట్లు సంభవించుచున్నవి. సాధనయు, అందుకుతగిన, ఫలమునొక్క విధమై యుండగా' ముముక్షువులు భిన్న ప్రవర్తన గలవారగుటకు కారణ మేమి! మానవులకు సర్వత్రా వ్యాపించియున్న జ్ఞాన పృథక్ లక్షణమును గురించి సాంగముగ వివరించ వేడుచున్నాడనగా, దత్తాత్రేయులు.—

ఓ రామా! నీ ప్రశ్న అమోఘమైనదగుటచే వర్ణనాతీత మగుచున్నది. నీ వతి బుద్ధిమంతుడవైనట్లు నీ ప్రశ్నవలన, నీకు గల జ్ఞానము స్ఫుటమగుచున్నది. గాయత్రి యనుగ్రహము గలవారికిగాని, విమర్శనా జ్ఞానము సంభవించదు. ఏ జన్మయందుగాని శ్రద్ధాభక్తితో గాయత్రి నుపాసించినవారికి యా పరదేవత భక్తిని గ్రహింపనెంచి, తాను బుద్ధియందు ప్రతిఫలించి, నద విమర్శన కలుగజేయును నీకు పరదేవతాను గ్రహము కలుగుటచేతనే ఈ విధమగు విమర్శనా జ్ఞానము సంభవించినది గాని, ఆ గాయత్రి యనుగ్రము సంపూర్ణముగా సంభవించలేదని నీ ప్రశ్నవలన తెలియుచున్నది. పరోక్ష జ్ఞానముచే, పరచిత్తైక్య జ్ఞానము సంభవించునదని తలచువానికేమియు తెలియలేదని గ్రహించదగియున్నది, పరోక్షజ్ఞానమనగా, దేహమందు గాయత్రి గలదను, ఆస్తిక్యజ్ఞానమే పరోక్షమగును,

ఈ జ్ఞానము స్వప్న తుల్యమగును. దేహమందున్న చైతన్యమే గాయత్రి యని చెప్పుట తటస్థ జ్ఞానమగును.

ఉపాధి మాలిన్య సహిత ససంస్కారమువలన, చిద్రూపము జన కన్యముగా దోచినను, కల్పితోపాధియగు బుద్ధి మిథ్యయనియు ఆ బుద్ధి ప్రతిబింబిత చైతన్య రూపమగు చిత్తమే తానను నిశ్చయజ్ఞాన, మపరోక్ష మగుచున్నది. వృత్తి జ్ఞానమును, ఇంద్రియ వృత్తులను, వృత్తుల సంధి లక్షణమును, వృత్తియభావమును, తెలుసుకొను నిశ్చలజ్ఞానము ప్రజ్ఞాన మనబడును. తటస్థజ్ఞానము, పరోక్షజ్ఞానమును అంధకారమందు దోచు మెరుపువంటి ప్రయోజనకారి యగుచుండునేగాని దృఢ విమర్శనా యోగ్యము కానేరదు- ఇందులకొక పూర్వ కథచెప్పెద నాలకించుము.

విదేహ దేశమందు ధార్మికుడగు జనకమహారాజు ఒకానొక సమ యమున, గాయత్రియగు పరదేవతను గురించి యాగమారంభించెను. ఆ యజ్ఞమునకు కర్మభూమియందుగల మునులు, బ్రహ్మవేత్తలు, యజ్వలు, విద్వాంసులు, వేద పారాయణులు, నిరతన్నదాతలు మొద లుగాగల, సత్పురుషుల నంతములుగ వచ్చిరి.

ఆ ముహూర్తమునందే, వరుణదేవుడొక యాగ మారంభించెను. ఆర్యావర్తమను పుణ్యభూమియందుగల బ్రాహ్మణోత్తములెల్ల ప్రఖ్యాతిగల జనకుని యాగమునకువెళ్ళి అచ్చట పూజితులై తృప్తులయి, యుండుటచే వరుణునియజ్ఞము నకావాహనమొనరింపబడియు, నొక్క బ్రాహ్మణుడైనను వెళ్లుటసంభవించలేదు. ఆ విధమెరింగి, వరుణపుత్రుడగు నొకవిద్వాంసుడు జనకుని యజ్ఞమునకు వెళ్లి, పండితులతోగూడిన రాజసభయందు,-

ఓ జనక మహారాజా! కాకులు గ్రద్దలు గూడియున్న ఈ రాజసభ యందు, మావంటి పండితులు ప్రవేశించదగిన యవకాశము గావించుట లేదు. శరత్కాలమందు తామరపద్మములతో గూడిన, సరస్సు హంస లచే ప్రకాశించునట్లు విద్వత్సమృందముతో గూడిన. సభ ఎట్లు ప్రకాశించు చుండవలెను. ఈ సభయందు పండితునొక్కని గానము, గాన, నేనీసభ యందుంట యనుచితమగును ఓ రాజా! నీకు మేలగుగాక. నేను పోయి వచ్చెదనని వెడలుచుండగా అప్పటి బ్రాహ్మణులు, ఓరి బ్రాహ్మణాధమా! నీ పాండిత్యమంత యపారమా. మమ్మాక్షేపింపదగినన మర్థుడవా! భూమి యందుగల పండితులందరిక్కడ నున్నారు. నీవేశాస్త్రమందు పండితు డవో చెప్పుమనగా వరుణపుత్రుడు ఇట్లనియె.

నేను చెప్పిన పందెమునకు సమ్మతించిన వారితో నేశాస్త్రమందైన వాదించెదను. నేనోడితినేని నన్ను సముద్రమున ముంచుడు. లేక, వాదమం దోడినవారిని నేను సముద్రమున ముంచెద. ఈ పందెమునకంగీ కరించిన వారు నాతో వాదమునకు రావచ్చుననగా, సభ్యులయందు కొందరా పందెమునకంగీకరించి వాదమునకు సమకట్టిరి. వరుణతనయుడా పండితులనెల్ల వితండ, జల్పవాదముచే నోడించి, ఓడినవారినెల్ల సము ద్రమున ముంచగా. ముంచిన బ్రాహ్మణులను వరుణదూతలు గొనిపోయి తమ యజమానుని వశముచేసిరి. వరుణుని వశమైన బ్రాహ్మణులు తనచే పూజింపబడుటచే మిగుల సంతసించిరి. వాదమనియు, జల్పమనియు, వితండమనియు, సిద్ధాంతము మూడు విధములు. అందు తమ సిద్ధాంత మును స్థాపించునది వాదమగును. పరసిద్ధాంతమును ఖండించి తమసిద్ధాంత మును స్థాపించునది జల్పమగును. స్వసిద్ధాంతము స్థాపించక, పర సిద్ధాంత మును ఖండించుట వితండ మనబడును. వరుణపుత్రుడు వితండ, జల్ప

వాదములచే బ్రాహ్మణులనెల్ల జయించెను. అప్పుడు కహోలుడను పండితుడు వరుణపుత్రునితో నోడిపోయి, సముద్రమున ముంచబడగా, కహోళ పుత్రుడగు అష్టావక్రుడు, వరుణపుత్రునితో వాదమారంభించి, యా వితండ జల్పవాదములచే జయమునుపొంది, యా వరుణపుత్రుని సముద్రమున ముంచబడి, తన లోకముజేరి, తనచే జయింపబడి వరుణలోకమునందున్న బ్రాహ్మణుల నందరి గొనివచ్చి, జనకమహారాజున కర్పించెను.

అష్టావక్రుడు, వరుణపుత్రుని జయించి, బ్రాహ్మణుల నందరిని గొనివచ్చి జనక మహారాజున కొసంగితినను గర్వముచే బ్రాహ్మణుల నవమానించగా, వారు దుఃఖమును పొందుచుండిరి. అంతట వారి దుఃఖ దవాగ్నివలన, జడ, కాషాయాంబర ధారియగు నొక తరుణీరూపమున గాయత్రి ప్రత్యక్షమాయెను. అట్లు ప్రత్యక్షమైన తాపసినిజూచి, బ్రాహ్మణులు శరణు వేడిరి. నా తాపసి రాజుచే పూజింపబడి ఇట్లనియె.

కహోళపుత్రా! వత్సా! నీవు మిగుల ప్రజ్ఞగల పండితుడవు. అట్లగుటచే వరుణపుత్రుని జయించి, బ్రాహ్మణులను రక్షించినావు. నీవంటి వారివలన గదా సందేహములు నివారింపబడుట సంభవించును గదా. నా సందేహముల నివారింపుము? వితండవాదము చేయక నీకు తోచినట్లు చెప్పుము. అఖండానందపద మేవిధముగ తెలియబడినదో, ఏది తెలిసిన యడల నిస్సందేహమై తెలియదగినది మరియొకటి లేకపోవునో, సర్వము బావగుచు బుద్ధి కగోచరమగు యా పదము నీవెరింగినయడల, దయచేసి కొంత తెలియచేయుమని తాపసి యడుగగా, అష్టావక్రుడు,—

ఓ తాపసి, ఆ పదమనేక పర్యాయములు వినువారలు గలరేని చెప్పెద. నీ వడిగినదెల్ల నాకు తెలుసును. అనేకశాస్త్ర పరిచియానుభవ

మగు సారాంశము చెప్పెద నాలకింపుము. నీవడిగిన పదమాది మధ్యాంత
రహితమై దేశకాల వస్తు కృత పరిచ్ఛేదములేనిదగుచు జగత్కారణమైన
శుద్ధాఖండ చిద్రూపమగుచున్నది. దేని సత్తాననుసరించి, సర్వ ప్రపంచము
ప్రకాశించుచున్నదో తద న్యములేక సర్వము తానై, నేకాకృతి నచల
మగుచున్నదో నయ్యదే పరమపదము అద్వయ నిత్యమై ప్రతిబింబిత,
సముద్రానగాదుల నిత్యమగునట్లు చిత్తునందు ప్రతిఫలించిన జగత్తు అనిత్య
మగు చిదాత్మకమని గ్రహించుటనే సర్వ సందేహములు నశించ
గలవు.

ఓ తాపసి! ఆ పదమును తెలుసుకొనదగినది గాని, తెలుపునదిగాని
మరియొకటి లేదు శుద్ధ చైతన్యమదియొకటే యగుచున్నది. దానికన్యమై
దానిచే ప్రకాశించు జడమగు జగత్తునందేపదార్థము చిదాత్మను తెలుసు
కొనజాలదు, గాన యా పదము తెలియబడునది కాదు. కేవల శాస్త్రజ్ఞాన
దృష్టిచే భావింపబడునని చెప్పగా తాపసి,—

బ్రాహ్మణోత్తమా! నీవు చెప్పిన పదములు వేదసమ్మతమేగాని,
ఆ పదము తెలియబడునది కాదనియు, దానిని తెలియతగిన మరియొక
సత్పదార్థము లేదనియు చెప్పితివి. మరల నా పదమును తెలుసుకొని మోక్ష
మును పొందవచ్చునంటివి. ఈ రెండువాక్యములు పరస్పర విరుద్ధధర్మము
గలవై యున్నవి. ఆ పదము వేద్యమైనయెడల, దాని నీ వెరుంగుదువుగదా!
అట్లయినయెడల ఆ పదము నీ వెరుంగనని చెప్పవలెను. నీవాపద మెరిం
గినయెడల నీ కన్యమైయుండును. అప్పుడాపదము వేద్యమని చెప్పతగదు
గదా, యా పదమును శాస్త్రరీత్యా భావించితినని చెప్పెదవేని నీకు పరోక్ష
జ్ఞాన మగును గదా. దర్పణ ప్రతిబింబమును జూచి, దర్పణమును చూడ

రేదనునట్లు అసంభవవిషయము చెప్పుట యుచితముగాదు. విద్వచ్ఛిరోమణి యగు ఈ జనకుని సభలో నిర్భయముగ మాట్లాడుచున్న పీ వోడితినని యేల తలంచవను తాపసి వాక్యములను అష్టావక్రుడు విని, మారుపలు కక, సిగ్గుచేత తలవంచుకొని ఆలోచించి, పూర్వపక్షము చేయనొల్లక ఇట్లనియె.

ఓ తాపసీ! నీ ప్రశ్నల కుత్తరము తోచుటలేదు. నేను నీకు శిష్యు డను అదెట్లు నిర్ణయించవలెనో నీవే చెప్పగోరెద, తపోహరమగు అసం బద్ధ వాక్యములు వ్యర్థములగుటచే, అట్టివాదమిప్పుడు నేను చేయదలచ నని చెప్పు. అష్టావక్రునియడల తాపసి కరుణించి సభామధ్యమం దిట్లనియె.

బాలకా! ఈ పరచితి, సర్వత్రా ప్రకాశించుచున్నాను. గోప్యముగ సురక్షితమై యున్నది. శుష్కతర్క వేదాంత ప్రవచనా సామర్థ్యము వలన, తెలియబడక నీవలె అనేకులగు విద్వాంసులు మోసపడిరి. నాతోపాటు ఆ పరతత్త్వము నెరింగిన జనకచక్రవర్తివలె ఈ సభయందు మరియొకరు లేరు. లోకమునందు తర్క వేదాంత శాస్త్ర ప్రవచనా సామర్థ్యముగల విద్వాంసులనేకు లుండెదరు గాని, పరతత్త్వ రహస్య మెరింగినవారు బహు నరుదుగ నుందురు. పరదేవతయగు గాయత్రి యుపాసనాను గ్రహమువలన, సద్గురు కృపా, పాత్రుడై కృతకృత్యత నొందినవారికి తప్ప, యంత సూక్ష్మబుద్ధి కౌశలము గలవాడైనను, యంత శాస్త్ర పరి జ్ఞానము గలవాడైనను, పరతత్త్వ రహస్యము నెరుంగజాలడు.

విప్రోత్తమా! నేను చెప్పుదానివిని, అహంకార త్యాగము గలవాడవై వాలకింపుము. ఈ పరతత్త్వము తటస్థజ్ఞానముచే శ్రవణము చేసినను,

హేంద్రియ వృత్తిజ్ఞాన మందాస్తిక్యము గలవారికి, కడు దుర్లభమగు చున్నది. గురు వాక్యములయందలి నమ్మకము గలిగి, బుద్ధియోగము గలవాడై స్వస్వరూపాను సంధాన తత్పరుడు కానంతవరకు పరోక్షముగ విన్న శ్రవణ జ్ఞానమెల్ల నిరర్థక మగుచున్నది. సర్వవస్తు ప్రకాశకమగు దీపమును ప్రకాశింపజేయు మరియొక వస్తువులేనందున, దీపములేదనిగాని, ప్రకాశించుటలేదనిగాని చెప్పుట యుచితముకానట్లు పరచితిని ప్రకాశింప చేయు మరియొక వస్తువు లేనంతమాత్రమున, చితిలేదని చెప్పుట యుచితము కాదు. సర్వ ప్రకాశమైనది చితియే అగును. జ్ఞానాజ్ఞానములను గురించి నీ వంతర్దృష్టిచే విచారించుము.

జగదాధారమై సకలావభాసకమగుచు సర్వోత్తమమైన, చితియను గాయత్రి, సర్వత్రా సర్వదా ప్రకాశించుచుండును. నీ చిత్తమందు దోచు సర్వ సందేహముల నుపేక్షించినయడల వృత్తిరహితమగు నిర్విశేష జ్ఞానరూపమైనది గాయత్రియని గ్రహించుము. శుద్ధ చితి, చిద్రూపముచే ప్రకాశింపనియడల జగత్తునందుగల సర్వరూపములు జడములై వసించ గలవు. రూపనామ కల్పిత జగమెల్లను గాయత్రి విలాసముచే ప్రకాసించు చుండునని తాపసి చెప్పగా, అష్టావక్రుడు సంశయము గలవాడై మరల ఇట్లనియె.

జాగ్రత్స్వప్నావస్థలయందు దాచితి సదా ప్రకాశించుచున్నట్లు దోచు చున్నది గాని, సుషుప్తియందేమియు దోచకయుండుటవలన, చిత్ప్రకాశము కాల పరిచ్ఛిన్నమైనట్లు తోచుచున్నది. అట్లగుటచే చితి అఖండాకార మైన అపరిచ్ఛిన్నమని తలచుటెట్లనగా, తాపసి, బాలకా, జడవస్తువులను ప్రకాశింపజేయు సామర్థ్యముగల స్వతంత్రయు: స్వప్రకాశమునగు చితి

ప్రకాశింపకుండుట కెప్పటికి సంభవించదు. ఆ చితి, తాను స్వయముగ స్వతంత్రయై ప్రకాశించుచున్నదో, అన్యప్రకాశమువలన ప్రకాశించు చున్నదో, సూక్ష్మబుద్ధిచే నీవే విచారించుమనగా, అష్టావక్రుడు, తల్లీ! ఇంద్రియగోచరమగు వస్తువును బరిశీలింపగలను గాని, అవ్యక్త చిద్రూపగు గాయత్రినెట్లు విమర్శించగలననగా,-

బాలకా? ఈ విషయమునందు షట్ఛాస్త్ర వేత్తలగు విద్వాంసులు సైతము మోసపడుచున్నారు. చిత్తమున నంతర్దృష్టి యనదగిన, యోగ సిద్ధి సర్వత్రా సంభవించనేరదు. సంకల్పసహితమగు మనస్సునకు సదా, దశేంద్రియ సహితమగు బాహ్య ప్రపంచ లక్ష్యమునందాసక్తి క్యమే గాని, అంతదృష్టి సంభవించకపోపుటచే బుద్ధి యోగ సంభవమగు శుద్ధ చితి, సాక్షాత్కారము లభించదు. బాహ్యదృశ్య మాభాసమాత్రమని తలంచిన సంకల్పరహితమగు బుద్ధి సంయోగము గలవాడవై గురువాక్యానుసంధాన మభ్యసింపుము. సంకల్ప త్యాగము చేసినప్పుడు దయా సముద్రయగు గాయత్రి నిర్మలమగు బుద్ధి యోగమును ప్రసాదించును. గావున సంకల్ప త్యాగముచేసి, గాయత్రి యందైక్యసిద్ధినిగోరు ముముక్షువు, వ్యాపారాడంబరమును గోరడు.

ఈ విధముగ చిద్రూపమగు గాయత్రియే తానను, స్వస్వరూప లక్ష్యమవలంబించి బుధ్యుపాధి జనిత వృత్తిజ్ఞానమును వదలిపెట్టుము. జ్ఞాన స్వరూప లక్షణమైన శుద్ధ చిద్రూపము సంకల్పాభావ స్థితియందు నిశ్చలమై నిర్విశేష మగుచున్నదా లేదా యని విచారింపుము. ఇట్టి విమర్శన వలన సత్పదార్థమైన, జ్ఞానరూప చితిని నీవు స్వయముగ తెలుసుకొనగలవు.

మునిపుత్రా! నాకు తోచినంతవరకు చెప్పితిని. ఈ బ్రహ్మ విద్యా రహస్య మొకసారి వినుటచే, సిద్ధికాజాలదు. బుద్ధిమంతుడగు జనక చక్రవర్తి నీకు తిరిగి బోధించగలడు. అతని నాశ్రయించి, శాంతిని పొందుము నమస్కరించెదననుచు యా తాపసి, రాజుచే పూజింపబడియు, సభ్యులచే నమస్కరింపబడి యధేచ్ఛంజనియె.

ఓ పరశురామా! శుద్ధ సంవేదన, రూప మీరతి నుండునని దత్తాత్రేయ గురుడు బోధించెను.

పదునైదవ అధ్యాయము

సంపూర్ణము.

# పదునారవ అధ్యాయము

ఈవిధముగ దత్తాత్రేయ గురుదేవుడు తెలియజేసిన అష్టావక్ర, తపస్వినుల సంవాదమును విని, పరశురాముడత్యాశ్చర్యమును పొందియు శాంతిలేనివాడై, బ్రహ్మ విద్యా రహస్య మీవిధముగ నిదివర కెప్పుడును వినియుండలేదు. జనకమహారాజువలన, అష్టావక్రు డీవిధముగ బోధించ బడి కృతార్ధత చెందిన, విజ్ఞానిమణి ప్రభావమును దయతో శలవిచ్చి నన్ను బంధవిముక్తునిగా జేయ వేడుచున్నానవగా, దత్తాత్రేయ గురుం డిట్లనియె.

తాపసివిజాసి అష్టావక్రముని, అచ్చటగల బ్రాహ్మణుల ప్రేరేపి తుడై జనకుని యొద్దకుపోయి, రాజా! తాపసి చెప్పిన. అవేద్యమగు పర తత్త్వ రహస్యము నాకు సంపూర్ణముగ బోధపడలేదు. మీరు దయతో తిరిగి నొకపర్యాయము బోధింపుడనగా, జనకుడిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా! ఆ పరతత్త్వమును తెలియగోరువారు ప్రపంచమున తెలియదగినవారుగాని, బహువరుదుగ నుందురుగాన, అతి జాగ్రతగా నాలకించుము. ఆ శుద్ధ చిదాత్మ జ్ఞానరూపిణియగుటచే, జడ వస్తువులవలె, అపత్పదార్థమును, ఆ జడమగు పత్పదార్థమును గాక, పద పత్తుల కతీతమగుచు, ప్రమాణ ప్రమేయముల కాధారమగు ప్రమాతకు సాక్షి యగుచున్నది, అందువలన బుద్ధ్యాది జడవస్తువులచే నెరుంగదగినది కాదు. ఉపాధి సహిత సవిశేషజ్ఞానమువలన, తెలియకపోయినను, గురు వాక్య ప్రబోధవలన, నిర్విశేష జ్ఞాన ప్రకాశకాలమందు జ్ఞానగోచర మగు చున్నది. ఆ విద్యావర్ణమగు మానసేంద్రియ వృత్తులయందలిమతములేని

బుద్ధి యోగమువలన, త్రిపుటి రహితమగుటచే, నిర్విశేష జ్ఞాన ప్రకాశ మందు నిర్వికార చిద్రూపము స్వస్వరూపముగ భాసింపగలదు.

అంతఃకరణ ప్రతిబింబిత, చిద్రూప చైతన్యమే తానను, జ్ఞాన స్ఫురణ తనకు సంభవించినప్పుడు గదా! బుద్ధికా స్ఫురణ సంభవిం చుట. అందువలన నిర్గుణ పరతత్త్వమును నిరూపించుట తెలియుట మొద లగు లక్షణములు సగుణలక్షణమై ప్రమాతాది, జీవధర్మ మగుచున్నది గాని, ఉపాధి లక్షణము గాదు. సగుణ, నిర్గుణ, ధర్మములు చితియందు కల్పితమైన ఉపాధి ధర్మములగుచున్నవి. చితికి నుపాధియగు జ్ఞానముచే తెలియబడుచున్న చిత్ప్రతిబింబిత జగత్తును తెలుసుకొనుచున్న తన కన్య ముగా భావించునట్టి జ్ఞానరూపమే పరచితి యనియు, యా పరచితియే నీవనియు తెలియదగిన, స్వసంవేద్యమైయున్నది. నీకు జ్ఞానముచే తెలియ బడుచున్న ఘటపటాది వస్తుపరిచయ ప్రకాశజ్ఞానమే చిదాత్మ జ్ఞాన ప్రకాశ మని గ్రహించుము. అట్టి జ్ఞానప్రకాశమగు చితిని తెలియుట నెట్లంటివేని వినుము.

ఘట జ్ఞానమందు ఘటమును దానినెరుంగు జ్ఞానము అను రెంటి యందును తత్పద, త్వంపద లక్ష్యార్థములుండి యున్నవి. అందు తత్ అను ఘటము తెలియబడు జడపదార్థము ప్రకాశ్యము నగుచున్నది. ప్రకా శ్యమును తెలుసుకొనుచున్న జ్ఞాన ప్రకాశమగుచు, త్వంపద లక్ష్యార్థమగు నీవు స్వప్రకాశమైన చిద్రూపుడ వగుదువు. వస్తు ప్రకాశకమగు జ్ఞానము భానశక్తి రూపమగుచుండును. ఆ భానశక్తి జ్ఞానరూపముచే సర్వవస్తువులను భాసింపచేయదగి యుండుటచే భావ్యరూపమగు జడము కాదు. పదార్థ భాసనయందును, జ్ఞానము పరచితి నాశ్రయించి, నేకాకారముగనేయుం

డును. విషయ భావనయందు జ్ఞానము పృథగూపమై దోచినను, సర్వాధిష్ఠానమగు పరచితి సర్వభావనల నాశ్రయమై సర్వత్రా సదా ప్రకాశించు చుండుటచే స్వప్రకాశకమగును. సర్వభావనల కాధారమగు జ్ఞానశక్తియే పరచితియగు గాయత్రి యనబడును. సర్వోపాధులయందును గల బుద్ధియందు ప్రతిఫలించి భావనామాత్రమై జ్ఞానముచే సర్వము తెలుసుకొనుచు తన కన్యమగు జడపదార్థములనెల్ల ప్రకాశింప చేయుచున్న చిచ్ఛక్తినే ప్రత్యగాత్మయని వర్ణించెదరు.

ఉపాధి జన్యమగు వృత్తిజ్ఞాన ప్రకాశమగు వివిధ విషయ ప్రకాశమెల్లను, ఉపాధికృత భేద దృష్టిగాని, జ్ఞానమునందా భేదభావ ముండదు. జ్ఞాన రూపాంతఃకరణ ప్రతిబింబిత చైతన్యమునే గాయత్రి యనబడును. జ్ఞానముచే తెలియబడు సర్వపదార్థములు చిత్తునకన్యప్రకాశ్యము జడములగు చుండును. ప్రమాణ గోచరమగు విషయములు ప్రకాశించుట కాధారమగు సంవిత్తు వేద్యములకంటె అన్యమై నిత్య స్వప్రకాశమగుచున్నది. సంవిత్తు అన్నివస్తువులవలె వేద్యమైనది గాకపోవుటచేతనే సామాన్యుల కగోచర మగుచున్నది, అట్టి సంవిత్తు సహితము జడమనియు సంవేద్యమనియు తలచినయడల దానిని ప్రకాశింపజేయు మరియొక సంవిత్తుండవలెను. అట్లున్నట్లు అనుభవమందు గాన్పించదు. వేద్యమగు జగత్తునందనేక రూపనామభేదము లున్నట్లు సంవిత్తునం దెట్టిభేధము లేదు. మాలయందు కూర్చబడిన పుష్ప ముత్యాదుల వంతములైనను, సూత్ర మొక్క రూపమైన విధమున ఘటపటాది జగద్రూపము వల వంతములైనను వానిని తెలుసుకొను జ్ఞానమేకమై యున్నది. చిత్స్వరూప జ్ఞానము శాస్త్రీయదృష్టి యందు పరోక్షమైనను అంతర్దృష్టిచే స్వయముగ విచారించినయడల, అపరోక్షమే అగుచున్నది.

ఏకరూపమగు దర్పణ మనేకములగు ఆకాశ, పర్వత, వృక్షాదులను, ప్రతిఫలింపజేయదగినట్లు నేకరూపమగుచితి, దృశ్యాకారముగలదై, ఉపాధి వశమున వివిధ రూపములచే ప్రకాశించుచున్నట్లు భాసించును. ఈ చితి సర్వమును భాసింపజేయదగిన, మూలప్రకృతి యగుటచే వేత్త యగును. వేద్యమెప్పుడు వేత్త నెరుంగజాలదు. వేద్యమగుజగత్తుయొక్క సృష్టి స్థితి లయాదులకు మూలమగు గాయత్రియే నీవని, భావించి, సదా. అహం బ్రహ్మాస్మి అనుచు స్మరించుచుండుము.

అహంశబ్దము. సవికల్పమనియు నిర్వికల్పమనియు రెండు విధములు. అందు సవికల్పమను అహంకర పురుషలక్షణమైన ప్రమాత ప్రమాణ ప్రమేయాది విధులచే త్రిమాత్రల కాధారమై త్రివిధావస్థలతో కూడి పరిచ్ఛిన్నము గలదగుచు బంధహేతువగుచున్నది. దాని కన్యమగు నిర్వికల్ప తత్వము అక్షరపురుష లక్షణమై త్రిపుటిభేద శూన్యమగుచు సదా ప్రకాశించు కేవల జ్ఞానరూపమే నిర్వికల్ప అహమనబడును. నిర్వికల్పమగు అహంశబ్ద లక్ష్యార్థము త్రిపుటియందును త్రిపుటి రహితమందును ఎట్టి వికారములులేక ప్రకాశించు చిత్తునే గాయత్రి యనియు, యా గాయత్రియే నీవనియు గ్రహించుము.

చిత్తమునందు ప్రతిఫలించియున్న చిదాభాసమే నీవను అంతర్లక్ష్యము గలవాడవై ప్రమాణప్రమేయాది బాహ్యవృత్తి నుపేక్షించి నీ స్వరూపమైన కేవలచిద్రూపమునందు లక్ష్యముంచుము. ఇంద్రియ నిగ్రహముగల ఉత్తమాధికారులైన బుద్ధిమంతులు ఉపదేశకాల మందు మహావాక్యార్థ రహస్యము పరోక్షముగ దెలియబడినను అపరోక్షముగ గ్రహింతురు. అని జనకుడు చెప్పగా అష్టావక్రముని ఇట్లనియె.

ఓ రాజా! ఇంద్రియంబులు నిగ్రహించి, అంతర్దృష్టిచే నవలోకించుట యెట్లనగా, జనకుడు. బ్రాహ్మణోత్తమా! అంతర్బాహ్యదృష్టికి ప్రధానము మనస్సు గాని, ఇంద్రియంబులు గావు. జాగ్రదావస్థయందొకవేళ ఇంద్రియంబులు ప్రధానమని తలచినను సర్వేంద్రియ ప్రచార శూన్యమగు స్వప్నమందు సర్వవిషయాభాసమునకు మనసు కారణము గాని నీవు కాదు. మనస్సన్యవిషయచింతన చేయునప్పుడు దాని కన్య విషయమును ఏ ఇంద్రియము గ్రహించజాలదు. సూర్యుడు తన ప్రకాశముచే ప్రకాశించు బ్రహ్మాండమందుగల నే విషయమందును లక్ష్యముంచక, స్వగమన మందు లక్ష్యముంచు విధమున. చిత్స్వరూపుడవగు, నీ యొక్క జ్ఞాన ప్రకాశకములగు ఇంద్రియ విషయములందు లక్ష్యముంచక. నన్స్వరూపానంద మగ్నుడవై తరించుము.

మనోభావన సిద్ధి యగుటకు రెండు లక్షణము లుండవలెను. అందు మొదటిది చంచల రహితమగు ఏకవస్తు నిశ్చలభావనా జ్ఞానము. రెండవది. తదేక పరత్వము. ఈ రెండు సాధనములు సంభవించనిగాని, ప్రవృత్తియందు సహితము కార్యసిద్ధి లభించనేరదు. ఆ విధముగనే, బాహ్యవిషయ సుప్పణవదలి అంతర్లక్ష్యమందు విషయమును నిర్మించ దగిన, చిదాత్మ జ్ఞాననిశ్చల భావనాదారుఢ్యము మందువలన, తదేక పరత్వము సంభవించినగాని, సమాధియు అందువలన. పరశంతియొక్క సగుణ నిర్గుణ తత్త్వముల సాక్షాత్కారసిద్ధియు లభించనేరదు. ఆ కారణమువలన. యోగమునందుగల పూర్వాంగాభ్యాసమువలన. చిత్తవృత్తి నిరోధము లభించినంత మాత్రముచే చిదాత్మ సాక్షాత్కారము లభించనేరదు.

పరచితి దృశ్యకోటియందు లభించునది గాదు. మరేమన, దృగ్రూపమై యుండుటచే దేహాభిమానముగల మానవుల కగోచరమగు చున్నది. గాన, చిత్తమునందు ప్రతిఫలించియున్న పరచితి సాక్షాత్కారమునకు, చిత్తవృత్తి నిరోధమును సర్వవృత్తి జ్ఞానసాక్షియందు తదేక పరత్వము సాధనములగుచున్నవి. అనాత్మ వ్యవహారవృత్తి శూన్యకాలమునందే, తదేక పరత్వము సంభవించుటయు, తదేక పరత్వకాలమందే వృత్తిశూన్యమగుటయు సంభవించుచుండుటచే ఈ రెంటికి అవినాభావ సంబంధము కలిగియున్నదిగాన, ప్రథమమున చిత్తవృత్తులను నియమించుటకుగాను పతంజలి మొదలగు బ్రహ్మవిదులచే యోగమువలన, చిత్తవృత్తుల నియమించదగిన సాధనము తెలుపబడియున్నది.

చిత్ప్రతిబింబితమగు గాయత్రి మనోవృత్తులకు (సంకల్పములకు) సాక్షియై గ్రహించుచుండుట వలననే, మనోవృత్తు లతిశయించి, సృష్టి బహుళమగుచుండును గాని, మనస్సు వృత్తిశూన్యమై, తదేక పరత్వము సంభవించినప్పుడు మాత్రము జ్ఞానసహితముగ సర్వాధిష్ఠానమగు పరబ్రహ్మయందు లయించగలదు. చిదాభాసమగు ప్రకృతియందలి విషయములను సాక్షిరూపముచే గుణరహితముగ గ్రహించుచుండుటవలన జీవన్ముక్తావస్థయనియు, సాక్షిత్వ జ్ఞానవృత్తి రహితమగు తదేక పరత్వముచే సర్వాధిష్ఠానమగు నిర్గుణ పరబ్రహ్మమందు లయించినప్పుడు విదేహముక్తి యనియు, బ్రహ్మవిదులు నిర్ణయించెదరు.

దృశ్యమగు ప్రకృతియందుగల వస్తువులను గ్రహించునప్పుడు ఇంద్రియ గోచరమగు నేకవస్తు జ్ఞాన, లక్ష్యముండుటచే తదేక పరత్వమనవసరమగుచున్నది. చితి ఇట్లు ఇంద్రియములకు స్ఫురించునది గాక

పోవుటచే అంతర్లక్ష్యముచే మనస్సునందు తత్స్వరూపభావనయు, తదేక పరత్వము అవసరమగుచున్నది. జంతువులవంటి ఉదరంభరులగు మానవులకు ఇంద్రియములద్వారా విషయములను గ్రహించుటయు, అనుభవించి తృప్తి నిపొందుటయు, మొదలగు వృత్తిజ్ఞానముచే కాలక్షేపము చేయుచుండుటవలన, మానసేంద్రియములకు గోచరముగాని ద్వగ్రూపమగు పరచితి జ్ఞానమును తదేక పరత్వమును, అభ్యాసము చేయదగిన సమాధ్యనుభవము లేకపోవుటవలన, ఈశ్వరస్థానమగు తుర్యావస్థ నెరుంగనివారై, జాగ్రదాది త్రివిధావస్థలచే జీవభ్రాంతి నొందుచు బ్రహ్మజ్ఞానము నందసమర్థు లగుచున్నారు.

దర్పణ ప్రతిబింబితాకారములు నిర్మలముగ స్ఫురించని యడల దర్పణ మాలిన్యమును నివారింప దలచునట్లు అంతఃకరణ ప్రతిబింబిత చితి, సాక్షాత్కరించని యడల అంతకరణగత అవిద్యా సంభవ గుణ వికారములను నివారించదగిన యోగోపాయమును గ్రహించుట యుచితమగుచున్నది. గాన, యోగమునందుగల పూర్వాంగాభ్యాసముచే చిత్త వృత్తుల నియమించుటయను ప్రథమ ప్రయత్నమువలన వృత్తిరహితమగు చిత్తము ఆత్మాకారమగుట వలన సంభవమగు నిర్విషయానందసుఖము లభించుటచే తదేక పరత్వము స్వయముగ లభించగలదు. దేశకాల వస్తు పరిచ్ఛేదముగల జగత్తునందలి సర్వవస్తువులును, చిదాత్మ జ్ఞాన ప్రకాశకములను జడములు నగుటవలన చిదాత్మను పరిచ్ఛేదించుటకుగాని తెలుసుకొనుటకు గాని సమర్థత గలవిగావు. అందువలన చితి, సర్వవ్యాపియు, జగదాధారయు నగుచున్నది. విశ్వరూప వ్యవహార సంభవమగు పృథగ్భావమెల్లను, ఉపాధి సంభవమగుచున్నది గాని, చిత్తు లక్ష్యార్థమందు నేకా

కారమై యున్నది. చిత్తునకు విషయావలోకనము జ్ఞానముపలన నారోపిత మగుచు స్వయముగ లేనందున, అవేద్యమును నిర్వికల్పమును అగు చున్నది. ఆ విధముగనే అవిద్యోపాధియందు ప్రతిఫలించిన చితి మనో రూపముచే ప్రకృతి పరిణామమును పొందుచున్నను సంకల్ప వృత్తి రహితమైన యడల నవిశేష జ్ఞానము చితియందు లయించి, తత్త్వజ్ఞాన సాధన మగుచున్నది.

మనస్సు బహిర్ముఖమై ఇంద్రియ ప్రవృత్తియందు లక్ష్యముండు నంతవరకు జ్ఞానము ఉపాధి సహితమైన సవిశేషజ్ఞాన మగుచుండునుగాని నిర్విశేషమగు బ్రహ్మజ్ఞానము సంభవించదు. అట్లొకవేళ వాచ్యార్థమందు సంభవించినను లక్ష్యార్థమం దుపయోగించజాలదు. నహంకారాభావమై అంతర్ముఖమైనప్పుడు, స్వరూపజ్ఞానము స్ఫురించక మానదు. వేదాధ్య యన, యజ్ఞయాగ, సంధ్యావందనాది స్థూలశరీర కృతకర్మలు నిష్కామ ముగ జేసినయడల క్రమక్రమముగ చిత్తశుద్ధికి కారణములగును. సకామ మైనయడల తత్ఫల మనుభవించుటకు యోగ్యములగునుగాని, బ్రహ్మ జ్ఞాన సాధనములు గావు. యోగమునందుగల పూర్వాంగ సాధనమువలన ఆజన్మమందే చిత్తశుద్ధికి కారణమగుటయేగాక, ఉత్తరాంగ సాధనమువలన సద్యోముక్తి లభించగలదు. గావున ఇహపరాదులకు కారణమగు మనస్సు సహితము చితినలెనే, అవేద్యమగుచున్నదని చెప్పగా అష్టావక్రముని,-

ఓ రాజేంద్రా! మనస్సునకు సంకల్పవృత్తి వున్నంతవరకు చిదాత్మ స్వరూపజ్ఞానము సంభవించదని చెప్పితిరి. సర్వజీవులకు సుషుప్తి యందు సంకల్పరూపమగు జగత్తు భాసింపకపోవుట సహజమై యుండు టచే పరచితి సాక్షాత్కరించుట కభ్యంతర ముండదుగదా. ఆ విధముగ

సుషుప్తియందు సర్వజీవులకు వృత్తి శూన్యత స్వభావముగ లభించుచుం
డగా. సాధనాంతరములచే వృత్తి శూన్యతకొరకేల ప్రయత్నించవలెనని ప్రమా
ణములు చెప్పుచున్నవో దెలియగోరుచున్నాననగా, జనక చక్రవర్తి.—

ఓ బ్రాహ్మణోత్తమా! సుషుప్తియందు మనస్సుకు వృత్తి శూన్య
మగుట సత్యమే గాని, తమోగుణముచే నావరింపబడిన అవిద్యయందు
లయించిన, మనస్సు సుషుప్త్యావస్థ గలదగుటచే మరియొక దానిని తన
యందు ప్రతిఫలింప జేసుకొనదగిన నిర్మలమగు శుద్ధ తత్వము హీనమగు
చున్నది. సత్వగుణాంశమగు నిర్మల మనస్సునందు ఆత్మ ప్రతిఫలించిన
యెడల మనన శక్తియు, సంకల్ప శక్తియు, ప్రతిబింబిత శక్తియు గలద
గును గాని, తమోగుణ ప్రధానమగు సుషుప్తియందు దన యెదురదోచు
వస్తువులను గ్రహింప నశక్తి గలదగుచున్నది. సత్వగుణాంశమువలన
జాగ్రత్తయందు వస్తు గ్రహణమును తమోగుణాంశమగు సుషుప్తియందు
జడత్వమును మనస్సుకు సంభవించుచున్నది. అద్దము కాటుకచే పూయబడి
నప్పుడవ్వవస్తువును ప్రతిఫలింపచేయజాలనియట్లు మనస్సు తమోగుణాంశ
మైన సుషుప్తియందున్నప్పుడు జ్ఞానము శూన్యమగుటవలన ప్రతిబింబిత
జగత్తునుగాని బింబరూపమగు పరచితినిగాని తెలుసుకొనలేని జడమగు
చున్నది.

తాను స్వయముగ జడమైనప్పుడు స్వప్రకాశమగు చితినెట్లు
తెలియదగి యుండును. జడమగు మనసువలన చిత్తు ప్రకాశించునెడల
స్థావరములగు లోహతరుపాషాణాది సర్వవస్తువులు ఆత్మజ్ఞానముగలవై
యుండవలెను. అట్లు కలిగియున్నవని తలచినయెడల ఉత్తమ శరీరములు
గల దేవ మనుష్యాది స్వరూపములే ఆత్మసాక్షాత్కారమునకయోగ్యమై

యున్నట్లు సర్వత్రా అనుభవమై యుండ తరు పాషాణాదులకెట్లు ఆత్మ సాక్షాత్కారము లభించగలదు. గావున జడమగు మనస్సు చితిని స్వయముగ ప్రకాశింపజేయజాలదు. సత్వగుణాంశమైన జాగ్రదావస్థయందు వృత్తి శూన్యమగు మనస్సునందనే ఆ చితి స్ఫురించగలదు. దర్పణము మాలిన్యము గప్పబడినప్పుడు ప్రతిబింబము కాన్పించకున్నను బింబము ప్రతిఫలించియున్న విధమున తమోగుణ ప్రధానమగు సుషుప్తియందు జ్ఞానరూపమగు చితి ప్రతిఫలించి కార్యోన్ముఖము గాకపోయినను చితి సర్వవ్యాపకమగుటచే మనస్సుయొక్క తమోగుణ స్వభావమైన జడ లక్షణమును గ్రహించుచునే యున్నది. ఆ కారణముచే ప్రతిమానవుడు సుషుప్తియందు తనకేమియు తెలియనిదశను సుషుప్త్యానంతరము స్మరించుచున్నాడు.

మనస్సునకు రెండవస్థలు గలవు. అందొక్కటి ప్రకాశము. రెండవది విమర్శనము. అందు ప్రకాశమనగా మనస్సుయందు ప్రతిఫలించిన జ్ఞానము ఇంద్రియములద్వారా బాహ్యమందున్న వస్తువుల యాకృతిని పొందుటయే ప్రకాశావస్థ యనబడును. ఈ జ్ఞానప్రకాశము సర్వవస్తు సమానమగుటచే నిర్వికల్పముగనే యుండును. వస్తు ప్రకాశ జ్ఞానానంతరము ఇది సువర్ణము, ఇది పాషాణమను విమర్శనా భేదమువలన సంభవమగు అపేక్ష జ్ఞానముసంకల్పమనబడును. దీనినే సవికల్పమగు విమర్శనావస్థయనబడును. ఈ సంకల్పము అభినవమనియు, సంస్కారమనియు రెండు విధములు. నూతనపరిచయాపేక్ష గల విషయసంకల్పము అభినవమగుచున్నది. ప్రాకృత వాసనా జన్యమగు దృఢ సంకల్పము సంస్కారమనబడుచున్నది.

ఈ విధముగ మనస్సునకు జ్ఞాన ప్రకాశాత్మక నిర్వికల్ప శక్తియు, విమర్శనాత్మకమగు సవికల్ప శక్తియను రెండు శక్తులు స్వభావము లగు చున్నవి. సుషుప్తి యనగా అవిద్యయందు తమోగుణాంశమైన జ్ఞాన హీన మగు జడావస్థ యనబడును జాగ్రదావస్థ యనగా చిత్ప్రతిబింబిత శక్తి వలన ప్రకాశ విమర్శాత్మక మగు సంకల్పాది సర్వవ్యవహార జ్ఞానసాధన మగుచున్నది. స్వప్రకాశముగల ఈ చితి సూర్యదీపాదులవలె స్వయ ముగ జడమై అన్యపదార్థ సహాయమువలన ప్రకాశించునదికాదు. పరచితికి విమర్శనయనియు, శక్తియనియు, గాయత్రి యనియు క్రియాస్పందన యనియు, పరిహంతయనియు ప్రమాణములయందు పర్యాయ పదములు ప్రయోగించబడి యున్నవి. ఈ గాయత్రి శక్తివలననే పరమాత్మ జగ న్నిర్మాణము చేయుచున్నాడు, ఈ శక్తివ్యాపక సహాయము లేనియెడల జగత్తునందే భూతము ప్రకాశించజాలదు. వస్తు ప్రకాశ శక్తిగలిగి యున్నను విమర్శనాశక్తి లేనియెడల సూర్యదీపాదులవలె జడమే యగు చుండును, జడమగు దీపఘటాదులవలె సుషుప్తియందు దేహము జడ రూపమే యగును. జడత్వమునకు విమర్శనా భావమే స్వభావమగుచు న్నది. జడరూపమగు సుషుప్తికి అవ్యక్తము కారణమగుచున్నది.

కొందరీ అవ్యక్తమునే మహాశూన్యమందురు. వికల్ప రూపమగు మనస్సునకు నిర్వికల్ప స్థితి సాధనాంతరములచే పరిమితి గలదగు చున్నది. మిగతా కాలములయందు మనస్స్వభావమగు వికల్ప మతిశ యించి స్వరూప జ్ఞానమును మరుగు పరచును. నిర్వికల్ప దశయందు స్వరూప జ్ఞాన ప్రాప్తియు, వికల్పాది క్షమునందు అజ్ఞాన మతిశయించు టచే సుషుప్తికిని హేతువులగుచుండునని చెప్పగా అష్టావక్రుడు,—

రాజా! సుషుప్తియందు మనస్సు లీనమైయుండు గదా! లయించిన మనస్సు సుషుప్త్యావస్థను దెలుసుకొనుటెట్లని యడుగగా జనకుడు.—

బ్రాహ్మణోత్తమా! అవిద్యయందు లయించిన మనస్సు సుషుప్త్యావస్థ లక్షణమెట్లెరుంగగలదు. సర్వావస్థలకు సాక్షియగు నా పరచితికి వ్యక్తావ్యక్తములను రెండు శక్తులు గలవు. అందవ్యక్త ప్రకాశకమగు మనస్సు అవ్యక్తమందు లీనమైననూ వ్యక్తావ్యక్తములను ప్రకాశింపజేయు చితి సర్వదా ప్రకాశించుచునే యుండునుగాన అవ్యక్తమందు లీనమగు మనస్సునకేమియు దెలియక యుండుట చితి యెరుంగుచుండును. అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యమే చిత్తమనబడును, యీ చిదాత్మతత్వమే విషయములయందు సంకల్పించి మనస్సనబడుచుండును. సుషుప్తియందా మనస్సు ప్రకాశ జ్ఞానములేనిదై తనకుత్పత్తి స్థానమగు అవ్యక్తమందు లయించును. నొకవేళ జాగ్రదావస్థయైనను చిదాభిముఖముగాని మనస్సు బాలోన్మత్తులవలె జడమై ప్రకాశయోగ్యము గాకయుండును.

ఓ బ్రాహ్మణోత్తమా! నా యనుభవమువలన నొక రహస్యము చెప్పెద నాకర్ణించుము. ఈ విషయమై పండితులగువారు సహితము పొరబడుచుండుటవలన ఈ విషయమతి రాజగుహ్యమగుచున్నది. పరచితి ఉపాధి సహితమగు సవిశేష జ్ఞానశూన్యమై నిర్విశేష జ్ఞానమాత్రముగ నుండుటయే నిర్వికల్ప సమాధి యనబడుచున్నది. ఆ యవస్థనే తురీయాతీత మందురు. జాగ్రదాది తుర్యాంతమగు నాల్గవస్థలను దేహ ధర్మములై జీవేశ్వరుల నిలయములగుచున్నవి. సర్వావస్థ లక్షణములను విమర్శించునట్టి బుద్ధికి ఉపాధివలన భేదము గాన్పించునుగాని, సర్వోపాధుల కాధారుడగు బ్రహ్మవేత్తకు సర్వావస్థలయందలి జ్ఞానమొక్క రూపై

యుండుటచే అంతఃక్కరణ ధర్మముగాని అవస్థా ధర్మముగాని జ్ఞానముప కంటవు. చతుర్థావస్థలయందు దోషు భాస్యము వేరైయున్నను. అవస్థా రహితమగు చిద్రూపుడైన జ్ఞానికి అవస్థాభేద జ్ఞానము స్ఫురించగలదు. సూక్ష్మ సమాధులనేకములు గలవు. యీ సమాధులయందు స్వరూప జ్ఞాన స్ఫురణములేనందున ఆ సమాదులు సర్వత్రా నుపయోగింపజాలవు. జాగ్ర దావస్థయందు వస్తు విమర్శనాభిలాష లేకపోవుటవలన ప్రతిబంధ రహిత మగు సమాధి యనబడును.

వస్తు విమర్శనాభావమే సమాధియగుటచే జాగ్రత్సుషుప్త్యా ద్యవ స్థలయందు సమాధిలక్షణము సూక్ష్మమైయున్నది. గాని జాగ్రదావస్థయందు సుఖ మనుభవించితినయు, సుషుప్తి యందు నాకేమియు తెలియలేదనియు, నేను దానిని చూచితినను త్రిపుటిలక్షణము. ముఖ్య సమాధిలక్షణములు గావు సమాధియందు సంభవమగు నిర్విశేష జ్ఞానసిద్ధివలన, సమాధిలేని కాలమందును స్ఫురించుచుండునట్టి స్వరూపజ్ఞాన తత్పరత సంభవ మగు టచే నిర్వికల్ప సమాధి యనబడుచున్నది. జాగ్రత్సుషుప్తావస్థలయందును, సూక్ష్మ సమాధులయందును ఘటపటాధి బాహ్యవస్తువులవలె, అంత ర్దృశ్య ప్రపంచమెల్ల నుపేక్షింపదగినదైనను, వానికి గల భేదమును వినుము.

సృష్టికి పూర్వము ఆరంభమందు అవ్యక్త తత్త్వ ముదయించెను. అట్టి దృశ్య సామాన్యాభావమగు అవ్యక్తము సర్వజీవులకు సుషుప్తి యందు సంభవమగుచుండును. దీనిని అత్యంతాభావ మనదగియున్నది. జ్ఞానము అనుభవ జ్ఞానమనియు, స్మృతి జ్ఞానమనియు రెండు విధ ములు. సుషుప్తియందు అంతఃక్కరణము జడమగుటచే యేమియు

తెలియలేదను స్మృతి జ్ఞానము జడాత్మక మగుచున్నది. ఈ స్మృతి జ్ఞానమునే పూర్వము తెలుపబడిన, చిదాత్మ స్వభావజమగు అవ్యక్త జడశక్తి జ్ఞానమనబడును. సుషుప్తియందు ప్రకాశించు జ్ఞానము జడమందు ప్రతిఫలించుటచే జడశక్తి యనబడు స్మృతి జ్ఞానమనియు. నిర్వికల్పధీవృత్తియందు భాసించు చిత్ప్రకాశము జ్ఞాన స్వరూపిణియగు గాయత్రియనియు తెలియదగియున్నది. ఈ రెండు తత్త్వములకు నత్యంత భేదము గలదు. ఘటపటాది వస్తు సముదాయము లాకాశమునకు పరిచ్ఛేదములైనట్లు, అఖండైక రసరూపమగు చిత్తునకు దేశకాల వస్తువులేవియు పరిచ్ఛేదకములు కాజాలవు.

సచ్చిద్రూపైక్య జ్ఞానసమాధి సుషుప్తి జాగ్రదాది సర్వావస్థలయందు సంభవమగు సూక్ష్మ సమాధులకంటె అత్యంత విలక్షణమై భాసించుచుండును. సచ్చిద్రూపైక్య జ్ఞాన సమాధి నిరంతరాభ్యాస బలమువలన, బ్రహ్మానంద సుఖమును, కృతకృత్యతయు, శాంతియు లభించగలదు గాని, జాగ్రదాది త్రివిధావస్థలయందు సంభవమగు సూక్ష్మ సమాధులవలన శాంతి లభించనేరదని జనకచక్రవర్తి అష్టావక్రమునికి బోధించెను.

పదునారవ అధ్యాయము
సంపూర్ణము.

---

# పదునేడవ అధ్యాయము

ఓ పరశురామా! అష్టావక్రముని జనకునివలన, సర్వావస్థలయందును సూక్ష్మ సమాధులు స్వభావముగ సంభవించుచుండునని బోధింపబడినవాడై మరల ప్రశ్న చేయుచున్నాడు. యీ రహస్యములను సావధానముగ వినుమని దత్తాత్రేయులు చెప్పుచున్నారు. అష్టావక్రముని జనక చక్రవర్తిని ఈ విధముగ ప్రశ్న చేసెను.

రాజా! వ్యవహారయోగ్యమగు జాగ్రదావస్థయందును, సూక్ష్మ సమాధులు సదా సంభవించుచుండునని చెప్పితిరి. వృత్తి రహితమగు నిర్వికల్ప సమాధియందు వృత్తి సహితమగు వ్యవహారమెట్లు సంభవించునో వివరింప గోరుచున్నాననగా, జనకచక్రవర్తి సమాధి లక్షణములను తెలియజేయుచున్నాడు.

బ్రాహ్మణోత్తమా! క్రొత్త ప్రియురాలు రత్యారంభమందు గాఢాలింగన మాచరించుకాలమునను, బాహ్యాభ్యంతర చింతలెరుంగక క్రీడించుకాలమునను, అధిక వాంఛగల అలభ్యవస్తువు లభించినప్పుడనుభవించు కాలమందును, గ్రామాంతర ప్రయాణమందరణ్యమున మృత్యుసమానమగు వ్యాఘ్రాదికమును గాంచినపుడు సంభవమగు దుఃఖకాలమందును, సుషుప్తి సుఖమునువదలి, ఇతర విషయసుఖ మనుభవించు కాలమునను సూక్ష్మసమాధు లంకురించుచుండును. మరియు జాగ్రదాది చతురావస్థలు ఒక యవస్థనుండి మరియొక యవస్థ సంభవించునప్పుడు మధ్యగల సంధికాలమందెట్టి విషయావలోకనము లేకయుండుటచే యీ కాలము సమాధి యనబడుచున్నది.

కీటకము నొక తృణాగ్రమునుండి మరియొక తృణాగ్రము నాశ్ర యించువిధమున, సూక్ష్మదేహమగు మనస్సు దూరమందుగల సూర్యమండ లము జూడ ప్రయత్నించినప్పుడు దీర్ఘవ్యాపకమును, సమీప పదార్థమును గోరునప్పుడు సూక్ష్మవ్యాపకము గలదగుచుండును. వ్యాపకమగు మధ్య కాలమున, మనస్సు వికల్పము లేనిదగుటచే సమాధి యగుచున్నది. మనస్సు తాను భావించునట్టి వస్తువెట్టి యాకృతిగలదో అట్టి యాకారమును పొందుచుండును. తాను సూర్యమండలమును భావించునపుడు తనకును సూర్యమండలమునకును మధ్యగల నవకాశము నిరాకారమగుటచే తాను నిరాకారాకారిత స్వరూప సమాధి గలదగును గాన, సమాధులీవిధముగ, సర్వావస్థలయందును దోచుచుండును గాని అనుభవజ్ఞాన శూన్యమగుటచే ఫల మొసంగజాలవు. పరచితి జ్ఞానముగల బ్రహ్మవేత్తలకు సదా సమాధి యగుచున్నది. జాగ్రత్స్వప్న వ్యవహార కాలమందును ఘటపటాద్యాకార ప్రకార జ్ఞానమందచలసాక్షి భావము సమాధి యగుచున్నది. అట్టి సమాధి అనుభవయోగ్యమగు ముఖ్యసమాధి యనబడుచున్నది.

బహువిషయ స్వరూప విమర్శనా జ్ఞానమే ఉపాధి సహితమగు వ్యవహారయోగ్యమైన జాగ్రదావస్థ యనబడును. అట్టి వ్యవహార దశ యందు భిన్నవిషయ వృత్తిజ్ఞానము అనంతమగుటచే నిర్వికల్పము గానే రదు. ఆ కారణమువలన సమాధి విషయమందు అన్యమత ప్రవర్తకులు భిన్నాభిప్రాయము గలవారగుచున్నారు. కొందరు ఖండాజ్ఞాన మనియు, మరికొందరు క్షణిక జ్ఞానమనియు వర్ణించెదరు. క్షణిక ఖండ జ్ఞానముల మధ్యగల నిర్వికల్పావస్థయే సమాధి యనబడును.

ఓ బ్రాహ్మణోత్తమా! సమాధి పరిచయముగల జ్ఞానులకు ప్రతి క్షణమందును సదా సమాధి యనదగియున్నది. అట్టికౌసల్య మెరుంగని

వారికి శశశృంగమువలె మిథ్య యగుచున్నది. జ్ఞానులకు ప్రతిక్షణమందును సమాధి కలదని చెప్పిన జనకుని వాక్యములవి అష్టావక్రముని,—

రాజా! నిర్వికల్ప సమాధియందు వ్యవహారమెట్లు సమకూడును. సర్వత్రా సుషుప్తియందును జాగ్రతయందును అవ్యక్తావరణమగు అజ్ఞానము జడరూపమున భాసించుచుండగా సమాధియు, పురుషార్థము చేకూరు టెట్లు? నిర్వికల్ప సమాధివలన, శుద్ధ చిదాత్మ నిర్వికారముగ ప్రకాశించుచుండ మరల ప్రవృత్తి సహితమగు సంసారమెట్లు సంభవమగును. అజ్ఞాన నాశనమునకును. విజ్ఞాన ముదయించుటకును నిర్వికల్పసమాధి ముఖ్యమని చెప్పితిరి ఈ విషయమువందు నాకుగల సందేహము నివారింప గోరుచున్నానగా జనకుడు,—

బ్రాహ్మణోత్తమా! సంసారమునకు కారణమగు అజ్ఞాన మనాది సంభవమగుచు మనోవాసనా సహితమై దట్టముగ అంతఃక్కరణయందు వ్యాపించియుండును. ఆ యజ్ఞానముచేత సుఖదుఃఖ ప్రవాహబాహుళ్యమగు సంసారము వభివృద్ధి నొందుచుండును. యీ సంసార భ్రాంతివలన దేవ మనుష్యాది సర్వజీవులు మోహము నొందుచున్నను స్వప్న ప్రపంచము వలె నసత్యమగుచున్నది గాని నిత్యముగాదు. బంధరూపమగు ఈ సంసార చక్రమును ప్రవర్తింప చేయుచున్న అవిద్యోపాధిగల అజ్ఞానము తన కార్యపర్ణమైన ఆవర్ణ విక్షేపశక్తులు సహా జ్ఞానోదయ కాలమందు నిశ్శేషముగ నశించునని నిశ్చయింపబడినది. సోహం. అను జ్ఞానమే వీ యజ్ఞానమును సమూలముగ నశింపజేయును. ఇది శాస్త్రసిద్ధము ఆర్య వచనమునై యున్నది. వైరాగ్యాది జ్ఞానసంపత్తిగల ముముక్షువునకు ఆత్మ స్వరూపజ్ఞానము పరోక్షముగ సంభవించును. యీ పరోక్ష జ్ఞానమువలన

వేదాంతశాస్త్ర శ్రవణ మననాదులొనర్చుటచే సంశయము నివారించి విధి ధ్యాస విశేషమువలన విపరీతభావన శూన్యమగుచు శుద్ధా పరోక్షజ్ఞాన సిద్ధి లభించగలదు. అందువలన గురుశాస్త్ర నియమితమగు ప్రత్యగాత్మ పరమాత్మలకైక్యస్థితి సోऽహం అను మంత్రముచే నిశ్చయమగును. దేహ పరిగ్రహణమువలన సంభవమగు జీవత్వభ్రాంతి యీ మంత్రార్థ రహస్య మననమువలన నశించి సర్వవ్యాపకమును అద్వైతమును పరిపూర్ణమునగు పరంజ్యోతి తానను జ్ఞానము సంభవించును

నేను, వాడు, నేను నేనే. వాడు వాడే, యను తత్పదార్థ, త్వం పదార్థ, పృథగ్భావము ఉపాధి సంభవమగుటచే నా రెండుపదములకు లక్ష్యార్థమగు శుద్ధ చిన్మాత్రమైన గాయత్రి తానే యని గ్రహించునట్టి ప్రత్యగభిన్న జ్ఞానమువలన అజ్ఞానాంధకారము సమూలముగ నశించునని రాజు చెప్పగా, అష్టావక్ర డిట్లనియె.

రాజా! దేహభ్రాంతివల్ల దోచు జీవభ్రాంతి అజ్ఞాన సంభవమని చెప్పితిరి. నా యజ్ఞానము నశించు నుపాయమెరింగించ గోరుచున్నాననగా, జనకచక్రవర్తి, ఓ బ్రాహ్మణోత్తమా! ఉపాధి సంభవమగు జీవభ్రాంతి వాచ్యార్థమగుచున్నది. అట్టి ద్వైతభ్రాంతి ఉపాధి కాధారమగు లక్ష్యార్థ విమర్శనమువలన ఆభాసమాత్ర మగునుగాని సత్యముగాదు. చిదాభాసు డుపాధి కలంకారాభాసమని తలచినయెడల దర్పణమందు ప్రతిఫలించిన ముఖము ఆభాసమాత్రమైనట్లు చిదాభాసము మిథ్యయగుచు సోऽహం యను వాక్యార్థానుసారము బింబ ప్రతిబింబము లొక్కరూపమగుటచే వికల్పములేని సమాధియనబడుచున్నది. అట్టి సమాధియందు అంతఃకర

రణ ప్రతిబింబిత వాచార్యార్థమైన జీవత్వ భ్రాంతి నశించి లక్ష్యార్థమైన బింబరూప చైతన్యమొక్కటియే ప్రకాశించుచుండును.

సోఽహం అను ప్రత్యయ జిజ్ఞాసాత్మకమగు సవికల్ప సమాధి యందు తచ్ఛబ్దాస్మచ్ఛబ్దార్థోప స్థితి సహా కృతా నాత్మవస్తు పరావృత్తమగు టకు మనస్సు కారణమైయున్నది. ఆ మనస్సు ఆత్మాభిముఖమై పృథగ్భా వములేని వాసనా రహితమగు చితియందైక్యమగువట్టి నిర్వికల్ప సమాధి యందు భావా భావములులేక సర్వ సమత్వముగలదై ప్రవృత్తియందు ద్వేషమును నివృత్తియం దనురాగమునులేక యుండువట్టి సమదృష్టి యందు అజ్ఞానమును ద్వేషించి నివారింప నుపేక్ష గలదగుచున్నది. రట్టి నిర్వికల్ప సమాధి తత్పరతగల బ్రహ్మవేత్త సవికల్ప సమాధియందు ప్రకాశించు శుద్ధ బుద్ధ్యుపాధి గల పరచితి సృష్టి స్థితికిని జ్ఞానా జ్ఞానములకును ఆధారమగుచున్నది. పరచితి ఉపాధిసహితమై యున్నను వృత్తి రహితమగు కేవల శుద్ధజ్ఞానమునకు నిర్వికల్ప సమాధియని తెలియదగియున్నది. సంకల్ప దశయందు అనేకములగు వికల్పములు గల సవికల్ప జ్ఞానము సంభవమగుచుండును. ఈ జ్ఞానము కార్య కార భేదములచే బహువిధములుగ దోచుచుండును. పరచితియగు గాయత్రికి ప్రకృతికంటె వేరగు స్వతంత్రమైన స్ఫురణ జ్ఞానము సహజమైయున్నది. ఈ స్ఫురణ జ్ఞానమునకే మాయయను నామాంతరముగలదు. ఈ మాయ అవిద్యయను మరియొక యంశమువలన జగత్తును భాసింపజేయుచుం డును. ఉపాధి సహితమగు జీవునకు స్వాత్మయందు పూర్ణత్వఖ్యాతి లేక పోవుటచే అజ్ఞానమగుచున్నది. అట్టి పూర్ణత్వ ఖ్యాతి లేకయుండుటవల ననే జగత్కారణత్వము సంభవమగుచున్నది. ఆ చిదాత్మ దేశకాలవస్తు కృత పరిచ్ఛేదము లేనిదగుటవలన పరిపూర్ణమగును.

పరిచ్ఛేద కార్యములగు దేశకాల వస్తువులు పరచితి నిర్మితము లగు టచే సర్వాధారమగు యాపరచితిని బాధింపజాలవు. అట్టి పరచితికి ఉపాధి సంభవమగు ఆవరణమువలన నారోపించబడిన అపూర్ణత్వ లక్షణమే, మూలా జ్ఞాన మనబడును. యా మూలాజ్ఞానము ఉపాధి సంభవమగుచు త్రికాలావస్థలచే బాధింపబడుచున్న అజ్ఞానమువలన దేహమే తానను భ్రాంతి కల్పితమై మూలాజ్ఞానమునకు చిగురువలె సూక్ష్మరూప మంకురించి, నేను పండితుడను, జ్ఞానిని, గ్రుడ్డివాడను, బ్రాహ్మణుడనను దేహాభిమానము వృక్షమువలె స్థూలరూప మగుచుండుట శరీరధర్మ మగుచున్నది. పరిపూర్ణ స్వరూపజ్ఞాన ముదయించినగాని అజ్ఞానము నశించదు. అజ్ఞానము సమూలముగ నశించినగాని జనన మరణరూప సంసారము నివర్తింప జాలదు. అట్టి నిర్విశేష పరిపూర్ణాత్మజ్ఞానము పరోక్షము అపరోక్షమని రెండు విధములు. గురుశాస్త్ర ప్రబోధకమగు పరోక్షజ్ఞానము సంసార దుఃఖమును సంపూర్ణముగ నివారింపజాలదు.

ఓ బ్రాహ్మణోత్తమా! గురు శాస్త్రములయందు శ్రద్ధాభక్తి గలిగి చేయబడిన శ్రవణమువలన సంభవమగు పరోక్షజ్ఞానముచే మంత్రార్థ మనన రూపమగు సమాధి అపరోక్షజ్ఞాన సాధనమగుచున్నది. చిరకాల సమాధ్యనుభవ పరిపాక వశమున సంభవమగు అపరోక్ష జ్ఞానము అజ్ఞానమును సమూలముగ నశింపజేయును. మాణిక్య స్వరూపమెరుంగని వాడు మాణిక్యము లభించినను దానిని గ్రహించజాలనట్లు చిత్తవృత్తి నిరోధ రూపమగు సమాధి లభించినను పరోక్షజ్ఞానము గలవాడు చిదాత్మ రూప నిశ్చయము గాంచజాలడు. శాస్త్ర గురువచనములచే తెలుసుకొన్న

తత్వమును బుద్ధివలన గ్రహించితినని తలంచుచు విజ్ఞుడగు సోమరియెంత ప్రవీణుడైనను అపరోక్ష జ్ఞానసిద్ధి గాంచజాలడు.

శాస్త్రజ్ఞానము కలవాడైనను సత్పదార్ధ జ్ఞానము లేకపోవుటచేతను, తీవ్రమోక్షేచ్ఛ లభించకపోవుటచేతను. బాలుడు కృత్తికా నక్షత్రరూప మును పెద్దల వలన చూపబడక తాను చూచుచున్నను తెలుసుకొనలేని విధమున ఆత్మాపరోక్ష జ్ఞానసిద్ధి లభించదు కృత్తికా నక్షత్రమును తానెట్లయినను తెలుసుకొనవలెనను తీవ్ర ప్రయత్నము గలిగి యెరిగిన వారినడిగి తెలుసుకొన్న గాని ఆకాశమందుగల అన్ని నక్షత్రములు దోచు చున్నను యా కృత్తికా నక్షత్ర మెరుంగజాలనట్లు ప్రస్తుతాంశమైన పర చితి జ్ఞానస్వరూపమునుగోరు బుద్ధిమంతుడు ప్రథమమున సద్గురుని యను గ్రహమునకు పాత్రుడై బ్రహ్మ విద్యా విచారణచేసి ప్రకృతి పురుష లక్ష ణములను సంపూర్ణముగ విమర్శించి, బుద్ధి, అవ్యక్త తత్వాదులకంటె విలక్షణమగు పరచితి బాంహ్యా దృశ్యకొటియందు లభించునది గాదని నిశ్చయించి చిద్రూపమగు యా పరతత్వము దృశ్యమగు సర్వ జడపదా ర్ధములకు సాక్షియై సర్వము తెలుసుకొనుచున్నవి. లక్షణమగు జ్ఞానచితి యని విశ్చయించి పిమ్మట దేహాదికములగు సర్వదృశ్యములను తెలుసు కొనుచున్న అపరిచ్ఛిన్నమగు దృగ్రూపుడ నేనేయను దృఢాత్మధ్యానము చేయును. అందువలన దేహమే తానను విపరీతజ్ఞానము నశించును. అట్టి చిద్రూపధ్యానాభ్యాసబల మతిశయించగా తాను చిన్మాత్రా కారుడనను సవి కల్ప సమాధి సంభవమగును.

ఈ సమాధియందు ధ్యాత. ధ్యేయమను ద్వైతస్ఫురణము దోచు చుండును. ఈ సవికల్ప సమాధియందు ధ్యానింపబడి ప్రతిబింబితుడగు

తాను బింబరూపాభిముఖు డగుటవలన ఉప్పుగల్లు ఉదక సన్నిధిజేరి ఉదకరూపమును దాల్చు పగిది ప్రతిబింబమగు మనస్సు బింబరూపమగు పరచితియందు లయించుటచే ధ్యేయమగు శుద్ధ చిన్మాత్రాత్మకమైన నిర్వికల్ప సమాధి లభించును. యీ స్థితియే శుద్ధ చిన్మాత్రతత్వాపరోక్ష జ్ఞానమనబడును. సమాధిలేని వ్యవహారకాలమందును, సమాధియందు స్ఫురించిన అసంగ చిద్రూపమగు పరచితి తత్వమును విమర్శించుటచే ఆ శుద్ధ చైతన్యమే తానను దృఢభావన కలుగును. బెస్తలవాడు గాలము వేసినను మీనము తగులని విధమున వేదాధ్యయనాది శాస్త్ర పరిచయముగల విద్వాంసులకు విద్యాహంకారమువలన మూఢప్రాయు లగుటచే నొక విధమగు సమాధి లభించినను, ధ్యానధారణాభ్యాస బలమును నిత్యాపరోక్ష జ్ఞానమును తదేక పరత్వమును లేకపోవుటచే యీ పరచితియగు గాయత్రి అపరోక్ష సాక్షాత్కారమును అందువలన మోక్షమును సంభవించదు.

జాగ్రత్తుర్యాద్యవస్థల మధ్యగల సమాధులు దృశ్యవస్తు వికారము గల అజ్ఞానులకు సఫలములు గావు. ఆ విధముగనే సంకల్పమెరుంగని బాలకులకును, ఉన్మత్తులకును అవిచ్ఛిన్నమగు నిర్వికల్పసమాధియున్నను, అజ్ఞానావస్థ ప్రతిబంధ మతిశయించి యుండుటచే, పరచితి జ్ఞానసిద్ధి యొసగుటలేదు. అజ్ఞానము జ్ఞానముచే దహింపబడినప్పుడు ముక్తి సహజముగ దోచును. నే యవస్థయందైనను, ధ్యానము, ధ్యేయము, ధ్యాతయను త్రిపుటికి నాధారమగు శుద్ధ చైతన్యము తానను జ్ఞానమువలన సంసార కారణమైన మూలాజ్ఞానముగ సమూలముగ నశించును. అనేక జన్మసుకృత పరిపాక విశేషము వలన పరదేవతయగు గాయత్రి యనుగ్రహము లభించి నప్పుడు పురుషుడు శాశ్వితసుఖమును పొందుచున్నాడు.

ప: దేవతా ప్రీతిని కలుగజేయు అశ్వమేధాది యజ్ఞములచే గాని సప్త సంతానాది దానములవలనగాని మరియు ననేక విధములగు తపస్సులవలన గాని, గాయత్రి యనుగ్రహముచేత నిత్యానంద సుఖము లభింపనేరదు. జగత్తుయందు సృజింపబడు స్థావరములకంటె జంగమములు. అందు నరులు శతాంశ మధికమగుచున్నారు. కారణాంతరములచే నరజన్మ లభించినను ప్రమాణానుసారమగు సంస్కారయుక్తము లేకపోవుటచే పశుప్రాయు లగుచున్నారు, వాసనావశముచే మానవ ధర్మమైన ధర్మాధర్మములను పుణ్యపాపముల నెరుంగక పశువులవలె స్వేచ్ఛాచార ప్రవర్తకులై ప్రమాణములను ఆర్యులను ధిక్కరించుచు. ఉన్మత్తులవలె ప్రవర్తించునట్టి యాచారము సంభవించుటయు. అందువలన దుర్భిక్షము లంకురించునట్టి దోషము "రాజా రాష్ట్రకృతం పాపము" ఆర్యవచనానుసారము రాజ్యపాలకులైన రాజులకు సంభవించినను స్వేచ్ఛాచార ప్రవర్తకులగు మానవులకు తిరిగి నరజన్మ లభించుట కడు దుర్లభమైయున్నది. ఆ కార్యమువలన అట్టి మానవులకు జనన మరణ రూపమగు సంసారము మిగుల ప్రియమగుచున్నది.

నేను బ్రాహ్మణుడ ననియు, రాజుననియు, ధనవంతుడ ననియు, విద్వాంసుడ ననియు, అనేక విధములచే దేహాభిమానము అధికమై అజ్ఞానావరణము గలవారికి సద సద్వివేకము సంభవించదు కొందరు శాస్త్రజ్ఞులైననూ దేహాభిమానము గలవారగుటచే ద్వైతభావ మతిశయించి కించజ్ఞులై పరిపూర్ణమగు పరచితి నెరుంగజాలక గాయత్రి సాక్షాత్కార మతి దుర్లభమనియు, మానవుల కసాధ్యమనియు, మరియు అనేకవిధములగు కారణములను కల్పించి సామాన్యుల బుద్ధికి వసూయత కలిగించెదరు.

అహా! నీ మాయాశక్తి మహిమ నేమని వర్ణింపలెను. వేదాధ్య యని సంపన్నులగు విప్రోత్తములు పహితము శాశ్వత సుఖ ప్రదాయక మగు నీ పరతత్త్వ జ్ఞానరహస్య మెరుంగకుండునట్లు అవిద్యావరణ శక్తి యావరించుటచే చేతికి దొరికిన చింతామణిని, గాజుముక్కయని చేజార విడుచునట్లు పురుషార్థ సాధనమైన సర్వోత్తమమగు మానుష జన్మ లభించియు జన్మ సార్థకము గాంచజాలని మాయా మోహితులగు మానవుల యవస్థ నేమని వర్ణించవలెను. ఇట్టి స్థితి మానవులకు సంభవమగు టెట్లనిన యే మానవ జన్మయందుగాని, పరదేవతయగు గాయత్రి నుపాసించుటయందు శ్రద్ధాభక్తులు లేకపోవుటచే వారికి యిటువంటి కుతర్కబుద్ధి సంభవమగుచుండును. యే మానవజన్మ మందైననూ, పరదేవత యగు గాయత్రిని శ్రద్ధాభక్తులతో నుపాసించినవారు మాయను తరించి శాంతి గలవారై స్వరూపానంద మనుభవించెదరు.

బ్రాహ్మణోత్తమా! యే మానవజన్మయందు సత్పురుషుల నాశ్రయించి వారి యనుగ్రహమువలన స్వరూపానందము. భక్త సముద్ధరణ వ్రతము సత్యాన్వేషణము మొదలగు సద్గుణసంపత్తి గలవాడై, అందువలన పరదేవతా అనుగ్రహము నిరంతరాంతరంగ భక్తిగల్గి, శాంతినిబొందును. యీ గాయత్రి యుపాసనమువలన లోకమాత అనుగ్రహము గలవాడగుటచే అస్థిర విషయ భోగవాంఛ లేనివాడై. వైరాగ్యము. గురుసేవయందత్యాదరము గల్గి గురు కటాక్షమువలన ద్వైత జగత్తుయొక్క అస్థిరమును నిశ్చయించి పరోక్షజ్ఞానము గలవాడగును. యీ పరోక్షజ్ఞానము వలన సద్విచారముగల్గి అంతఃకరణ ప్రతిబింబిత జగద్వ్యవహారమెల్ల చిదాత్మయగు గాయత్రి కృతమనియు, దేహేంద్రియాదులు కల్పితమ

నియు తాను చిద్రూపిణియగు గాయత్రి స్వరూపమనియు, భావించి అప రోక్షాద్వైతసిద్ధిని గాంచుచున్నాడు. యిట్టి నిశ్చయ జ్ఞానసంభవమగు స్వరూప జ్ఞానమును తీవ్ర ప్రయత్నమగు ప్రాణాయామాది సాధనములచే చలించక అప్రమత్తుడై యుండువట్లు ధారణచేయుట నిధిధ్యాస మనబడును.

యీ విధమగు తదాకార నిశ్చల సమాధియందు చలించక, సోఽహంభావముచే నిరతిశ యానంద సుఖమనుభవించును. యీశ్వరు నకు మాయయు, జీవునకు మనస్సను అవిద్యయు, నుపాధులగుచున్నవి. ఉపాధిరహితమైనప్పుడు జీవేశ్వరభేద ప్రతీతిగాన్పించదు. యీవిధముగా విచారించబడిన బ్రహ్మ జ్ఞానమువలన బ్రహ్మాపరోక్ష సాక్షాత్కారమునకు కారణమై, మూలా జ్ఞనము సంపూర్ణముగ నశించును. చిత్తము సదానిర్మల చిదాకారముగ నుండునట్లు నిశ్చయించుచుండవలెను, యీనిశ్చయమును మరచి ధ్యానాకారమును పొందుట సవికల్పక సమాధియనంబడును. యీ సమాధి యొక్క అభ్యాసబలమువలన సంకల్ప రూపమగు మనస్సు క్రమముగా వృత్తిరహితమై ధ్యేయాకారమైనప్పుడు నిర్వికల్పక సమాధి యినంబడును. యీ నిర్వికల్పక సమాధియందు అపరోక్షాత్మ జ్ఞాన సాక్షాత్కారాను భవమువలన అజ్ఞానము సంపూర్ణముగ నశించుటకు కారణ మగు చున్నది. వికల్పము లేకుండుటవలన ధ్యానసిద్ధియగును. వికల్ప మనగా ఆత్మధ్యాన సంకల్పము చలించి మరియొక విషయ సంకల్పము దయించుమనోవృత్తి యగుచున్నది,

స్వరూప ధ్యానాకారవృత్తి నెడతెగని ధారణ క్రమముగ నిర్వికల్ప మగును. సంకల్పము లేనియెడల వికల్పముండజాలదు. వికల్పరహిత

మందు నిర్వికల్ప స్వరూపస్థితి స్వయముగ లభించును సంకల్పరహిత మందు చిత్తరువులు లేని పటము నిర్వికారమగునట్లు మనస్సు శుద్ధమై (అనగా సంకల్పరహితమై) నిర్వికల్ప స్థితియందు లయించును. దీనినే ముఖ్యమగు తపస్సనబడును. యీ విషయమై విద్వాంసులు సహితమతి మోహమునొందెదరు. వ్యవసాయాత్మికమగు బుద్ధియోగము గలవార్కి తురీయపదమతి సులభమగును యీ తురీయపదమునకధికారులు త్రివిధ ములుగనుందురు. అందుత్తమ ప్రజ్ఞగల వారనేకొక పర్యాయము శ్రవ ణము చేయుట చేతనే నిస్సంశయమగు తత్వజ్ఞాన నిశ్చయము గలుగును వీరు శ్రవణ కాలమందే మననాది విమర్శనా, జ్ఞాన ప్రభావముగల వార గుటచే శ్రవణ మననాదుల యందతి కౌశలము గలవారై యుందురు.

యీ విషయమై నాయనుభవమును చెప్పెదనాలకింపుము. పూర్వ కాలమున గ్రీష్మఋతు రాత్రియందు పండు వెన్నెలగల పూలతోటలో నిజ భార్య సమేతమై మద్యపాన వివశతచే శయనించి యుండగా ఆకాశ వీధియందు విహరించు సిద్ధగణములు గానము చేయుచున్న అద్వైతమధు రామృతము చెవిసోకినది గాని, విమర్శించ జాలనైతిని తరువాత కొంత సేపటికి మేల్కాంచి యా విషములను విమర్శించి సమాధి నవలంబించి క్షణమాత్రములో యాతురీయపద మాక్రమించితిని మహూర్తకాలమా బ్రహ్మానంద సముద్రమున మునిగియుండిత్ని బహిర్ముఖమై బుద్ధియం దిట్లు విమర్శించితిని.

ఆహా, యిదివరకెప్పుడు నెరుగని పరమానందమును బొందితిని. అట్టి ఆనందము బ్రహ్మేంద్రాదుల యానందమును మీరి యున్నది. నేను యింత కాలము వ్యర్థముగ రాజ్యసుఖముల యందు కాలము గడుపుచు

తన యింటనున్న చింతామణి సమేతమగు పేటిక నెరుంగక, పొట్ట కూటికి తిరిపమడుగు బిచ్చగానివలె అనిత్య సుఖములకాసించి దుఃఖముల పాలగుచుంటిని. గాన బాహ్య సుఖముల నిరసించి మరల యా బ్రహ్మా నంద సుఖమనుభవింప గోరెద.

ఆహార మాల్యాంబర శయన భూషణములను. తరుణీ సంభోగ సుఖములనేక పర్యాయములనేక జన్మలయందనుభవ నీయములైయున్నవి. వాసనా జనితమగు భోగముల నాశ్రయించుట విషప్రాయమగు పాచిన యన్నము భుజించుట వలె, అజ్ఞానమును ప్రతిబంధకము నగుచున్నది. అనర్థకమగు యిట్టి విషయ వాంఛయందు పశుప్రాయులగు మూఢులకు విరక్తికలుగదు.

ఓ బ్రాహ్మణోత్తమా! ఈ విధముగ నాలోచించి యాబ్రహ్మానంద రసాస్వాదనమునకై తిరిగి అంతర్ముఖుడనగుటకు ప్రయత్నించుచుండగా నాకు శుభప్రదమగు మరియొక స్మృతికలిగెను. అదేమనిన, మాయా విలాసమువలన చిత్తమునందీ మోహమెట్లు సంభవించెను. నేను సదా అసంగ చిద్రూపుడనై సర్వత్రా ప్రకాశించుచుందును గదా. నేను చేయ వలసిన సాధనముగాని, సాధించవలసినదిగాని, నాకిన్యముగ లేదుగదా. నేనిదివరకు చేసిన సాధనాంతరము లెల్లను శశశృంగములగు చున్నవి. దేహేంద్రియాది సంఘాతమెల్ల జడములగుటచే. వానితో సంసర్గమేల కుదురును. త్రివిధ సత్య లక్షణములయందును. పారమార్థిక సత్యమే ప్రధానముగదా. దేహేంద్రియాదులవల్ల సంభవమగు సుఖము సత్యము గాకపోవుటయే గాక దుఃఖమును, హానియు, సంభవమగుచున్నది. ఆ

విధముగ యింద్రియ సుఖములవలన సంభవమగు దుఃఖమును పొందు చుండియు, అట్టియు పద్రవ విషయమునే గోరుమనస్సును నిగ్రహించుట యుచితమని ప్రమాణానుసారము నిశ్చయించినను. సర్వభూతాంతఃక్కరణలయందు ప్రతిబింబిత మనస్సులెల్లను నావియేకదా. ఈదేహమందుగల మనస్సు నిరోధింపబడినను నిరోధింపబడని మనస్సులనంతమైయుండును గదాయనుచున్న జనకచక్రవర్తికి బ్రాహ్మణుండిట్లనియె.

రాజా, నీమనస్సు నిగ్రహింపబడినయడల యితర మనస్సులవలన మీకేమి ప్రతిబంధకమగునని అడుగగా. జనకుడిట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా. అసంగచిద్రూపుడనగు నేను సర్వవ్యాపకుడనగుటచే, సర్వ భూతాంతఃక్కరణలయందు ప్రతిఫలించియున్న మనోరూపములెల్లను నాయాశ్రయములేయగును. గాన అన్ని మనస్సులు నిరోధింపబడినను, లేక స్వభావ ప్రచారములోనున్నను. ఆకాశముకంటె మిక్కిలి వ్యాపకముగల చిద్రూపాత్మనగు నాకు సంకల్ప వికల్పాదులు సంభవింపనేరవు. అందువలన సంకల్ప వికల్పాదులుగల మనః ప్రచారమువలన నాకెట్టి యుపకారముగాని ప్రతిబంధముగాని లేదని చెప్పగా. యాబ్రాహ్మణుడు.

అయ్యా ఇంత విశాలమగు మహాకాశముకంటే అతి సూక్ష్మమగు చిదాత్మ ఎట్లు గొప్పదగునవియడిగెను.

ఓ ముని పుత్రా యింతగొప్పదగు మహాకాశము బహుస్వల్పమగు అద్దమునందిమిడియున్న విధమున, మహాకాశమునకంటె మిగుల వ్యాప

కమగుటచే నాయాకాశమును ప్రకాశింపజేయు చిదాత్మ ఆకాశముకంటె మిక్కిలి వ్యాపకమైనదనుటకు సందియమేమి. ఆకాశముకంటె మిక్కిలి వ్యాపకమైనదనుటకు సంధియమేమి ఆకాశముకంటె మీగుల వ్యాపకిమై అసంగ చిద్రూపముచే సర్వత్రా ప్రకాశించు నాకు చిత్తయికాగ్రతా రూపమగు సమాధి ఎట్లు సంభవమగును అనంత శరీరధారినైన నేను. స్వప్రకాశాత్మకమగునే కాకృతిని వదలకయే సర్వత్ర సర్వదా ఆనంద రూపుడనగుచున్నాను. నాయాభాసవలన భాసించు మహాసంభవములగు సర్వదేహక్రియా కలాపములకెల్ల సాక్షినై ప్రకాశించుచుండెదను. అందు వలన నాసాన్నిధ్యబలమువలన నాయా భూత సంభవములగు వ్యవహార ములు నన్నంటనేరవు. గాన జగత్తునందుగల సర్వభూతాంతఃకరణ జనితవ్యవహారములు. జరుగుటయందును జరుగకపోవుటయందును నా కెట్టి కర్తవ్యమును లేదు.

సమాధి యున్నను లేకయున్నను అఖండానందాద్వయ చిద్రూపుడ నగు నాకు విరోధించుటగాని, యనుసరించుటగాని సంభవించదు ప్రాకృత నిర్మితమగు దేహమెట్లు ప్రవర్తించినను అసంగచిద్రూపుడనగు నాకెప్పుడు ఆనందము స్వభావమేయగు చున్నది. స్వప్రకాశ రూపుడనగు నాకు ఆవరణ ప్రతిబంధమెప్పుడును సంభవించకపోవుటచే, సర్వవ్యాపకుడనగు చున్నాను. అసురసంపత్తిగల అధమాధికారులకు విజ్ఞాన సంపత్తియు సద్విచారము లేకపోవుటచే. జన్మసంబంధములు సంభవించుచుండును. మధ్యమాధికారులకు శ్రవణమనననిధి ధ్యానలు క్రమముగ సంభవించి నప్పుడు జ్ఞానోదయమగును. వీరికి విజ్ఞానసహితమగు నిర్వికల్పకసమాధి అంత సులభముగ లభించదు. గ్రామాంతర ప్రయాణము. శీఘ్రగమనము నందు చేయునప్పుడు మార్గమధ్యమందు గల స్వరూపములు నిర్ణయింప

జాలనట్లు వికల్పరహితమగు శుద్ధ జ్ఞానము సర్వదా భాసించుచున్నను. జ్ఞానజ్ఞేయాది వ్యవహార కలాపదోషమువలన జ్ఞాతయగు చిద్రూపము నిర్ణయింపజాలకున్నను జ్ఞేయ వికల్పములను నిరశించినప్పుడు జ్ఞానమాత్రమై యుండును. దృశ్యమగు సర్వవిషయములను నిరశింపగా. కేవలజ్ఞానము మిగులును. అట్టి నిర్విశేషజ్ఞానము మానవులకుత్తమ పురుషార్థము నివ్వ దగియుండుటచే. దీనిని అద్వైతమత సిద్ధాంతమని నిర్ణయింపబడినది. ఈ విషయములను శ్రవణ మననాదులొనర్చి శాంతిచే కృతార్థుడవగుమని తెలిపిన జనకునియుపదేశమును విని అష్టావక్రముని సంతసించియాజనకుని వలన సత్కరింపబడి. స్వస్థానమునకు బోయి సాదరముగ విమర్శించి సర్వసందేహములను వదలి శీఘ్రకాలములో జీవన్ముక్తుడయ్యెను.

పదునేడవ అధ్యాయము

సంపూర్ణము.

---

# పదునెనిమిదవ అధ్యాయము

ఓ పరశురామా! జనకచక్రవర్తి అష్టావక్రమునికి తెలియపరచిన పరమ పురుషార్థసాధకమగు బ్రహ్మవిద్యారహస్యము, సర్వసామాన్యముగ వేద్యమగునదిగాదు. దృగ్రూపమును తెలుసుకొనుటకు మరియొక దృగ్రూపములేని సంవిత్తును జనక చక్రవర్తి ఉపాయములచే బోధించెను గాని మాయామోహితులగు అజ్ఞానులీ రహస్యమును తెలుసుకొనజాలరు. యాసంవిత్ జ్ఞానసంపత్తి చిత్తనిరోధముగలిగి అంతర్లక్ష్యముచే మననము జేయుయోగులకు మాత్రము శుద్ధబుద్ధి యందు స్ఫురించగలదు. దృశ్య కోటియందు వేద్యముగాని సంవిత్తు లక్షణమును పదునైదవ అధ్యాయ మందు వివియు దీని లక్షణమభేద్యమనియు తెలియుటలేదని నీవడగా అష్టావక్ర జనకసంవాదము వివరముగా జెప్పితిని గాని, నీ సంశయము తీరినట్లు తోచుటలేదు. శ్రవణాభిలాషగల వాడవగుటచే నీ శ్రద్ధకు ఆనందించి, చిత్తశాంతి కొరకు మరల సంగ్రహముగా జెప్పెదనాలకించుమని దత్తాత్రేయులు చెప్పుచున్నారు.

పరశురామా, సర్వజగద్విలాసము జాగ్రదావస్థయందు మనస్సు వలన ప్రకాశించుచుండును గాని, సుషుప్త్యావస్థయందు సర్వము శూన్యమగుచున్నది. సాధనములు లేకనే కార్యము సాధింపజాలనియట్లు సర్వ సాధనమగు మనస్సును తెలియదాగిన మరియొక సాధనము సృష్టియందు గాన్పించదు. అందువలన మనస్సు మరియొక దానిచే తెలియబడదు. నొకవేళ సంకల్పదశయందు మనస్సు తెలియబడునని దలచినను మన స్సొక సంకల్పమునుండి మరియొక సంకల్పము చేయునప్పుడు మధ్య

కాలము నిర్వ్యాపారమైయుండుటచే, వృత్తి తెలియబడునుగాని స్వరూపము తెలియబడదని గ్రహింపుము. సంకల్పరహిత కాలమునందు మనసు సంవిద్రూపమైయుండునని చెప్పగా, పరశురాముడు అయ్యా మీరుచెప్పిన విషయము సత్యమైనను నాకుగల సందేహమును దయతో నివారింపవేడెదను. అవేద్యమగు తత్వమేవిధముగను తెలియబడునదిగాదు. యాతత్వమెరుగక పురుషార్థమగు మోక్షమెట్లు సంభవించునో దెలుపుమనగా.

దత్తాత్రేయులు ఓ పరశురామా! సావధానముగా వినుము. సంవిత్తి ఉపలబ్ధి (అనుభవము) చిత్తు. ఆత్మ. యనునవి పర్యాయ వాచకములగుచున్నవి. స్వప్రకాశమగు సంవిత్తు సదా ప్రకాశించుచుండును. అన్యాపేక్ష లేక స్వయముగ ప్రకాశించుటానికి స్వప్రకాశమనబడును. తత్పదవాచ్యార్థమైన ఘటపటాదులు చూచునప్పుడు త్వంపద లక్ష్యార్థము గోచరించుచుండునుగదా. తత్పదవాచ్యార్థమైన అన్యపదార్థములు, తత్పదలక్ష్యార్థమైన నీవు లేనియెడల నెవరికి గోచరించగలవు. జ్ఞేయవిషయములు సత్యమగునుగాని, జ్ఞానరూపమగు జ్ఞాత లేదనుట ప్రమత్తతయనబడును. నేనుగలనో లేనో యను సంశయాత్మికమగుమనస్సుగల వానికెట్లు చెప్పగలము. తనను తాను తెలియని) యున్మత్తునకు ఆత్మజ్ఞానము బోధించుటయెట్లనగా, పరశురాముడు అయ్యా నేను లేనునిగాని నన్ను నేనెరుగననిగాని చెప్పుటలేదు. క్షరమగు దేహమే నేనని దలంచుచున్న నేను, అక్షరపురుషునిగా నెరిగింప గోరెదననగా దత్తాత్రేయులు. ఓ రామా నీవు సామాన్యమగు క్షరరూపమని దలచినను లేక అక్షరరూపుడని దలచినను క్షరాక్షర తత్వములు రెండును. నిత్యమగు సంవిత్తే ప్రకాశములైయున్నవి. అనాది వాసనా సహితమగు క్షరపురుష జ్ఞానమనిత్యమగుటచే, కల్పితముగాని, స్వస్వ

రూపముగాదు. ద్రష్ట, దర్శన, దృశ్య, వ్యవహారమునకు సంవిద్రూప మగు జ్ఞానమే ప్రధానమని దెలుపుచున్నను. దేహభ్రాంతి విడువలేక యున్నావు.

ఘటపటాది ఇంద్రియ జన్య జ్ఞానమును, విశేషాకారముగల సంకల్ప జ్ఞానమును, వృత్తిరహితమగు ప్రజ్ఞానమును, వీనియభావమును, సర్వసాక్షివై చూచు ప్రజ్ఞానఘనుడవేనీవు. స్వయంప్రకాశమానమగు చిదాత్మస్వరూపుడవని చెప్పిన దత్తాత్రేయ వచనములు భార్గవుడు విని తాము శలవిచ్చినట్లు నాకు దేహేంద్రియాది సంఘాతమునందు నేనను స్ఫూర్తి మిక్కుటమైయుండుటచే, చిదాత్మ జ్ఞానస్ఫూర్తి కలుగుటలేదు గాన అట్టి అజ్ఞానము నివారించదగిన యుపాయము నుపదేశింపుమనగా దత్తాత్రేయులు చెప్పుచున్నారు.

భౌతిక రూపమైన శరీరాదులయందు తానను అభిమానము అనాది సంభవమగు అజ్ఞాన జన్మభావనా విశేషముచే, చిత్తమునందు ప్రారబ్ధమై నిలచియుండుటచే. ఆ విధముగ స్ఫురించుచుండును. గాని అదిసత్యము గాదు. నీవు నిశ్చల బుద్ధిచే నాలోచింపుము. సంకల్పము చేయునప్పుడు దేహముకంటె అన్యమగు ఘటపటాది వస్తువులయందు దేహాత్వ భ్రాంతి గావి, అది నీవను బుద్ధిగావి, నీకు కలుగునేమో చెప్పుము. నీవు ద్రష్టవై చూడబడునది దృశ్యమగుటచె, చూడబడుదానికంటె చూచువాడు విలక్షణుడగుచున్నాడు. గావున నీచే చూడబడు ఘటాదికము నీవెట్లగుదువో విచారించి చెప్పుము. నీవొకవేళ దేహరూపుడవని తలచినయడల నీచే చూడబడు దృశ్యవస్తువు ద్రష్ట యెట్లగును. రూపనామాదికమెల్లను దృశ్యమే గదా.

రూపనామ ఘటాదికమెల్లను చూచునది ఈ దేహమేయందు నేని భార్గవా, ఇంకొకసారి అంతర్దృష్టితో నాలోచింపుము. దృశ్యమగు ఘటాదికము నీ దేహము కాదుగదా. అట్లే, నీకు దృశ్యమగు దేహాదికము మాత్రము దృగ్రూపుడవగు నీవెట్లగుదువో చెప్పుమనగా. భార్గవుడు నా దేహము ఘటాదికమువలె నాకన్యమైననూ. చిదాత్మ సంబంధమనాదియగుటచే. నాదని తోచుచున్నదనగా. దత్తాత్రేయులు భాష్యము. ఘటాదికమందును. భాసకమగు చిత్తు సంబంధించియేయున్నది. గావున నా ఘటాదికము సహితము నీదేహమే కావచ్చును. అట్లయినయడల దేహము మాత్రమే నీవు గాక, నీకు దృశ్యమగు విషయములెల్లను నీవేయని చెప్పవలసియుండును.

అహం ప్రత్యయమువలన చిదాత్మ కుపాధియగు దేహము నేనని భావింపవచ్చును గాని ఘటాదికము చిదాత్మ కుపాధికానందున దేహమందువలె ఘటమందు నేనను బుద్ధికలుగుట యనిష్టమగు నందువేని యిది ఘటమని తెలుసుకున్న జ్ఞానముకూడ అహం ప్రత్యయము గలదగుచుటచే, అజ్ఞానమున కుపాధియగు ఘటాదికము సహితము నీదేహ మనవలసియుండును. ఇట్టిదోషము లుండుటవలన సూక్ష్మ దేహమగు మనస్సును దానివలన సంభవమగు సంకల్పమును చూచునట్టి దృష్టవగుటచే అహంకారాది దేహాంతమువరకుగల ఇరువదినాల్గు తత్వములకును వాని యవస్థలకును సాక్షివైన దృగ్రూపుడవుగాని మరియొక దానికి దృశ్యమగు వాడవుగావు.

దృక్కునకు దృశ్యలక్షణముండదు. దేశకాల దేహాదికములను భావింపచేయు దృక్కు నిర్వికారమెట్లగు నంటివేని భాస్యమగు దేహాదిక

ములకు భేదమున్నను వానిని భాసింపజేయు నిరాధారమగు చైతన్యము నేకమై నిర్వికార మగుననియు సంకల్ప రహితమగు శుద్ధ చైతన్యమే నీవనియు భావింపుము. ఇట్టి నిశ్చయజ్ఞానము కల్గినయడల దేహాదికము నందు నీవను భ్రాంతిలేక, యభిమానమునకు కారణమగు అజ్ఞానము నశించును.

అజ్ఞానావరణము నశించిన వెనుక మోక్షమెట్లు సంభవించునని దల చితివేని ఓ రామా! మోక్ష మాకాశమందుగాని, పాతాళమందుగాని మరి యొక లోకమందుగాని, సంభవించునది గాదు. సంకల్ప రహితమగు శుద్ధ చిన్మాత్ర నిరాదర్ణ ప్రకాశమే మోక్షమనబడును. ఉపాధి సంబంధమగు సవిశేష జ్ఞానమువలన, బంధమనియు. ఉపాధి వికారరహిత, నిర్విశేష జ్ఞాన ప్రకాశమువలన మోక్షమనియు, ఆర్యవచనమువలన తెలియబడు చున్నది గాని, అన్య పదార్థములవలె లభించునదికాదు. దేహభ్రాంతి రహితమగు స్వరూప జ్ఞానసిద్ధియే మోక్షమగును. స్వరూప జ్ఞానముకంటె నన్యముగ మోక్షము కలదని దలచితివేని సదా నిత్యమగు చితికంటె అన్య మగు దృశ్య ప్రపంచమెల్ల అనిత్యమైన దగుటచే, దృగ్రూప చితిజ్ఞానమే మోక్షమనబడును.

బంధరహితమే మోక్షమగును. చిత్తమను ఉపాధివలన. చిదాత్మకు బంధము నారోపిత మగుచుండుమగాని, యదార్థముగనుండజాలదు. కల్పిత జగత్తునందు రూపనామములుగల సర్వభూతములకు అభావము సంభ వించును గాని. సర్వభూతోత్పత్తికి నాధారమగు పరచితి కెప్పుడును అభా వము సంభవించనేరదు గాన సత్పదార్థమైన చిదాత్మజ్ఞానమే మోక్ష మన బడును దర్పణ ప్రతిబింబమునకు దర్పణముకంటె నాధారమగు సత్తాన్య

ముగ లేనివిధమున చిద్దర్పణమందు ప్రతిఫలించు జగత్తునకు చిత్సత్తా కంటె అన్యమగు మరియొక సత్తా గాన్పించదు. గాన, స్వసత్తా మాత్రమై వది చితికంటె అన్యమైవది మరియొకటి సృష్టియందు లేదని స్పష్టమగు చున్నదనగా పరశురాముడు,—

అయ్యా, చితి సర్వకాలా బాధ్యమైనదైన యెడల, మోక్షము సంభ వించిన కాలమందు మాత్రము స్ఫురించుటకు కారణమేమనగా.

దత్తాత్రేయులు, రామా! సర్వదా నావరించియుండు ప్రకాశము, చూచినప్పుడు మాత్రము గాన్పించి, మరియొక ధ్యానయందున్నప్పుడు గాన్పించని విధమున, సంకల్పాదులచే, కార్యకార్యకర్తృత్వమునారోపించు చున్న మనస్సు యందు లక్ష్యముంచి జగదాకారా జ్ఞానమందు దోచక, నిర్విశేష జ్ఞానప్రకాశమందు మాత్రము, స్వస్వరూపజ్ఞానముచే, మోక్షము స్ఫురించుచుండును, సర్వవ్యాపకమగు చిత్తునకు, అంతఃకరణ సంభవ మగు పరిచ్ఛేదము భ్రాంతిచే, నారోపితమగుచున్నది, ఆకాశాదిసర్వభూత ములు చితిసంభవములగుటచే సర్వవ్యాపకమగు చిత్తునకు పరిచ్ఛేదకములు కాజాలవు. జగత్తునందు చిత్ప్రకాశమైన రూపముగలదనియు, ప్రకాశింప బడనిది, లేనిదనియు చెప్పబడును. దీప ప్రకాశమునందు ప్రకాశించు వస్తువులు వెలుతురునందిమిడి యున్నట్లు, చితిజ్ఞాన ప్రకాశమగు సర్వ జగత్తు, చిత్తునందిమిడి యుండును. అంతఃకరణ రూపమైన చిత్తము చితిచే ప్రకాశించుచుండును గాన, చిత్తునందిమిడి యుండును.

ఓ రామా! గగనాంతర్గతములగు సముద్రనగర, పర్వతాదులు, ఆకాశమును విభాగించజాలని విధమున, చిత్ప్రకాశకములగు దిక్కాలాది సర్వప్రపంచము చిత్పరిచ్ఛేతము కాజాలవు. చిత్ప్రతిబింబిత, జగత్తెల్ల

భ్రాంతి మూలమగు మనసేంద్రియములకు సత్యముగ దోచుచుండును గాని, ఆభాస మాత్రమగుటచే శూన్యమైనదగును. రజ్జునందు సర్పభ్రాంతి మనసేంద్రియములకు దోచు విధమున మాయాకల్పిత, దేహభ్రాంతివలన, సత్పదార్థమైన చితియందు అసత్పదార్థమగు జగత్తు సత్యముగ దోచుచుం డుట మనసేంద్రియములకు సహజమై యున్నది. గాన సర్వజగత్ప్రకా శమునకు కారణమగు చిత్తు స్వయంప్రకాశమై సదాప్రకాశించుచుండునని చెప్పగా, భార్గవుడు.

అయ్యా మీ వాక్యములవలన నా సందేహమును వర్తించుట లేదు. గాన నాయందు పరిపూర్ణ కటాక్షముంచి నా సందేహములు నివారింపవేడు చున్నాను. సూర్యకాంతివలన ప్రకాశించు జగత్తెల్ల యాసూర్యునికంటె వేరైనట్లు చిత్తుచే భాసించు చిత్తము. చితికంటె వేరగునట్టి అనుభవవిరుద్ధ ముగ చిత్తము. చిదాత్మకమని శలవిచ్చితిరి చిత్తము. జడమును చిత్తు సత్పదార్థమునగును, చిత్తు స్వయంప్రకాశమై చిత్తమును ప్రకాశింపజేయు చున్నను. చిత్ప్రకాశమగు చిత్తము చితి కన్యమగును, సంకల్పరహిత మగు మనస్సు నిర్వికల్పమైన చిదాకారమగుటచే బంధరహితమగుననియు అట్టి నిర్వికల్ప జ్ఞానమే పరచితి స్వరూపమనియు జనక చక్రవర్తి చెప్పి నట్లు తాము సెలవిచ్చితిరి. అదెట్లు నిశ్చయింపదగును. చిత్తు ఘటాదివస్తు వులను తెలుసుకొనుటకు మనస్సు సాధనమని చెప్పబడెను.

మనస్సను సాధనములేక చిత్తు విషయగ్రహణము చేయజాలని యెడల చితి యొక జడపదార్థమగును. బాంహ్యదృష్టియందు విషయ గ్రహణమునకును అంతర్లక్ష్యమందు చిత్ప్రకాశమునకును మనస్సే కారణ మని చెప్పితిరి. అట్లే బంధమోక్షములు మనోసంభవములని స్మృతులు

చెప్పుచున్నవి. సంకల్పము బంధమనియు, నిస్సంకల్పము మోక్షమనియు తెలుపబడి యుండుటచే సద్రూపమగు చితి సర్వదా ప్రకాశించుచుండగా ప్రతిబింబమగు మనస్సు లయించుటెట్లు? మనోలయము సంభవించక మోక్షసిద్ధి లభించదు గదా. దృశ్యమెల్ల చితియం దైక్యమగునని తలచి నను ద్వైతరూపమగు మనస్సు ప్రకాశించుచున్నంతవరకు అద్వైతసిద్ధి ఎట్లు లభించగలదు. జాగ్రత్ప్రపంచ వ్యవహారమెల్లను సర్వదా సత్య ముగ దోచుచుండగా, స్వప్న ప్రపంచమువలె అసత్యమెట్లగును. స్వప్న ప్రపంచమునందలి విషయములు తనకు మాత్రము దోచుచు ఇతరులకెవ్వ రికిని దోచకుండుటచే కల్పితమని నమ్మదగియుండును. జాగ్రత్ప్రపంచ మునందు దోచు విషయాదులు తనకేగాక సర్వత్రా అనుభవ యోగ్యము లగుచున్నవి. దృశ్య ప్రపంచజ్ఞానమెల్లను మిధ్య అయినయడల సత్యా సత్యాన్వేషమెచ్చట నిశ్చయింపవలెను. మానవులయం దొకరైనను సత్య జ్ఞానము భాసించక సర్వత్రా నొక్క విధముగ భ్రాంతి దోచుటెట్లు ఇట్టి సంశయములనెల్ల దయతో నివారింప వేడుచున్నాననగా దత్తాత్రేయులు.

ఓ రామా! నీకిప్పుడు సందేహము లమోఘములు ఇప్పటికి నీకిట్టి విమర్శ కలిగినందుల కెంతయు సంతసించితిని. ఈ సందేహములు నివారించదగిన వాక్యము లిదివరకే చెప్పియుంటిని. గాని, చెప్పవలసిన తరుణ మిదియని తలచెద. విజ్ఞాన సంపత్తి కలుగనంతవరకు సంభవ ములగు సందేహములను నివారించుకొనుటకు ప్రశ్న జేయుదు బుద్ధి మంతుల కుచితమగును. అట్లు ప్రశ్న చేయనియడల గురువెంత ప్రజ్ఞ గలవాడైనను సందేహముల నివారింపజాలడు.

నిర్విశేష జ్ఞానోదయము కానంతవరకిట్టి కుతర్కములు మనస్సు వలన సంభవమగుచుండును, దానికి కారణము ద్రష్ట, దర్శన, దృశ్యాది భేద బుద్ధియందు కర్తవ్యము కలిగియుండుట యగును. స్వరూప జ్ఞాన సాధనమగు గుర్వనుగ్రహముకొరకు త్రివిధ సంస్కారములచే సేవించ వలసి యున్నది. భ॥4. అ 34 శ్లోకార్థము ననుసరించి ప్రథమమున సాష్టాంగ నమస్కారముచేతను, తర్వాత సమయానుకూలముగ ప్రశ్న వేయుటచేతను, గురువున కభిమతమగు సేవ చేతను, గుర్వనుగ్రహించి బంధముక్తి గావించును గాన, నీవు బుద్ధిమాంద్యముచే, చెప్పిన విషయమై నను తెలుసుకొనజాలక తిరిగి అడిగినందులకు సంతసించెద. గాన, ఓ రామా! ఇప్పుడైనను సావధానముగ నాలకింపుము.

దర్పణమొక్కటియైనను అందు ప్రతిఫలించిన రూపముల ననుస రించి అనేకముగ దోచుచున్నట్లును. మనస్సొక్కటియైనను స్వప్నావస్థ యందు చిత్సాన్నిధ్యవశమున బహురూపములు భాసించునట్లును. ఏకా కారమగు చిత్తు జగద్భానమందు పలువిధములుగ దోచినను చిత్తేకరూపమే యగుచున్నది. దర్పణమందు ప్రతిఫలించిన ప్రతిబింబమునకు బింబాపేక్ష యున్నట్లు చితికి మరియొక బింబాపేక్ష లేకయే చిత్తమునందు ప్రతిఫలించు చుండును అందువలన చిత్తమునకు, దర్పణమునకు, సాదృశ్యము తగదం దువేని దృష్టాంతమునందిట్టి భేదముండుటవలన స్వప్నావస్థయందలి మనో విలాసమను రెండవ దృష్టాంతము చెప్పబడెను.

స్వప్నావస్థయందు చిత్తు, చిత్తమని వాచ్యార్థములచే రెండున్నట్లు భాసించినను, లక్ష్యార్థమందు నేకమైనట్లు జాగ్రద్దశయందు తోచునట్టి ద్వైతరూపమగు మనోవిలాసము మిథ్యయగును. ఏ వస్తువు లేక ఏ

రూపము భాసింపదో, ఆ రూపములెల్ల నావస్తువేయగును. కావున చిత్ప్రకాశము లేక ఏ వస్తువను ప్రకాశించవందున జగత్తంతయు చిద్రూపమన బడును. ప్రతిబింబములెల్లను దర్పణాత్మకిమైనట్లు చిత్ప్రకాశము లేవి జగత్తు స్వయముగ ప్రకాశించనందున జగత్తు చిద్రూపమనుటకు సందియము లేదు. జగదాధారమగు మనస్సు జడమై దృశ్య జ్ఞానము లేనిదగుటచేతను, చిత్ప్రకాశము లేక స్ఫురణశక్తి లేనిదగుటచేతను, చిత్తుకంటె మనస్సవ్యము కానేరదు.

స్వప్నమందు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు మూడును చిదాత్మకములగుటచే మనోసత్తా చిత్తుకంటే వేరు గావటుల జాగ్రదావస్థయందును జ్ఞాతృ జ్ఞానాదులు చిత్ప్రకాశ జ్ఞానమువలన మనస్సుకు దోచుచున్నను చితికవ్యముగాదు. స్వప్నమందు ఇంద్రియ సహాయము లేకయే. సర్వ కార్య నిర్వాహమునకై మనస్సు ప్రయత్నించునట్లు, జాగ్రద్దశయందును ఇంద్రియ సహితముగ యామనస్సు సర్వకార్య సాధనమగుచుండును. స్వప్నావస్థయందు దోచుచెట్టును దానిని గొడ్డలితో నరుకుటకు ప్రయత్నించుటయును. మనస్సునకు సత్యముగ తోచినను ప్రబోధ సమయమున సర్వముశూన్యమగును. ఆ విధముగ జాగ్రస్వప్నాద్యవస్థలయందు కల్పనా కార్యములకు కారణమగు మనస్సు, చితిసత్తా కల్పితమై అసత్యమగుటచే, నాయాదశలయందు మనోకల్పిత కార్యములెల్ల నసత్యములగుచున్నవి. అందువల్ల చితికార్యములకు మనస్సు కారణమైనట్లు అజ్ఞాన దృష్టియందు దోచునుగాని యదార్థముగ విచారించిన యుకల సాక్షాత్పాధవముగాదు.

మరే మన చిదాత్మయే సర్వ స్వాతంత్ర్య మహిమవలన అంతఃకరణయందు ప్రతిఫలించి మనోరూపశక్తి గలదై దృష్ట దర్శనాదీ

భేద వ్యవహారము కల్పించదు. అజ్ఞాన దృష్టియందు మనసు యందారో పించుచుండును. ఈ రీతి కార్యములెల్లను జాగ్ర స్వప్నాదులయందు సవికల్పముగ దోచుచుండినను అవస్థల సందికాలమందు నిర్వికల్పమై భాసించుచుండును. పరిపూర్ణత్వ నిర్వికారత్వాది ధర్మములు ఆకాశ చిదాత్మలయందు సమానమైనను చిదాత్మ స్వప్రకాశమగును ఆకాశము చిత్ప్రకాశమువలన ప్రకాశించునది గావున చితికి ఆకాశమునకు భేదము చెప్పబడియున్నది

చిదాత్మ లక్షణములైన సర్వవ్యాపకత్వము సర్వైక్యము. నిరవయవత్వము. ఆద్యంతరహితము. సర్వాధారము శుద్ధమువను లక్షణములు ఆకాశమునందు కలిగియున్నను. స్వప్రకాశము లేకపోవుటచే భేదము చెప్పదగియున్నది. గాన యాచైతన్యాత్మ స్వప్రకాశము వలన ఆకాశాది పంచభూతములు సృష్టికి యోగ్యములై ప్రకాశించును. గుడ్లగూబకు సూర్యకాంతి చీకటిగ దోచునట్లు, అజ్ఞులు భ్రాంతిచేదహరాకాశమును పాసించెదరు. పరచితియగు గాయత్రి స్వప్నమందు తాననేకవిధ ప్రపంచ రూపముగ మారుచు. స్వాతంత్ర్యమువలన పరిమితి గలదై భాసించుచుండును. నరమృగాది రూపనామావర్ణముచే పరిమితిగలదై దోచినను స్వస్వరూపముచే పరిపూర్ణమేయగును.

ఇంద్రజాలకుడు కౌస్యకలాపమువలన చూచువారలకు బహువిధ భిన్నరూపములు దోచినను. స్వదృష్టియందు తానొక్కడైన విధమున యా పరచితి మాయావిజృంభణమువలన బహుళముగ భాసించుచున్నను స్వదృష్టియందు పరిపూర్ణాద్వైత స్వరూపిణియగును. రూపనామ ప్రపంచమందుగల జడపదార్థములను ప్రకాశింపజేయుటకు గాను చిద్రూపముచే

పరిచ్ఛేదముగల దానివలె భాసించుచుండును. ఇంద్రజాలకుడు పరిచితియు అతి దుర్ఘట కార్యములు సృజించుటయందు మిగుల స్వాతంత్ర్యముకల్గి యున్నను, నీ యుభయులకు మాయావర్ణ విలాసము స్వదృష్టియందుం డదు. గాని, బాంహ్యా దృష్టియందు అవర్ణమున్నట్లు దోచుచుండును.

బాంహ్యాదృష్టియందు కలిగిన అభిమానావర్ణమునకుఅవిద్యయనియు అపూర్ణఖ్యాతియనియు, నామాంతరములు గలవు. రూపనామాదికములగు సర్వభూతములు స్వప్రకాశము లేనివగుటచే, జడములగుచున్నవి. స్వసత్తామాత్రమైనది పరచితియగుచున్నది. మానవులకు జడశరీరముల యందు గల్గు స్ఫూర్తికి యిదంతయనియు. చిత్తమందుగలిగెడు స్ఫూర్తికి అహంతయనియు దలచెదరు. అహంకార భావము ఏకశరీరమందు గల కారణశరీరస్ఫురణ కలిగినది యగును. చితి ఆకాశమువలె సర్వవ్యాపక మైనదగుటచే, సర్వత్రా నహంభావముచే భాసించుచుండును.

ఈ విధముగ సర్వవ్యాపకమగు చిదాత్మ జ్ఞానములేని దేహాభి మానముగల విద్వాంసులు శాస్త్ర తర్కము చేయుచు. స్వరూప జ్ఞాన శూన్యులై జన్మదుఃఖము ననుభవించెదరు. సమిష్టి రూపమగు సర్వవ్యాప కత్వముచే జగద్రూపమైన చిద్రూపజ్ఞాన మందుగల స్ఫూర్తికి పరాహంత యనదగియున్నది. ఇట్టి యఖండరూపక చైతన్య సంభవమగు స్వతంత్ర మాయాశక్తి కల్పిత పరిచ్ఛేదము వాస్తవము కాదని నిశ్చయించుటయే, సర్వ వ్యాపకత్వ మగును. సర్వవ్యాపకమగు చిధాత్మను నిర్విశేష జ్ఞాన ముచే విమర్శింపలేక కుతర్కములు చెయుచు, చిదాత్మ సర్వవ్యాపకమైన దైవయడఁ యేల కనబడదనియు, సర్వత్రా శాశ్వతముగ దోచు జగత్తు శూన్యమెట్లగుననియు, దుర్వాదములు జేయుచు భ్రష్టులగుదురు. రాజ

గుహ్యమగు నీ పరతత్వము శ్రవణ మననాదులొనర్చినను నిధిధ్యాసము లేనియడల నిశ్చలజ్ఞానము లభించదు.

గావున ఓ రామా! నేను చెప్పిన నిర్విశేష జ్ఞానమును అంతర్దృష్టిచే నిధిధ్యాసము చేయుము. చిద్రూపిణియగు గాయత్రి సర్వ వ్యాపకిమై సర్వానుస్యూతమగుటచే జడమగు సర్వ జగత్తునుండి వేరుచేసి గ్రహింప దగియున్నది. అట్లు చేసినయడల చిదాత్మ విశ్రాంతినొందిన పరాహంత యగును. స్వయం ప్రకాశకమగు చిత్ప్రకాశమునకే పరాహంతయని పేరు. పరిపూర్ణ స్వరూపిణియగు చిత్తు సర్వత్రా ప్రకాశించుచుండుటచే అవర్ణ పరిచ్ఛేదములు సంభవించనేరవు. సర్వత్రా స్వయం స్ఫురణ జ్ఞానమునకే పూర్ణాహంతయనియు స్వాత్మ విశ్రాంతియనియు చెప్పబడును. ఈ రెండు నామములు అఖండైక చిన్మాత్రమగును గాన. ద్వైత భ్రాంతికవకాశము లేదు.

అంతఃకరణ ప్రతిబింబిత. చైతన్యరూపమగు మనోవికారములు ద్వైతరూపముగ నొకవేళ భాసించుచున్నను, సర్వాంతఃకరణ వృత్తులకు సాక్షియైన చిద్రూపుడవగు నీకెట్టి ప్రతిబంధము నుండజాలదు. అధమాధికారులగు ముముక్షువుల కర్తవ్యమునందు పాసనావిధి ననుసరించి చిత్త వృత్తుల నియమించినగాని వృత్తిరహితమగు స్వస్వరూపము తెలియబడదని దెలుపబడి యున్నది గాని ఉత్తమాధికారులకట్టి కర్తవ్యముతో గూడిన మనోనిగ్రహమను ఉపాసనాది విధి తెలుపబడి యుండలేదు.

మరేమన, ఉత్తమాధికారి, అంతకరణ ప్రతిబింబమున కాధారమగు బింబరూపమైన చిత్స్వరూపుడవను నిశ్చయజ్ఞానముచే, అంతఃకరణ రూపమగు మనోవృత్తులవలన, దనకెట్టి అపకారముగాని, ఉపకారముగాని

ప్రతిబంధముగాని లేని అసంగ చిద్రూపుడనను, నిర్విశేష జ్ఞానసిద్ధి లభించినవాడగుటవలన, మనస్సుగాని, మనోవృత్తులను గాని, నియమించవలసినకర్తవ్యములేని నిర్వికారుడై యుండును. అందువలన విసనకర్రతో తాను విసురుకొనుచుండ, విసనకర్ర నేను విసురుచున్నానని తనయెదుట చెప్పుచున్నను తనశక్తి కెట్టిలోపము సంభవించక పోవుటయేగాక, తన సత్తా వలన, విసనకర్ర కట్టిశక్తి సంభవించినందులకెట్లు ఆనందము సంభవించునో ఆ విధముగ నీ విజ్ఞాన సంపత్తివలన, నేను నాదియనుచు ద్వైత రూపముచే ప్రకాశించు జడమగు మనస్సువలన సంభవమగు సర్వవృత్తులు నీకెట్టి ప్రతిబంధమును కలిగింపజాలని వగుచుండ, నీ స్వరూప జ్ఞానసిద్ధి కొరకు ద్వైత సృష్టికి నిమిత్త కారణమగు మనస్సును, నియమించవలెనను కర్తవ్యము నొందుట అధమాధికార లక్షణమగుచుండును.

ఇంద్రజాలకుడు కల్పించు విషయములయందొకటి సత్యమై మరియొకటి సత్యముగాక, సర్వ మసత్యమగు విధమున, అవిద్యా సంభవమగు మనఃకల్పితమైన, త్రివిధావస్థల వ్యవహారములు వ్యవహార సత్యములేగాని, పారమార్థికసత్యముగాదు. స్వప్నమందు ఇంద్రియములెల్ల మనస్సునందు లయించియుండునట్టి యవస్థ యగుటచేతను, అంతఃకరణ రూపమగు మనస్సు లనేకము లగుటచేతను, పూర్వ వాసనానుసారము మనోసంకల్పము ననుసరించి స్వప్నప్రపంచ మావిధముగ సృజియింపబడుచుండుటచే ఇతర మనస్సులకు గోచరముకాదు. జాగ్రత్ప్రపంచ మట్లుగాక, సర్వేంద్రియ సహితమగు మనస్సులకెల్ల సమిష్టి ప్రపంచమగుటచే సర్వత్రా గోచరమగుచుండుట సంభవించినను అస్థిరమే అగుచుండును.

ఎట్లన. అవిద్యా సంభవమగు మనస్సు వాని వికారములును, కాలానుసార మవిద్యయందు లయించుచు, తిరిగి ప్రకాశించుచున్నను, నిర్విశేష జ్ఞానోదయ కాలమందు అవ్యక్తోపాధియగు అవిద్య సమూలముగ నశించుచుండుటవలన, సర్వావస్థలయందు సంభవమగు సర్వవ్యవహారము లా యా సమయములందు వ్యవహార సత్యములైనట్లు తోచుచున్నను, అవస్థా రహితమగు తుర్యాతీతమందు సర్వము శూన్యమని తురీయావస్థానుభవముగల బ్రహ్మవిధులకు తెలియదగియున్నది. పరచితియగు గాయత్రి. జాగ్రత్స్వప్నాద్యవస్థలయందు అనేక నామరూపాదులచే భాసించుచుండును. అందువలన పరిమితిగలదైనట్లు అజ్ఞాన దృష్టియందుదోచును.

పరాత్పరుడగు పరమాత్మయనంత శక్తి ప్రకటింపజేయుటకుగాను సాన్నిధ్యమందుగలచితి, జగదాకారముగ పరిణమించినట్లు దోచినను, అఖండైక రస స్వరూపమేయగును. అచలమును, నిర్గుణమును, ఏకమునగు చితి మహిమవలన బహుళముగ భాసించు జగత్తు, పరిచ్ఛేదముగను శాశ్వతముగను, సుఖప్రదముగను, దోచుచుండునట్టి అనాత్మ భాసమునకే అవిద్య, జడశక్తి, శూన్యము, ప్రకృతి యను నామాంతరములు గలవు.

చితి సంభవమగు అవిద్య యొక్క ప్రథమ సృష్టి ఆకాశమన బడును. ఆకాశాది పంచభూతోత్పత్తి వలన చిత్తునకు పరిచ్ఛేదమున్నట్లు తోచును. యేకదేశమగు పరిపూర్ణాత్మ విశ్రాంతి భావనాదారుఢ్యమువలన ఆకాశముదయించెను. అహంకార రహితమగు నావరణమే చిదాకాశమన బడును. నివారణమగు ఆకాశమువలన తదితర భూతములును, నావంచ భూత సమ్మేళనము వలన ఆవరణ సహితమగు భూత సృష్టియు, వాని వలన పరిణామ రూపమగు జగత్తును సంభవమగుచుండును.

ఓ రామా, దేహాభిమానము వలన అవివేకముచే పశు దృష్టిగల వారికి ద్వైతము భాసించును. గాన నీవు సూక్ష్మదృష్టిచే విమర్శింపుము.

జగత్తునందు నీకు దోచుచున్న పశుపక్ష్యాది జీవరాసుల యంతఃకరణమందు ప్రతిఫలించియున్న చైతన్యమేనీ యంతఃకరణ యందును భాసించుచున్నదిగదా, అంతఃకరణ ప్రతిబింబిత చిత్తునకే వాచ్యార్థమందు మనస్సనబడుచున్నది. అట్లగుటచే మనస్సు చిత్ప్రతిబింబితమే గాని, వేరుగాదని బోధింపగా పరశురాముడు నమస్కరించి.

అయ్యా, చిదాత్మకును, మనస్సునకును భేదములేనియెడల ప్రమాతృ ప్రమాణాది, భేదములెట్లు సిద్ధించుననగా దత్తాత్రేయులు చెప్పుచున్నారు. చిత్తమునందు ప్రతిఫలించి చితి జడశక్తిచే నావరింపబడి మనస్సనబడు చున్నది.

మనో ప్రమేయముల కాధారమగు ప్రమాత జడశక్త్యావరణములైన యింద్రియ ప్రాధాన్యమువలన ప్రమాణమనబడును. ప్రమాణసాధనమగు మనస్సునకును, ప్రమాతయగు చితికిని భేదము లేదు. యీ ప్రమాత ప్రతిబింబిత చిద్రూపుడు గాని, కేవల చితిగాదు. చితి చిదాకాశముచే నావరింపబడి పంచభూతావయవసం యోగమువలన ఘనత్వ, మాలిన్యత్వాది ధర్మములు గలిగి, ఘటమందలి దీపము ఘటాకారమును బొంది, ఘటమును భాసింపజేయునట్లు, భౌతిక శరీరములచే నావరింపబడి, నాయా శరీరాకారములను బొందుచు సర్వ భూతములను భాసింపజేయుచుండును. ఘటమందుంచిన దీపము ఘటము యొక్క అంతర్బాహ్యములను ప్రకాశింపజేయు విధమున అంతఃకరణ యందు ప్రతిఫలించినచితి, చక్షురాది యింద్రియ

ద్వారముల నిర్గమించి బాహ్యమందు శబ్ద, స్పర్శాది రూపములను, అంతరమందు మనస్సు వలన రూపనామాద్యాకారములను సంకల్పించి భాసించుచుండును.

పరిపూర్ణమగు చితికి గమనా గమనములు స్వయముగ లేకపోయినను, భూతావరణ పంచకము వలన వ్యాపకమున్నట్లు తోచుచుండును. చిదాత్మ జ్ఞానస్ఫూర్తిచే ఆవరణ భ్రాంతి దోచకుండుట మనోవ్యాపారము గమక మనస్సు చిదవ్యముగాదు. చంచల రహితమగు మనస్సు చితియనబడును. వృత్తి రహితమగు నిశ్చల చితి నీవని యెరుంగుము. ఉపాధి రహితమగు నిరావరణ నిర్విశేష స్వరూపజ్ఞానమే ముక్తియనబడును. గాన అట్టి స్వరూపలక్షణమును విచారించమనగా పరశురాముడు.

అయ్యా! సంకల్ప, వికల్పాదులొకవేళ శాంతించినను, ఆవరణము నశించదు. ఆవరణ ముపాధిసంభవమగుటచే ఉపాధి రూపమగు దర్పణము లేనియెడల ప్రతిబింబముండజాలని విధమున, ఉపాధి రూపమగు చిత్తము లేనియెడల చితి యెట్లు భాసించునని యడుగగా, దత్తాత్రేయులు,-

ఓ రామా! ఆవరణమగు ఉపాధి సంకల్ప కల్పితమగు అభాసము కనుక సంకల్పరహితమైనప్పుడు మనోగతావరణము నదృశ్యమగును. అదెట్లనిన స్వప్నమందు శత్రువు తనను కట్టివైచి కొట్టుచూ బెదరించుచున్నట్లు బాధపడుచున్న మనస్సు ఆ సంకల్పమును విడువగా సర్వము శూన్యమైన విధమున, జాగ్రద్దశయందును ఉపాధిరూపమగు మనస్సంకల్ప సంభవమగు వికల్పములు, జ్ఞానకాలమందు మనస్సుతోసహా శూన్యమగును గావున, మనఃకల్పిత సంకల్పమువలన సంభవమగు సంసారము

సత్యమని తలచుట మహాబంధ మనబడును. యీ బంధ భ్రమ నివారించ నంతవరకు ఎంతటి విద్వాంసుడైననూ. అధికమగు ఎంత యుపాసన మొనర్చిననూ, ముక్తుడు కాజాలడు. శాస్త్ర పరిచయముగలవాడు విద్వాంసు డనబడును. తత్త్వజ్ఞానసిద్ధి గలవాడు పండితుడనబడు.

దర్పణ ప్రతిబింబమగు అగ్నివలన యే పదార్థము దహింపబడని యట్లు ప్రతిబింబిత దృశ్య జగద్వికారమువలన చితి కెట్టి బంధము సంభ వించజాలదు. జగత్తు సత్యమనియూ, చితికంటె మనస్సు వేరనియూ, తల చుట బంధమగును. బంధరూపమగు పంసారము సత్యమనియూ, చితి కన్యముగా చిత్తము కలదని నిశ్చయించునట్టి బుద్ధియందుగల ద్వివిధమా లిన్యములగు, సద్విచారమను మహా జలముచే ప్రక్షాళనము చేయవలెను. అద్దమందు మాలిన్యము శుభ్రము చేయనియెడల అందేరూపము ప్రతిఫలిం చనియట్లు మనస్సునందు సంభవమగు పైరెండు మలములను సద్విచార మను శుద్ధజలముచే నివర్తించనియెడల త్రిమూర్తులుగాని విద్యా స్వరూ పిణియగు గాయత్రి స్వయముగ ప్రబోధించినను బంధవిముక్తి చేయజా లరు. కావ అంతర్లక్ష్యము గలవాడవై సద్విచారముచేసి మనస్సుయందు గల దోషములను నివారించి సుఖింపుము.

వికల్పములతోకూడిన చిత్తము సంకల్పరహితమైనప్పుడు చిదా కారమగును. ద్వైత స్ఫురణము చిత్తావాసమేకాని చితియందు సత్యముగ లేదు. దృశ్య విషయాకార లక్ష్యమందు చితి వ్యాపకముకలదై మనోరూప మగును. దృశ్య ముపేక్షింపగా నిర్విశేష జ్ఞానాకారమగు చితి మిగులును. భ్రాంతికాలమందు స్ఫురించు ద్వైతరూప జగత్తెల్లను త్రాటియందు గల్గిన సర్ప భ్రాంతి నివర్తించినప్పుడు త్రాడు మిగులునట్లు ఆభాసమాత్రమై

స్వరూపజ్ఞానము ప్రకాశించుచుండును. జాగ్రత్ప్రపంచ మెల్లను స్వప్న ప్రపంచమువలె మిథ్యయని నిశ్చయించిన జ్ఞానము చిదాకార మగును. చితియందు భాసించు ద్వైతరూప జగత్తున కాధారము చిత్తమే యగుటచే ద్వైతమున కుపాధి చిత్తముకన్న మరియొక యాధారము లేదు.

జాగ్రత్ప్రపంచము స్వప్నమందుగాని, స్వప్న ప్రపంచము జాగ్రత యందుగాని, లేని విధమున తురీయమందీ రెంటియవస్థల వ్యవహారము శూన్యమేయగును. జాగ్రస్వప్నాద్యవస్థలయందు సంభవమగు వ్యవహార మందు నీకుగల సత్యత్వ భ్రాంతి స్థైర్యమువలన వ్యవహారయోగ్యమై సత్యముగా దోచును గాని యదార్థముగాదు. మాయామోహితులగు మాన వులు సత్యాసత్యములను విమర్శించదగిన స్థిత ప్రజ్ఞలేని వారగుటచే జగ ద్వ్యవహారము సత్యమనితలతురు. జాగ్రదావస్థయందు వ్యవహార సిద్ధి కొఱకు కల్పితవస్తువులు, కాలము, వ్యవహారసిద్ధికొఱకు, నెలలు సంవ త్సరముల పర్యంత ముందునేగాని సత్యముకాదు. రూపనామాదుల కాధార మైన చితి సదా నాశనము లేవిదగుటచే, సత్యమగును.

రూపనామాదికములగు జడవస్తువులకు స్వప్రకాశముండదు. దృశ్య సామాన్య జ్ఞానస్ఫూర్తి లేని సుషుప్తి మూర్ఛాదులయందు చిత్తుస్ఫురిం చదు గాన చితికభావముగలదందు వేని చిత్ప్రకాశము లేని చిత్తముచేష్టా రహితమగును. చిత్తమాలిన్యము వలన వివేకజ్ఞానము లేకపోయినను, ప్రాణచలనము నశించదు, గాన చిత్తుసదా భాసించుచునే యుండును.

ఓ భార్గవా! సత్యాసత్యములను సంగ్రహముగా చెప్పెదనాకర్ణిం చుము. ఉపాధిరహితమగు నిర్విశేష జ్ఞాన ప్రకాశమైన చితి సత్యమగును

నీకు దోచునట్టి జగత్సత్యత్వ భ్రాంతియందొక విపరీత జ్ఞానముకలదు. అదెట్లన, యదార్థమైన త్రాటియందు మనస్సేంద్రియాదులకు సర్పజ్ఞాన భ్రాంతి కలిగిన విధమున యదార్థమగు చితి స్వప్రకాశముగ ప్రకాశించు చున్నను లేదను జ్ఞానముచే, దేహభ్రాంతి దోచుట విపరీతజ్ఞానమనబడును. వ్యవహార యోగ్యమగు జగత్తు సత్యమని తోచుట మనస్సేంద్రియ భ్రాంతి జన్యమగును గాని సత్యముగాదు. జగత్సత్యత్వ విపరీత జ్ఞానము వాసనా సహితమగు మహాభ్రాంతి యనబడును. "సర్వంఖల్విదంబ్రహ్మ" యను తత్వ జ్ఞానముదయింపనంతవరకు ఈ మహాభ్రాంతి నశించజాలదు. సర్వేంద్రియ వృత్తి జ్ఞానమందేకరూపముగ ప్రకాశించునది ప్రజ్ఞానమన బడును. దేహభ్రాంతి నశించి సర్వేంద్రియ వృత్తిసాక్షి చిన్మాత్రజ్ఞానమే ప్రజ్ఞానమనబడును.

ఓ భార్గవా! నీ సందేహములకు సమాధానము చెప్పితిని. జీవన్ముక్తునకు వ్యవహారమెట్లు సంభవమగునను ప్రశ్నకు సమాధానము చెప్పెద నాలకించుము. లోకమునందుత్తమ మధ్యమము లందు త్రివిధ జీవన్ముక్తులుండెదరు. అందు స్వరూపజ్ఞాన నిశ్చయముకలిగియు, ప్రారబ్ధ సంభవమగు సుఖదుఃఖాదులయందు కర్తృత్వముచే, ఖేదమోదములందువారు మందజ్ఞానులగుదురు. ప్రారబ్ధ సంభవమగు విషయములయందు మనస్సు సుఖదుఃఖము లనుభవించుచున్నను కర్తృత్వరహితులై, మద్యపానమొన ర్చినవారి వలె నొడలెరుంగక యుండువారు మధ్యములు. ప్రారబ్ధ సంభవ మగు సుఖదుఃఖాది విషయములనుభవించు మనోవికారములయందెట్టి సాక్షి త్వమును లేక నిర్విశేష జ్ఞానమువలన స్వరూపానందమగ్నులగు వారుత్త ములు. మందజ్ఞానికి, నిర్విశేష స్వరూపజ్ఞానము సదానిల్చియుండదు.

ప్రారబ్ధ సంస్కారమువలన స్వరూపజ్ఞానవిముఖుడై సవిశేష జ్ఞానము కలిగి త్రిపుటియందు కర్తృత్వము వహించును. అందువలన ఆత్మజ్ఞానియైనను ఈ జన్మయందు జీవన్ముక్తి సంభవించదు. మధ్యమ జ్ఞానికి అంతఃకరణ ప్రతిబింబిత వృత్తులయందు చలించని సాక్షిత్వముగల సమాధి పరిపాక విశేషమునను ఉత్తమజ్ఞాని త్రివిధ శరీరవృత్తులయందు సాక్షిత్వములేని నిర్వికల్ప సమాధి పరిపాక విశేషమువలనను, ప్రారబ్ధ విశ్లేష ప్రభావమువలనను, విచిత్ర సత్తాగల మాయావర్ణమును తరించెదరు. మద్యపానాధిక్యము వలన దేహవృత్తు లెరుంగనియట్లు అసంగుడగు యుత్తమజ్ఞాని స్వస్వరూప సంధానమగ్నుడై. దేహ పరిగ్రహణమందుపేక్ష కలిగియుండును.

పదునెనిమిదవ అధ్యాయము

సంపూర్ణము.



# పందొమ్మిదవ అధ్యాయము

ఓ దత్తాత్రేయ గురువర్యా! మీరెంత యుపదేశించినను నాకు సందేహము లతిశయించుచున్నవి, సందేహ నివృత్తిమార్గ ముపదేశించి బంధ విముక్తి గావింపగోరుచున్నాను. జీవన్ముక్తు లెట్లు వ్యవహరింతురు. బుద్ధి భేదముచే జ్ఞానము చిత్రగతుల పరిణమించుననని చెప్పితిరి. పూర్వము జ్ఞాన మేకమనియు, చిత్ప్రకాశ మనియు, చిత్ప్రకాశ జ్ఞానము మోక్షమనియు, చెప్పితిరి. మోక్షము, మోక్షోపాయమగు జ్ఞానము ఏకరూపమై యుండగా, తీవ్రమందాది భేదములు బుద్ధియందున్నను, జ్ఞానమనందా భేదమెట్లు కలిగెను. అట్లయిన సాధనములయందును భేదములుండును గదా. అని పరశురాముడడుగగా దత్తాత్రేయులు చెప్పుచున్నారు.

భార్గవా ! ఇంతకుముందు ఇప్పుడు నీ వడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పితిని. గాని నీవు దేహభ్రాంతి గలవాడవై పరాకుగా వినుటచే తిరిగి ప్రశ్న జేసితివి. గాన, అత్యుత్తమమగు తత్త్వజ్ఞాన రహస్యమును శ్రద్ధతో నాలకింపుము. జ్ఞాన మేకరూపమైనను, ఉపాధి మాలిన్యమునమపరించి సాధన ఫలభేదములుండును. సాధనాంతరములచే నిర్మలమగు బుద్ధియందు ప్రతిఫలించిన చిత్ప్రకాశ జ్ఞానము స్వరూపసిద్ధికి సాధనమగును. దేహాభిమానముతో గూడిన బుద్ధియందుగల మాలిన్యము తగు సాధనము లేనియెడల నిర్విశేష జ్ఞానసిద్ధి లభించుట దుర్లభమగును. ఉపాధి రూపమగు బుద్ధికి సాధనాపేక్ష కలదుకాని, జ్ఞానప్రకాశమగు చితిశక్తి యపేక్ష సంభవింపదు. బుద్ధికి జ్ఞానప్రకాశాపేక్ష గలదుగాని చితిశక్తి యపేక్షయులేక స్వయముగ ప్రకాశించును. సాధనములెల్లను జ్ఞానమున

కారణమగు బుద్ధిమాలిన్యము నివర్తించుట కుపయోగించునుగాని స్వప్రకాశ జ్ఞానమున కుపయోగించదు.

శుద్ధ స్ఫటిక సన్నిధియందుంచబడిన పద్మరాగమణి, తాను నిర్మలముగ ప్రకాశించుటయేగాక శుద్ధ స్ఫటికమును తనవలె ప్రకాశింప జేయు విధమున, శుద్ధ చిత్తమందు ప్రతిఫలించినచితి తాను స్వయముగ ప్రకాశించుచు చిత్తమును ప్రకాశింపజేయుచుండును. చిత్తము శుద్ధమైన యడల సాధనము లనవసరములగును. మధ్యమాధమాధికారులు చిత్తమందుగల వాసనలు నశించుటకుగాను యోగాదిసాధనము లభ్యసించుచుండెదరు. వాసనాసహిత వృత్తులతో కూడిన చిత్తమునందు ప్రతిఫలించియున్న చితియను మాణిక్యము వాసనయను బురదయందు కప్పబడి ప్రకాశించనందున చిత్త నిరోధమను యోగజలమువలన కప్పబడిన బురదను ప్రక్షాళనము జేయవలెను.

ఓ రామా! అనాది వాసనాసహితమగు దేహభ్రాంతిచే మాలిన్యముగల చిత్తమను భరిణను, సద్విచారమను శలాకముచే భేదించి స్వప్రకాశమగు చితియను మణిని సులభముగా పొందవచ్చును. పూర్వ వాసనవిశేష అల్పాది భేదములవలన బుద్ధియందు భేదజ్ఞాన ముదయించుచుండును.

వాసనా సహితమగు సంకల్పాదులయందు కర్తవ్య ముండువంత వరకు స్వరూప జ్ఞానసిద్ధి లభించదు. అట్టి అధమాధికారులు మనోలయము కొరకు, సాధనాంతరాపేక్ష యవసరమగును. ఈ వాసనలకు త్రివిధము లగుచున్నవి. (1) అపరాధవాసన, (2) కర్మ వాసన, (3) కామవాసన లను త్రివిధ వాసనా లక్షణములను చెప్పెద నాలకించుము.

మొదటిది గురువాక్యముల యందశ్రద్ధయే యపరాధ వాసన యగును. ఈ వాసనా విశేషమువలన, ఆత్మ జ్ఞానోదయమునకు ముఖ్య ప్రతిబంధము సంభవించును శాస్త్రానుసారము గురు ప్రబోధ వాక్యముల యందుగల సత్యత్వభావన శ్రద్ధ యనబడును. దేహము తానను భావనా సంభవమగు అహంభావ సహితమైన అశ్రద్ధవలన, కర్మ వాసనయను రెండవది పురుషాపరాధ మనబడును. ఈ కర్మ వాసనవలన, శాస్త్ర ప్రవచన వేత్తలైన విద్వాంసులు వాచస్పత్యాది పండితులైనను, పూర్వ పక్షము చేయుదుమను దురభిమానముతో పరతత్వము నిశ్చయింపజాలక పతనమగుచుందురు. ఈ పురుషాపరాధమువలన, నిర్విశేష పరత్వము లేద నియు, యట్లుండుట సంభవింపదనియు, ఉన్నను దానిని తెలుసుకొనుట యసాధ్యమనియు, జ్ఞానము మోక్షసాధన మెట్లగుననియు, ఈ విధమగు విపరీత జ్ఞానమువలన చిద్రూపమునందు సంశయజ్ఞానము పురుషాపరాధము వలన కలుగుచుండును.

ఈ ముఖ్యవాసనకల విద్వాంసులు వితండవాదములుజేయుచు ప్రతి కక్షులను జయించుచు, తాము జ్ఞానులమని విఱ్ఱవీగుచుండునట్టి అజ్ఞానము వలన సంసార తరణోపాయ మెఱుగక దుఃఖపడుచుండెదరు. రెండవది యగు పురుషాపరాధ వాసనా జనితమైన రాగద్వేష చిత్త మాలిన్యములు గురువుపదేశింప జ్ఞాననిష్ఠకు ప్రతిబంధము కలిగించుచుండును. అట్టి చిత్త మాలిన్యమువలన జగత్సత్యత్వ భ్రాంతియు గురువుయందు మానవరూప భ్రాంతియుకలిగి. గురూపదేశమందు శ్రద్ధలేక నశించెదరు. గురువుయందు చిద్రూపిణియగు గాయత్రి భావముంచినయెడల మహాఫలము లభించును. ఈ కర్మ వాసనయోగాది సాధనమువలన చిత్తము నియమింపబడినను

యా వాసన నశించుట దుర్లభమగును. మూడవదియగు కామవాసన ఒక ఫలము కొరకొక కార్యము చేయవలెనను కామ్య సంకల్ప కర్తవ్యముగల సంసార మపారముగలదై, అతివ్యాపకము గలదగుచున్నది.

ఓ రామా! భూమియందున్న ఇసుక రేణువులను, గగనమందలి నక్షత్రములను, సముద్ర తరంగములను, లెక్కింపవచ్చునుగాని. మానవ కామ్య సంకల్పములను, హిరణ్యగర్భుడైనను లెక్కింపజాలడు. ఈకామ వాసన, సర్వభూతములకు భ్రాంతిని కల్పించుచు, సాధింప నశక్యమగు వ్యాపకము గలదగుటచే ఆకాశముకంటె మిక్కిలి వ్యాపకమైనదియు, కద లింపశక్యముగాని పర్వతముకంటె నతి దృఢమైనదియు నగుచున్నది. ఈ కామ వాసనాసహితులగు అనేకులు పిచ్చివానివలె యుక్తాయుక్త మెఱుంగక పశువుల చందమున స్వేచ్ఛగా ప్రవర్తించుచుందెదరు. పూర్వజన్మ పరి పాక వాసనా విశేషమువలన, కొందరు యోగాది సాధనములచే చిత్త నిరోధసిద్ధినిగాంచి అస్థిరములగు జగద్వ్యవహారములయందు కర్తవ్య రహితులై కామవాసనల నిగ్రహించి తాము తరించుటయేగాక. పరులను తరింపజేయ ప్రయత్నించెదరు.

పైన తెలుపబడిన వాసనా త్రయదోషముచే చిత్తము మాలిన్యము గలదైనయడల పరతత్త్వమా చిత్తమునందు భాసించదు. గావున, సర్వ సాధనములచేతను సాధింపదగినది. వాసనాసహిత మనోనాశమే యగును. పైన తెలుపబడిన ప్రతిబంధములలో, మొదటిదియగు గురు వాక్యముల యందశ్రద్ధవలన తనకు జ్ఞానము గలదను దృఢనిశ్చయము సంభవించి, అశ్రద్ధ తగ్గి క్రమముగా శ్రద్ధ కలుగును. రెండవదియగు కర్మ వాసన, గురువుయందును, నిష్కామకర్మయందును, శ్రద్ధ కలిగి యుండుటవలన,

ఈశ్వరానుగ్రహముచే నివర్తింపగలదు. విషయ ప్రతిబంధ దోషములను నిశ్చయించుట, కామమున కాధారమగు మనస్సును, యోగాది సాధనములచే నిగ్రహించుటవలన వైరాగ్యము సంభవించును.

సద్గురువు లభించుటకును, గురూపదేశ మాశ్రయించుటకును, అశ్రద్ధ నివారించుటకును, కామము నశించుటకును, అజ్ఞాన నివృత్తికిని, ఈశ్వరానుగ్రహ రూపమగు యోగము ముఖ్య సాధనమని నిశ్చయింప దగియున్నది. కామవాసనా బలము ననుసరించి విషయములయందు వైరాగ్యము హెచ్చుతగ్గుగ నుండును. ఉపాసనలయందు మోక్షాపేక్ష ప్రధానమైనది. అట్టి శుభేచ్ఛ లేక చేసిన వేదాంతశాస్త్ర శ్రవణాదికమెల్లను నిష్ప్రయోజనమగును. షట్శాస్త్ర జ్ఞానమువలన మోక్షము లభించదు. మోక్షాపేక్షమందమై విషయవాంఛ మిక్కుటమైనయెడల, శృతి నిర్ణయమగు ఫలవాంఛవలె శాంతి యొసంగజాలదు సంకల్పమున కనుగుణ్యమగు తీవ్రప్రయత్నము జేసినగాని ఫలము లభించదు. సంకల్ప మాత్రముచే ఫలము సంభవించినయెడల అందఱు సర్వలాభములను సులభముగా పొందుట తటస్థించవలెను. అట్లు లభించుటలేదు.

సామాన్య విషయములయందు సైతము దృఢ ప్రయత్నము లేక ఫలసిద్ధి లభించకపోవుటచే శాశ్వతమగు మహాఫలసిద్ధికి సాధనమైన విషయములయం దభావము, తీవ్ర ముముక్షుత్వము లేనియెడల యెట్లు సిద్ధి లభించును. తీవ్ర మోక్షాపేక్ష గలవాడీ జన్మముననే ముక్తుడగును. మందము ముక్షుత్వమువలన క్రమముక్తి లభించుట యరుదగుచుండగా మోక్షేచ్ఛ లేని మానవులకు శాస్త్ర శ్రవణము జన్మరాహిత్యమగు మోక్షమెట్లు సమకూరును. తీవ్ర మోక్షేచ్ఛవలన విషయ వైరాగ్యమును, అందువలన

సత్పురుషాశ్రయమును గలుగుటచే శీఘ్రముగ మహాఫలము లభించునని చెప్పగా, పరశురాముడు:—

"అయ్యా! మోక్షప్రాప్తికి సత్సాంగత్యము ప్రథమ కారణమని ఒక సమయమున చెప్పి మరియొక సమయమున విషయములయందు దోష దృష్టియు, ఈశ్వరానుగ్రహమును, కారణంబులని చెప్పితిరి. ఇందుముఖ్య కారణమేది, అది యెట్లు లభించున"ని కోరగా, దత్తాత్రేయులు.

"ఓ రామా! చితిరూపమగు గాయత్రియను పరదేవత, తన మాయా శక్తి వలన నిర్మించు దర్పణ ప్రతిబింబిత నగరాదులవలె అంతఃకరణ యందు జగచ్చిత్రమును కల్పించి, హిరణ్యగర్భరూపమును దాల్చి, అనాద్య జ్ఞానవాసనా సహితమగు జీవులను సృష్టించి వారి కామ్యసిద్ధి నొసంగదగిన కర్మ విధులను దెల్పు వేదములను నిర్మించెను. మానవుడు మిశ్రమకర్మ శేషముచే జన్మించి కామ్యకర్మలను జేయుచు, ఆయా కర్మపరిపాక విశేషమువలన ననేక జన్మలెత్తుచు, తిరిగి మిశ్రమ పుణ్య కర్మాతిశయమున మనిషి జన్మ లభించి, ఏదేనొక ఫలమ పేక్షించుచు, అందుకు దగిన కామ్యకర్మయందభిముఖుడగు చుండును.

ఆ కామ్యకర్మఫలసిద్ధికొరకు ఈశ్వరునారాధించుచు, కర్మయందు విధిరహితుడై ఫలప్రాప్తి సంభవించక కర్మవిధి కొరకు సత్పురుషులనాశ్రయించును. సత్పురుషులు నిస్పృహులైనను మానవులయందను గ్రహము గలవారగుటచే భక్తులననుగ్రహించి, ఈశ్వర సేవావిధులనుపదేశింతురు. నాయుపదేశవిధి ననుసరించి, సత్కర్మానుష్ఠానముగలవారై, ఈశ్వరానుగ్రహమువలన అదృష్టముదయించుట సంభవించును, అందుచే శ్రద్ధ

వలన సత్కర్మలాచరించుచుండెదరు. మానవులకు పూర్వవాసనా విశేషము వలన శ్రద్ధాభక్తులు లేక యుండును గాన, ఉపదేశార్హులు గారని సత్పురుషులుపేక్ష చేసినను, నొక్కొక సమయమందు విలాసార్థము పెద్దలు చెప్పుచుండు సామెతలు మానవులకుపదేశమే యగునని వశిష్ఠ మహర్షి చెప్పెను.

ప్రాకృత పుణ్యపరిపాక వశముచే సంభవమగు సత్సాంగత్యము అసాధ్యమగు శ్రేయస్సును పొందుటకు ప్రథమ సాధనమగును. ఈ విధముగ బహుజన్మలంతరించగా శ్రద్ధతో పరచితి నారాధన జేయుటవలన సత్సాంగత్యము లభించును. వైరాగ్య సహితమగు గాయత్రి యారాధన వలననే, సత్పురుషానుగ్రహము లభించును. వాసనాభేదము వలనను, సాధనాతారతమ్యమువలనను, నిర్మలబుద్ధి ననుసరించి, జ్ఞానుల ప్రవర్తన యందు భేదముండును, వాసనా సహితమగు మనో నిగ్రహముగలవారికి ఎట్టి సాధనాంతరాపేక్షలేకయే, నిర్విశేష జ్ఞానసిద్ధి లభించును.

ఏ మానవుని మనస్సు వాసనారహితమై నిర్మలమగునో యామహానుభావుడు తీవ్ర తపస్సుచే మునులు సంపాదించెడి నిర్విశేష జ్ఞానమును జనకచక్రవర్తి వలె శ్రవణ కాలమందతిసులభముగ నార్జించును. ఎవని మనస్సు దుర్వాసనా మాలిన్యము గలదగునో వానికి జ్ఞానముదయించినను పాచికప్పిన నీటియందు ప్రతిబింబముగానిపించని విధమున చిదాత్మ భాసించదు. అట్టి దుర్వాసనా చిత్తమాలిన్యముగలవారు, విధిధ్యాసనాది యోగసాధనములచే వాసనా మాలిన్యములను నివారించవలెను. వాసనా తారతమ్యములచే బుద్ధియందు మాలిన్యము సంభవించినప్పుడు, జ్ఞానస్థితి మారుచుండును. నిర్విశేషజ్ఞానముగల త్రిమూర్తులును వారికి స్వభావమగు

గుణాశ్రయమువలన సృష్టి, స్థితి, సంహారములను వేర్వేరు చేయు చున్నారు.

అందొకరు చేయు కార్యము మరియొకరు చేయజాలరు. వీరికి అంతఃకరణ యందెట్టి మాలిన్యము లేకున్నను ప్రధాన గుణాంశస్వభా వము వేరుగనున్నది. అజ్ఞానులు పరగుణములను ద్వేషింతురు. చిన్మా త్రుడై సర్వాంతర్యామియగు జ్ఞాని సర్వత్రా తావలోకించునట్టి వ్యాపకు డగుటచే, "పరస్యభావకర్మాణి నప్రశంసేన గర్హయేత్, విశ్వమే కాత్మ కంపశ్యన్ ప్రకృత్యా పురుషేణచ" అను న్యాయానుసారము అసూయ లేక పర్వసముడై యుండుసు.

ఓ రామా! అత్రిమహాముని పుత్రులమగు, చంద్రుడు, దూర్వా సుడు, నేనును జ్ఞానమునందు సమానమైనను, మా ముగ్గురి స్థితియందెంత భేదమున్నదో యోచింపుము. నేను వర్ణాశ్రమ నిర్ణయములను పాటిం చను. విత్తమును భార్యను గోరను, చంద్రుడు బృహస్పతి యొద్ద విద్యా భ్యాసము జేయుచు, గురుభార్యయగు తారనపహరించెను. దూర్వాసునికి గల కోపాతిశయము సర్వత్ర విదితమేగదా. వశిష్ఠుడు కర్మనిష్ఠగల వాడు, సనకాదులు కర్మత్యాగులు, నారదుడు పరమ భక్తుడు శుక్రా చార్యులు నీతి శాస్త్ర ప్రవీణుడై, రాక్షసులకు గురువాయెను. బృహస్పతి దేవతలకు గురువయ్యెను. వ్యాసుడు శాస్త్ర నిర్మాతయయ్యెను. జనక చక్రవర్తి రాజ్యమేలుచుండెను. జడభరతుడు సన్యసించెను. పవన, యాజ్ఞవల్క్య విశ్వామిత్రాది జ్ఞానులు వారి వారి ప్రారబ్ధమననుసరించి భిన్నవృత్తి గలవారైయుండిరి, వీరియందిట్టి భేదజ్ఞానముండుటకు కారణము వినుము.

నీకు పైన తెలుపబడిన త్రివిధ వాసనలలోనేవాసనయతిశయించి యుండునో, యావాసనాను ప్రవర్తకులై వాసనాక్షయమైనప్పుడు స్వరూప జ్ఞానసిద్ధి లభించగలదు. అందుత్తమ, మధ్యమ, జ్ఞానులు ప్రారబ్ధపరతంత్రులై విషయములయందు సుఖదుఃఖములనుభ వించుచున్నట్లు దోచినను. జీవన్ముక్తులమటకెట్టి సందియమునులేదు. ప్రారబ్ధమతిశయముగనున్నను సమాధియందు మనస్సులయించినప్పుడు వేచబడిన బీజములు మొలకలెత్త జాలనియట్లు సమాధియందు జ్ఞానాగ్నిచే దహింపబడిన మనోగత వాసన లెల్లను ప్రతిబంధము కాజాలవు. భగవద్గీత–3, అ–26 శ్లోకార్థమునను సరించి, కర్మకౌశల్యముగల యోగులు తాము కర్మచేయుచు, శిష్యులకు ప్రతిబంధ రహిత కౌశల్యమునుపదేశించి కర్మలు చేయించుచుండెదరు. యోగు లేక కాలమందనేక కర్మలు చేయదగిన వ్యవసమొధానర్చుచుండెదరు. అట్టి నిపుణులొక చిత్తజ్ఞానము చేతనే రాజ్యాద్యనేక వ్యవహారము లొనర్చుచుండెదరు.

పూర్వము కార్తవీర్యార్జునుడు నీతో యుద్ధము చేయునప్పుడు తన చేతులయందనేక బాణములను సంధించుచు యెట్టి శ్రమ లేక యుద్ధము చేయుట నీకు తెలిసియున్న విషయమేగదా! అతనివలె నిపుణులగునుత్తమ జ్ఞానులు, అంతర్దృష్టియందు సమత్వముగలవారై అంతర్బాహ్యవ్యవహారములకు వ్యతిరేకము లేకుండునట్లు కుశలత్వముతో ప్రవర్తించుచుందురు. వీరు ప్రారబ్ధము ననుసరించి విషయములయందు ప్రవర్తించుచున్నను. నిష్కామకర్మ జ్ఞానసిద్ధివలనను విషయములయందు కర్తృత్వము లేక పోవుటవలనను; నాయావిషయములు ప్రతిబంధము కాజాలవు, మానవులయ్యెడి కార్యములయందు ప్రవర్తించునప్పుడు సంభవమగు లాభనష్ట

ముల వలన తమకెట్టి ఖేదమోదములు స్వయముగ లేకున్నను. నిపుణ త్వముకొరకు నాయా విషయాదులయందు ఖేద మోదము లొందుచున్నట్లు ఉత్తమ ప్రౌఢజ్ఞానులావిధముగ సమాధియం దాత్మాను సంధానమును, బాహ్యమందున్న వ్యవహారమును చక్కబెట్టుచు మనోగత వ్యవహార ములయందు సుఖదుఃఖాదు లనుభవించుచున్నట్లు బాహ్యదృష్టియందు దోచుచుందురుగాని, స్వదృష్టియందు వారికెట్టి వికారము సంభవించనేరదు. వాసనా వశముచే నుత్తమజ్ఞానులు కొందరు కర్మనిష్ఠులుగను, కొందరు జ్ఞానులుగను, మరికొందరు కాములుగను, కొందరు తామసులుగను, వివిధాచారములు గలిగి ప్రవర్తించుచుండెదరు.

మంద జ్ఞానులకు సమాధియం దాత్మజ్ఞానము కల్గియున్నను వ్యవహారకాలమందు కర్తృత్వ భ్రాంతి కలవారగుటచే ఈ జన్మ మందు జీవన్ముక్తి సంభవించదు. ఉత్తమజ్ఞానికి సర్వదా సమాధియగుట వలన వ్యవహార దశయందును అవిచ్ఛిన్నముగ నిర్వికల్పసమాధి జరుగు చుండును గాని, హఠయోగులవలె, మూఢ సమాధి కాదను వశిష్ఠవాక్యము సిద్ధాంతమగును. ఉత్తమ జ్ఞానులకు సమాధియందువలె వృత్తి జ్ఞాన మధ్య కాలమందును నిర్వికల్ప తత్త్వము స్ఫురించుచుండును. సద్గురు కటాక్ష మున నావరణాజ్ఞానము నశించినవారికి చిన్మాత్రరూపమైన గాయత్రి స్వయ ముగ సాక్షాత్కరించును. చిత్తవృత్తి నిరోధమైన నిర్విశేష జ్ఞానము నిత్యాను సంధానమగు సమాధియగును.

ప్రాణాపానరూపమగు మనస్సు కుంభక మందు సుషుమ్నామార్గ మున ప్రవేశించునప్పుడు చిత్తము వృత్తి సహితముగ లయించుటచే, నిర్వికల్ప స్వరూపానందసిద్ధి లభించును. మద్యపాన మత్తునకు వ్యవహా

రము క్షీణించునట్లు సమాధిసిద్ధి గలవానికి మనోగతమగు సర్వ మాలిన్య ములు క్షీణించును జ్ఞానయోగికిని, హఠయోగికిని సమాధి సమాన మగు చున్నను, జ్ఞానయోగి శ్రవణమనన నిధి ధ్యాసలచే, నిర్వికల్ప చిదాత్మ తత్త్వము తానేయను నిశ్చయజ్ఞానము గలవాడగుచు. సమాధికి పూర్వా పర కాలములయందు ప్రకాశించు సంకల్ప రూపమగు మనస్సు. వృత్తుల సహా మిథ్యయని నిశ్చయించి నిర్వికల్ప చిద్రూపుడగు తాను సర్వవృత్తు లకు సాక్షియై ప్రకాశించుచుండును. హఠయోగి చిత్తవృత్తి నిరోధమగు సమాధియందున్నను. చిత్స్వరూపాజ్ఞానావరణము నశింపనందున. సుషుప్తి స్వప్నాదులయందువలె తమోగుణ పరిణామము కలిగియుండుటచే, అజ్ఞా నాంధకారము నశించదు

జ్ఞానులు సత్వగుణాంతఃకరణ పరిణామము గలవారగుటచే, నిర్మ లాకాశమందు ప్రకాశించు సూర్యబింబమువలె శుద్ధాంతఃకరణయందు ప్రతి ఫలించు చిదాత్మ స్వరూపజ్ఞానము బ్రహ్మవేత్తల కనుభవయోగ్యముగాని వర్ణింప నలవిగాదు. జ్ఞానులకు సమాధి వ్యవహార కాలములయందు ప్రజ్ఞా నము నిర్మలముగ ప్రకాశించుచుండును. ఆకారణముచే జ్ఞానుల స్వరూపస్థితి సమాధియందువలె వ్యవహార దశయందును నేకాకృతిగా ప్రకాశించుచుం డును. అందువలన ఇంద్రజాలము మిథ్యయనితలచియు, నుపేక్షగా చూచు విధమున మాయాకల్పిత దృశ్యజగత్తు సత్యమని నిశ్చయించియు. తత్వవేత్త విహారార్థము వ్యవహారమునందు ప్రవర్తించుచు సాక్షియైయుండును. జ్ఞాన యోగుల స్వరూపము జగత్సంబంధములేని అసంగ చిద్రూపమగుటచే ఉత్తమజ్ఞానుల వ్యవహారములెల్లను దృగ్రూపలక్ష్యమగును. తత్వజ్ఞానికి. భౌతిక నామరూప కల్పితవ్యవహారమెల్ల నసత్యముగను, సత్సదాంశమగు చితి సత్యముగ దోచుటవలన జగత్తెల్ల సంవిద్రూపముగ భాసించును.

జ్ఞానము ప్రపంచాభిముఖమై సంకల్పముచే చలించి జగదాకార మగును అట్టి వృత్తి రహితమగు కాలము సమాధి యగును. మధ్యమ జ్ఞానికి సమాధియందు జగత్సంబంధముండదు. ఉత్తమ జ్ఞానికి వ్యవహార కాలమే సమాధి యగును. అదెట్లంటివేని వ్యవహారదశకు శాస్త్రమగు మనో సంకల్పాదులయందెట్టి సంబంధములేని సాక్షియగు అసంగ చిద్రూపుడ నను నిశ్చయజ్ఞానము కలవాడగుటచే ఓ రామా! నీయుత్తమజ్ఞాని బాహ్య లక్ష్యమందు జగద్వ్యాపారమున్నట్లు దోచినను సదా సమాధినిష్ఠుడగుచు న్నాడు అందువలన అతనిజ్ఞానము సదా జగసత్సంబంధములేని అసంగరూ పమే యగును. ఈవిషయమును అంతర్లక్ష్యముచే బాగుగవిమర్శింపుము.

ఓ భార్గవా! జ్ఞానుల ప్రవర్తనా భేదమునుగురించి నీవనేక పర్యాయ ములు ప్రశ్నజేసి యుంటివి. నేనును అనేక పర్యాయములు చెప్పియు న్నాను, నీ సందేహము నివర్తించినట్లు దోచదు. ఆ విషయము గురించి పూర్వకాలమున సత్యలోకమందు జరిగిన బ్రహ్మసభలో విమర్శించబడిన బ్రహ్మ విచారమును నీకు చెప్పెద నాలకింపుము. ఆ సభయందు సనక సనందన, సనత్కుమార, వశిష్ఠ, పులస్త్య, భృగు, చవన, అంగీరస నారదాదులును, విశ్వామిత్ర, గౌతమ, వామదేవ, శుక, పరాశర, వ్యాస, కణ్వాదిఋషులు పరివేష్టించి, తదేక లక్ష్యముచే సభాధ్యక్షుడగు బ్రహ్మ దేవునిగూర్చి ఈ విధముగ బల్కిరి.

ఓ కమలాసనా! మేమెల్లరము పరాతత్త్వజ్ఞాన నిష్ఠులమైననుమాలో కొందరు భక్తిగలవారుగను, కొందరు బ్రహ్మ విచారపరులుగను, మరి కొందరు కర్మ తత్పరులుగను, కొందరు సమాధి నిష్ఠులుగను, మరి కొందరు బాహ్య వ్యాపారపరాయణులుగాను ప్రవర్తించుచు, తమతమ

ప్రవర్తనయే ఉత్తమ లక్షణమని భావించుచున్నారు. పైన తెలుపబడిన ప్రవర్తనలయందుత్తమ మధ్యమ నిర్ణయమెరిగింపుమనియడుగగా, బ్రహ్మదేవుడు కొంతతడవాలోచించి. నీ ప్రశ్నకుత్తరము నిశ్చయింప నా కసాధ్యము. గావున. మనమెల్లరము కైలాసవాసుడగు పరమేశ్వరునివలన దెలుసుకొనుట యుచితమని నిశ్చయించి, విష్ణుమూర్తి సహితముగ పరివేష్ఠించియున్న పరమేశ్వరునకు బ్రహ్మదేవుడు ఋష్యాదుల సహితముగా నమస్కరించి ఋషుల సందేహమును దెలుపగా, పరమేశ్వరుడు వారి సంశయములను కొంతసేపాలోచించి వీరికి తన వచనములయందు నమ్మిక యుండదని తలంచి శంకరుడిట్లనియె.

బ్రహ్మదేవా ! మీ రడిగిన ప్రశ్నలకు సమాధానము నిశ్చయముగ నాకును దోచదు. మనమెల్లరము జగత్కారణ రూపియగు గాయత్రిని ధ్యానించి, ఆమెవలన తెలుసుకొనుట యుచితమని నిశ్చయించి యా త్రిమూర్తులు, మహాఋషుల సహితముగ గాయత్రిని ధ్యానింపగా, అపరిచ్ఛిన్న చిదేకరూపిణియగు గాయత్రి ఆకాశమందు శబ్దరూపముగ నావిర్భవించి ఈ విధముగ పలికెను.

ఓ మునిపుంగవులారా! మీ ప్రార్థన ననుసరించి ప్రత్యక్షమైతినని గగనమందు గంభీర వచనముల బలికెను. అంత బ్రహ్మాదిఋషులు పరోక్షముగ సాక్షాత్కరించిన గాయత్రికి నమస్కరించి ఈ విధముగ స్తోత్రము జేసిరి.

గత్కారణరూపిణివగు న్రోపరాంబా! నీ కనేక నమస్కారములు, రూప, నామ, జనన, మరణాదులు లేవందున నీవు పురాతనమగుదువు.

వార్ధక్యము లేనందున సదా నేకాకారమైయుందువు. దర్పణ ప్రతిబింబిత వస్తువులకు దర్పణ మాధారమైనట్లు స్వాంతరంగభాసిత అఖండాకారమగు జగత్తున కాధారము నీవేయగుదువు. జడములను జడశక్తి చేతను, జంగమములను చిచ్ఛక్తి చేతను ప్రకాశింపజేయుదు, తటస్థముగ నుండదగిన శక్తి గలదానవగుటచే. సర్వాధారమగుదువు. సాంఖ్యసిద్ధాంతానుసారము జడము వంటి ప్రధాన రూపము గాక సర్వత్రా సత్తామాత్రమైన దృగ్రూపమై యుందువు. నీచే సృజింపబడిన కల్పిత జగత్తునకెల్ల నవ్యమై వానికాధారమగు స్వప్రకాశమగుదువు. యనుచు అనేక విధముల స్తోత్రము జేసి ఋష్యాది దేవతలు, యోపరాంబా, నీవు మాయెదుట కాన్పించనందున, ఏ దిక్కున కభిముఖముగ నమస్కరించెదము.

ఓ పరాంబా! సర్వత్రా నీవే భాసించుటవలన, సర్వదిక్కులయందు నీకు నమస్కారము జేసెదము. మాకు గల ఈ సందియములను దీర్చుమని వేడగా, ఆ గాయత్రి మీ సందేహములను దెల్పుమనెను.

అంత ఋష్యాదులీ క్రింద విధముగ తమ సందేహములను దెల్పిరి అందు (1) నీ పరరూపమేది. (2) పరమైశ్వర్యమెటువంటిది. (3) సుజ్ఞానమేది, (4) ఏది జ్ఞానసాధనమగును. (5) జ్ఞానఫలమేరూపమగును (6) సాధకుడెట్టివాడు, (7) సిద్ధి లక్షణమెట్లుండును. (8) సిద్ధికి అంత్యమేది. (9) ఉత్తమ సిద్ధులెట్టివారు, (10) నీ అపర రూపమెట్లుండును, అనుచు ఋషులు ఒక ప్రశ్నవడుగదలచియు, ఆతురతచే పది ప్రశ్నలడిగిరి. ఇట్లడిగిన మునులకు, గాయత్రి.

# పరతత్వ విమర్శనము

ఓ మునులారా! మీరడిగిన ప్రశ్నలకు సమాధానముగా, సకల శాస్త్రసారమైన యమృతమును మీకిచ్చెద సావధానముగ నాలకించుడు. (1) దర్పణ ప్రతిబింబమునకు బింబమువలె అంతఃకరణ ప్రతిబింబిత జగత్తునకాధారమై సృష్టి స్థితి లయాదులకు కారణమగు స్వరూపమే నాపరరూపము. జగత్తునందు రూప, నామ, శబ్ద, వాచకజ్ఞానమైన స్వప్రకాశ జ్ఞానమేది గలదో, ఆ జ్ఞానప్రతిభ లేదని ఎవ్వరును చెప్పజాలరు. యాజ్ఞానప్రతిభ లేవియడల యుత్తర ప్రత్యుత్తరములుండజాలవు దృశ్య శబ్దాదిజ్ఞాన జాలమెల్లను యాప్రతిభా ధీనమైయుండును. అట్టి జ్ఞానములేని తరుపాషాణాదులకు శబ్దరూపగ్రహణముండజాలదు. త్రికాల విషయపరివర్తనలను గ్రహించునది ప్రతిభయని ఆర్యులు చెప్పెదరు. జగత్తుయందు దృశ్యాకారపరిచ్ఛిన్న విషయములను సర్వదా అనుశ్యూతముగ ప్రకాశింపజేయునది. గాయత్రి యొక్క పరరూపమైన మహాప్రతిభ యగును.

దేశకాల వస్తుపరిచ్ఛిన్నము లేక సర్వవిషయములను, సాధారణముగ గ్రహించునట్టి జ్ఞానమే, యాపరతత్వమగును. నాపరతత్వము చిత్తమునందు ప్రతిఫలించి జ్ఞానముచే ప్రకాశించుచు, ప్రమాతలకందరకు ప్రమేయ రూపమున స్ఫురించుచుండును. దర్పణమందు ప్రతిబింబము యొక్క ఉత్పత్తి స్థితిలయాదులు భాసించునట్లు ప్రతిభాజ్ఞానము నకస్యము గాకయే. జగదుత్పత్తి స్థితులాభాసించుచుండును. ఆ భాసయనగా, ఇంద్రియములకు గోచరించుచున్నను, అంతర్లక్ష్యమైన జ్ఞాన దృష్టియందు శూన్యమగుట, దర్పణమందు బింబము ప్రతిఫలించినప్పుడు మాత్రమే

ప్రతిబింబము గాన్పించునుగాని, పరాశక్తియగు నాస్వతంత్ర మాయాశక్తి వలన జగత్తు చిత్తమునందు సదా, ప్రతిఫలించుచుండును.

కామిలవ్యాది గలవారికి, స్వచ్ఛమగు శంఖము పచ్చగ దోచు విధమున, మాయామోహితులగు అజ్ఞానులకు, మాయాకల్పిత జగత్తునందు సత్యత్వ భ్రాంతి కలుగుచుండును, జ్ఞానులకు ఆభాసరూపముగ భాసించును. కల్పిత శరీరమునందు తానను భ్రాంతియే అజ్ఞానమగును, ఇంద్రియ గోచరమగు జగత్తునందస్థిరభావముగల జ్ఞానులకు ప్రథమమున, చిద్రూపుడగు శివయందు ద్రష్టభావము భాసించును. తత్త్వవేత్తలగు యోగులు, తరంగరహిత సముద్రమువలె అంతఃకరణ తరంగములైన ద్రష్ట-దర్శన దృశ్యాది వికారములగు సర్వవృత్తి విరోధముగల వారగుటచే, కర్తృత్వాది సర్వవృత్తులకు సాక్షియగు చిద్రూపులై ప్రకాశించుచుండెదరు.

ద్వైత, జ్ఞానముగలవారికి, పరశివుడగు నాయందు అనధికప్రేమ (అనన్యభక్తి) దుర్లభమగును. ద్వైతులితరులయందు చూపుప్రేమ స్వలాభము కొరకే యగును. అద్వైతాత్మవేత్తలగు యోగులు, సర్వత్రా చిద్రూపులై ప్రకాశించుచుండుటవలన, స్వపరభేదములేక సర్వసములగుదురు. అట్టి సర్వ సమత్వదృష్టి అద్వైతులగు యోగులకే సంభవమగును. వాచ్యార్థమందద్వైతులమని చెప్పుచు, సేవ్యసేవకాభావముచే, పరశివుని భజించుచుండెడువారు ద్వైతు లనబడుదురు.

తత్త్వవేత్తల భూతభౌతిక, వ్యవహార కల్పిత రూపనామ జగత్తెల్ల నసత్యమైనను, సచ్చిదానందాత్మికమగు తన మాయా విశేషమువలన సత్యముగ సంవిద్రూపముచే భాసించు జగత్తు సత్యమని భావించును. సంవిద్రూపముచే భాసించు జగత్తు సత్యమని భావించు మనస్సు చలించి

విషయగ్రహణము గలదైనపుడు మనోగత జ్ఞానము ఉపాధిసహితమై జగదాకారమును పొందును. ఆ విధమగు నుపాధి సంబంధములేని జ్ఞానమునందు ప్రకాశించుజ్ఞాని ఉన్మనీ (సమాధి) యవస్థయందు నా పరతత్త్వమందు రమించుచుండును. జ్ఞానులుత్తమ, మధ్య, మాధమములను మూడు విధములగు వాసనా ప్రవర్తకులై యుండెదరు. అందుత్తమ జ్ఞాని సదా సమాధియందు అసంగ చిద్రూపుడై ప్రకాశించుచుండును. గావున, వ్యవహార కాలమందును అసంగ చిద్రూపముచే సర్వసాక్షియై ప్రకాశించుచుండును. జ్ఞానికి వ్యవహారదశ యుండదనియు వ్యవహార దశ ప్రతిబంధమనియు తలంచకుము.

ఉత్తమ జ్ఞానికి మనస్సంకల్పము నిశ్చయజ్ఞానము ఏకకాలమునందు ప్రకాశించుచుండును. అట్టి యవధానము (ప్రజ్ఞానము) యోగసిద్ధివలన లభించును. అందువలన అట్టి యుత్తమజ్ఞాని, సర్వ స్వతంత్రుడు. సర్వ వ్యాపకుడు. సర్వసముడునై నావలె సదా ప్రకాశించు అసంగచిద్రూపుడగుచున్నాడు.

మధ్యమ జ్ఞాని అభ్యాసబలమువలన సమాధ్యవస్థను పొందినవాడగుటచే నా యవస్థయందు ఇంద్రియములను ఇంద్రియార్థములను కల్పించు జగత్తును మరచినవాడైనను స్వరూపజ్ఞాన ప్రకాశము సంభవించనందున జగద్విలాస విజృంభితమగు జాగ్రద్దశ ప్రతిబంధకమై, భయావహముగ దోచుచుండును. ఈ మధ్యమజ్ఞానికి శాస్త్రపరిచయము వలన, బ్రహ్మ స్వరూపజ్ఞానము కలిగియున్నను, సమాధియందనుభవ జన్య స్వరూపజ్ఞాన సిద్ధి లభించనందున ఈ జన్మయందు బ్రహ్మానంద ప్రాప్తి లభించదు.

దర్పణ ప్రతిబింబమునకు బింబమువలె, అంతఃకర్ణ ప్రతిబింబిత నామ రూప జగత్తునకెల్ల బింబరూపమైనదే, నా పరరూపమగును. నాచే నిర్మించబడిన, నామరూప ప్రకాశితజగత్తును, శబ్ద స్పర్శ రూప రసగంధా దులచే తెలుసుకొనుచున్న విజ్ఞానముగలదో, అజ్ఞాన ప్రతిభలేదని చెప్పను తలపరు. అట్లు తలంచుట మానవధర్మ మనదగదు. తరుపాషాణా దులకుండునవి తలంచుట నొకవిధముగ గ్రాహ్యమైయుండును. మానవు లట్లుగాక, త్రికాల జ్ఞాన ప్రకాశము గలిగియుండుట ప్రజ్ఞాన లక్షణమని ఆర్యులు చెప్పెదరు. పరిచ్ఛిన్న దృశ్యాకారమగు జగత్తునందు సర్వభూ తాంతర్యామియై సదా అనుస్యూతముగా ప్రకాశించు మహాప్రతిభయే నా యొక్క పరరూపము. దేశకాలవస్తు పరిచ్ఛిన్నములేక సర్వవిషయము లను స్వభావముగ గ్రహించుచుండునట్టి జ్ఞానమే నా పరతత్వ మనదగి యున్నది.

నా స్వరూపమగు జ్ఞానము చిత్తునందు ప్రతిఫలించి జగదాదాకారముగ ప్రకాశించుచూ ప్రమాతల కందరకును ప్రమేయమును కల్పించుచుండును. దర్పణమందు ప్రతిబింబముయొక్క ఉత్పత్తి స్థితి లయాదులాభాస మాత్రముగ ప్రకాశించునట్లు నా ప్రతిభాజ్ఞానము వ్యతిరిక్తము కాకయె జగదుత్పత్తి స్థితులాభాసించుచుండును. ఆభాసయనగా ఇంద్రియములకు దోచుచున్నను అంతర్లక్ష్యమగు జ్ఞానముచే విచారించినయడల శూన్యమగు దాని కాభాసయనబడును. దర్పణమున కవ్యమగు బింబము దర్పణమున కభిముఖమగునపుడు మాత్రము ప్రతిబింబముదోచుచూ దర్పణ బింబములు పరాఙ్ముఖమయినప్పుడు ప్రతిబింబము దోచకుండును. అట్లుగాక పరా శక్తినగు నా స్వతంత్ర మాయవలన జగత్తు చిత్తమునందు సదా ప్రకా శించుచుండును.

స్వచ్ఛమగు శంఖము కామిలదృష్టి దోషముగలవానికి పచ్చగదోచు విధముగ మాయా మోహితులగు అజ్ఞానులకు నా పరతత్త్వము జగత్తున కన్యముగ భాసించినను అజ్ఞానమునశించిన జ్ఞానులకు కద్వైతముగ భాసించును జగదాకారముగ భాసించు జ్ఞానప్రకాశమే నా పరతత్త్వము. అట్టి నా పరతత్త్వము అజ్ఞానులకు ద్వైతరూపముగను జ్ఞానుల కద్వైతముగను భాసించుచుండును. మానసేంద్రియములకు గోచరమగు జగదాకారము దేహ భ్రాంతివలన స్థూల దృష్టిచే ద్వైతముగ దోచుచూ ఇంద్రియాతీత మగు నా పరత్త్వము అజ్ఞానులకు దోచకయుండును. ఇంద్రియ గోచర మగు జగత్తుయందస్థిరభావమును దేహభ్రాంతినివదలిన జ్ఞానులను అసంగ చిద్రూపమగు నాయందు జగదధిష్ఠాన భావము నిశ్చయమగును.

అంతఃకరణ వృత్తి నిరోధముగల యోగులకు నిస్తరంగ సము ద్రమువలె నా పరతత్త్వము స్వయముగ భాసించును. ద్వైత జ్ఞానముగల వారికి నా పరతత్త్వమునందు అనన్య ప్రేమ దుర్లభమగును. ద్వైతులు చూపు ప్రేమ స్వలోభముకొరకె యగును. అద్వైతాత్మవేత్తలగు జ్ఞానులు సర్వత్రా చిద్రూపముచే ప్రకాశించుచుండుటవలన ఉపాధికృతమగు స్వపర బేధములేక సద్వాసములగుదురు. కొందరు ప్రమాణ వచనములచే వాక్యార్థమంద ద్వైతులమని భావించుచూ వాసనా ప్రతిబంధ విచిత్రము వలన సేవ్యశేవకాభావముల ననుసరించి నన్ను భజించుచుండెదరు. నా స్వరూపసిద్ధిగల జ్ఞానులట్లు ప్రవర్తించరు.

పూర్వవాసనా విధులననుసరించి వ్యవహార సిద్ధికొరకు రాజ్యాది కార్యములయందు ప్రవర్తించువారు జనకాదులనియు అనన్యభక్తితత్పరులు

నారదాదులనియు సర్వత్రా తెలిసిన విషయమె. సర్వాంతర్యామియగునేను సర్వేంద్రియములను మనస్సును వాసనా విధులననుసరించి స్వభావ కార్యములయందు ప్రవర్తింపజేయుటకు ప్రధాన రూపమగుచున్నాను. నాయా జ్ఞానుసారము జగత్తుయందు సర్వభూతములు ప్రవర్తించుచుండును. సూర్యచంద్రాది దేవతలు సహితము నా ప్రతిభా జ్ఞానము లేక ప్రకాశింపజాలరు. చిదేకరసమగు నా పరతత్వము వాచామగోచర మగుటచే వ్యవహార సిద్ధికొరకు ప్రమాణములు నాయపరతత్వమును "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ" యను లక్షణముల చేతను లక్షణావృత్తి చేతను అతద్వ్యావృత్తి రూపము చేతను చెప్పుచుండును కాని యాలక్షణములు నాపరతత్వమునకు స్వభావములుకావు. అట్లయిన యడల నాపరతత్వము జగత్తువలె దృశ్యకోటియందు కాన్పించుచూ అస్థిరమైయుండును. గావున వ్యవహార సిద్ధికొరకు శాస్త్రములుపదేశ విధులననుసరించి కల్పితమగు ప్రత్యగాత్మ లక్షణములను వాచ్యార్థముచే వర్ణించుచుండును.

అస్థిరము కానిది సత్యమనియు జడముకానిది జ్ఞానమనియు దేశ కాల వస్తు పరిచ్ఛేదము లేనిది అనంతమనియు వాచ్యార్థముచే చెప్పుచుండుటయె లక్ష్యార్థ హేతువగును. సత్యమగు చితికంటె అన్యమయిన మన సేంద్రియాదులు చితికాదని విషేధించి అంతఃకరణ ప్రతిబింబిత అసంగ చిద్రూపమే యదార్థతత్వమనియు, అయ్యదేనాస్వరూపమనియు నిశ్చయించుట అతద్వ్యావృత్తి యవబడును. ఈ విధముగ జగత్తునందు దోచు నామరూపాదులను విగ్రహించి, జగత్కారణ రూపమగు పరచితి ప్రభయె నాపరతత్వమని నిరూపించి తన సగుణరూపమయిన అపరతత్వమును వినుపించుటకు కారణమగును.

# అపరతత్వ విమర్శనము

అనేక బ్రహ్మాండావరణములకు అవలనున్న సహస్రారమను సుధా సముద్రమందు నవరత్నఖచిత నవఖండాత్మికమైన వివేదికపై కదంబవనాంతర్గతమైన ననేక చింతామణులచే ప్రకాశించు మందిరమున బ్రహ విష్ణు రుద్రేశ్వరులను నాలుగుకోళ్లుగల సదా శివాత్మకమైన శయ్యయందు సర్వజీవుల సర్వావస్థలయందును ప్రేమించదగిన అతి సుందర విలాసముచే సర్వావస్థానుభూతమగు చిద్రూపమైన గాయత్రిరూపమె నా యొక్క రెండవ అపరతత్వము. జీవుయం దనుగ్రహముకొరకు గాయత్రి రూపముగ నాకు యుత్పత్తి చెప్పబడినను ఉత్పన్నరూపములెల్లను సత్యములుగావు. అశ్వరములగు దేహములను దాల్చునట్టి స్వభావముగల నా అప్రధాన రూపముల మరికొన్నిటి చెప్పెద నాలకింపుడు.

అనుగ్రహతిరోధాన సృష్టి స్థితి లయాధికారులగు సదాశివ, విధి, విష్ణు, శంకరులును, గణేశాది దిక్పాలురును, సురపన్నగయక్షకింపురుషాదులును, మరియు ననేకవిధములగు శక్తిపరమైన రూపములెల్లను పూజనీయములైన నా అపరస్వరూపములై యున్నవి. మాయామోహితులగు సామాన్యులు యీ స్వరూపములెల్లను నా తత్వములని యెరుంగరు. భక్తులు యే దేవతను యే కామ్యముతో యుపాసించినను వారివారి కామ్యములను నాయా దేవతలవలన నేనే దీర్చుచుందును. గాని నా కన్యముగ యే దేవతయు ఫలప్రదాత కాజాలదు.

# పరమైశ్వర్యమగు జ్ఞాన లక్షణము

దేశకాల వస్తు భేదము లేక సర్వదా సర్వభూతములయందు ఏకాకారముగ ప్రకాశించుచున్న జ్ఞానమె నా ఐశ్వర్యమనబడును. సూర్య

దీపాది ప్రకాశమువలన జడవస్తువులు ప్రకాశించునట్లు స్వప్రకాశ జ్ఞానము వలన సదా ఖండ జగదాకారముగ భాసించుచుండెదను, ఆ విధముగ సర్వ వ్యాపకమై నా స్వరూపమందు వ్యాపకములేక నేకాకారమై యుందును. జగత్పరిణామము ప్రతిబింబమునందు వ్యాపక మగుటచే నా అద్వయ చిద్రూపమునకు భంగములేదు. అతి దుర్ఘటమగు జ్ఞానైశ్వర్యము సామా న్యుల కగోచరమైయుండును.

ఓ ఋషిపుంగవులారా! సర్వాధారమగు చిన్మాత్రమైన నా జ్ఞానైశ్వ ర్యమును అంతర్దృష్టితో మీరు విమర్శింపుడు. నా యాధీనమగు మాయా శక్తి వలన స్వాత్మజ్ఞానమును మరుగుపరచి అనాది వాసనాసహితమగు సంసార చక్రమును ఉపాదానకారణ మపేక్షించకయె శిష్యభావము ననుస రించి జగద్గురు రూపమైన నావలన ఆత్మతత్వమును గ్రహించి ఆశ్రితులు ముక్తిని పొందుచుండెదరు గురుశిష్యాది సర్వోపాధులయందు సదా ప్రకా శించు చిచ్ఛక్తినైన నేను వ్యవహారమునందు వేర్వేరుగ దోచుచున్నను స్వరూపమునందు ఒక్క రూపముగ ప్రకాశించుచుండెదను.

ఈ విధమగు నా అనంతశక్తులను ఆదిశేషుడైనను వర్ణింపజాలడు. నా జ్ఞానైశ్వర్యమువలన ఆద్యంత రహితము సర్వాపరోక్షము ఇంద్రజాల తుల్యమగు జగద్వ్యవహారము అసత్యమైనను దేహభ్రాంతిగల మానవు లకు సత్యముగ భాసించును.

## సుజ్ఞాన లక్షణము

జగదుత్పత్తి స్థితులకు కారణమగు జ్ఞానము, ద్వైతము, అద్వైతము అనియు పరోక్ష, మపరోక్షమనియు పరా, అపర విద్యలను రెండు విధ

ములగు భిన్నఫలరూపములు గలదైయున్నది. నాయపర విభూతితత్వముల యందుపాసనా జ్ఞానము ధ్యాతృధ్యాన ధ్యేయాకారములచే అందుకు తగిన మన్త్రానుష్ఠాన విధుల ననుసరించి నన్ను ధ్యానించుచుండుట ద్వైతజ్ఞాన మనబడును.

ఉపాసనావిధుల ననుసరించి ఆయాదేవతల యొక్కయు మంత్రముల యొక్కయు భేదమువలన సంభవమగు ద్వైతజ్ఞానము స్వప్నప్రపంచ విషయములు జాగ్రత్తయందు శూన్యమగునట్లు జాగ్రద్వ్యవహార కాలమందు సత్యముగ దోచినను ఉన్మనీయవస్థయందు పారమార్థిక సత్యము కాదు. ద్వైతజ్ఞాన సంభవమగు యుపాసనలు భక్తితత్పరత కొరకు నియమింపబడినవగుటచే ఉపాసకునికామ్యవిధుల ననుసరించి ఫలవంతములగుచుండును. నా విభూతితత్వముల యందు గల ద్వైతజ్ఞానము సత్యాసత్యములను రెండు విధములగుచున్నది. నా యపరవిభూతి తత్వముల నుపాసించుటయే అసత్యమగు ద్వైతజ్ఞాన మనబడును.

సర్వభూతాంతఃకరణ ప్రతిబింబిత అసంగ చిద్రూపమగు నా పరతత్వము నుపాసించుటయే అత్యుత్తమమయిన సాక్షాన్మోక్షకారణమగు అద్వైతజ్ఞానమనబడును అట్లయినయెడల సర్వోత్తమమగు అద్వైతజ్ఞానము ఏల అందరు అనుసరింపరనియందురేని సర్వోత్తమమగు నా పరతత్వాద్వైతజ్ఞానము బహుకాలము శ్రద్ధాభక్తులతో గురూపదేశానుసారము యుపాసన చేయని వారికి సులభముగ లభించజాలదు. దృశ్యజగద్భ్రాంతి (దేహభ్రాంతి) నశించినప్పుడు పూర్వము గురుశాస్త్ర విధులననుసరించి తెలుసుకొన్న స్వరూపజ్ఞానము సర్వావస్థలయందును కేవల చిద్రూపముగ భావించుటయే సుజ్ఞాన మనబడును.

సంకల్పవికల్పాదులతో కూడిన మనస్సు, ఆత్మాభిముఖమై సమాధి యందుండినను, బహిర్ముఖమై వికల్పరహితమగు శుద్ధ చిద్భావానుసంధానము చేయుచున్నట్టి నిర్విశేష జ్ఞానమే సుజ్ఞానమనబడును. నిశ్చలబుద్ధిచే చేయబడు శ్రవణము చేతను సద్విచారమువలనను సంభవమగు దేహాది పరిచ్ఛేదములేని చిదాత్మ స్వరూపజ్ఞానమువలన అజ్ఞానకాల సంభవమగు దేహేంద్రియ మనోవ్యాపారములు తాననుభ్రాంతి నశించును. స్వరూప జ్ఞానదశయందు దృశ్యప్రపంచమునకు తాను సాక్షియై ప్రకాశించుచున్నను సాక్షిత్వము సహితము భాసింపకయున్నను, స్వరూపజ్ఞానము కలిగియుండుట సుజ్ఞానమనబడును. సుజ్ఞానము నిర్మలముగ ప్రకాశించునప్పుడు చిత్ప్రతిబింబిత చితికిని, జగత్తునకును అనన్యభావము దోచుటయే సుజ్ఞానమనబడును.

ప్రళయమారుతము వీచునప్పుడు మేఘరహితమగు ఆకాశమెట్లు నిర్మలముగ ప్రకాశించునో ఆ విధముగ నాస్వరూపజ్ఞానము కలిగినప్పుడు సర్వ సంశయములు నశించి సర్వోత్తమమగు సుజ్ఞానము ప్రకాశించుచుండును. దేహభ్రాంతి రహితమగు సర్వదుఃఖనాశనమే సుజ్ఞానమునకు ఫలమగును. సంకల్పమున కాధారమగు మనస్సువలన జగద్భ్రాంతియు దుఃఖ భయాదులు కలుగును.

దుఃఖభయ రహితమే మోక్షమగును. సూర్యుడుదయించినతోడనే అంధకారము నశించు విధమున అద్వైత చిదాత్మ తత్వజ్ఞానోదయము సాక్షాత్కరించినతోడనే ధనధాన్యారామ జగద్విషయద్వైత జ్ఞానాంధకారము నశించి దుఃఖనివృత్తి కలుగును. అస్థిరమును కల్పితమునగు ఆత్మేతరవిషయాదులు సంభవకాలమందు ఆభాస సుఖమున్నట్లు దోచినను

వినాశకాలమందు దుఃఖదాయకములగుచుండును. గావున అసంగ చిద్రూప మగు నాస్వరూపజ్ఞానమే శాశ్వతమగు మహాఫలమని తెలుసుకొనుడు. త్రిపుటి వ్యవహారములెల్లను నాస్వరూపజ్ఞానకల్పితమేయను సుజ్ఞానము వలన మహాఫలమగు మోక్షము లభించగలదు.

సంకల్పాది మనోవృత్తులకు సాక్షినగు నాస్వరూపజ్ఞానమే సుజ్ఞాన మనబడును. సుషుప్తియందు సంకల్పాది వృత్తులకు నాధారమగు మనస్సు అజ్ఞానావరణమందు జ్ఞానసహితముగ లయించుటచే స్వరూపజ్ఞానములే నందున జీవన్ముక్తికి లభించదగిన సమాధి కానేరదు. నాస్వరూపజ్ఞానమునకు సుజ్ఞానమే కారణమగుటవలన మోహజనితాజ్ఞాన నివారణోపాయముపదే శించు గురువులు శాస్త్రములుపరక్షితములగును. నాయదార్థ తత్వమును పదేశించు గురు, శాస్త్రములు సంభావితములగును గాని తదితరములనర్థ కములగును. సంకల్పాది మనోవృత్తి సాక్షియగు శుద్ధ చిద్రూపమే నా స్వరూపమగును.

జీవులకు అజ్ఞాన సంభవమైన జ్ఞాతృజ్ఞేయాది త్రిపుటి లక్షణమున కాధారమగు నా స్వరూపజ్ఞానము లభించుటకు తదేకపరత్వము ముఖ్య సాధనమగుచున్నది. నాస్వరూపతదేకపరత్వము సుజ్ఞానసిద్ధికి సాధనమ గుచు మోక్షఫలము నొసంగును. మనఃకల్పిత సంసారము దుఃఖమని భావించి మానసేంద్రియ ప్రవృత్తికి సాక్షినగు నాపరతత్వమువందు సదావర మించుచుండుటయే తత్పరత్వమనబడును. యీ తత్పరత్వ తీవ్రతలేని యెడల తదితర సాధనములు బహుళముగనున్నను మహాఫలము సిద్ధిం చదు.

# సాధక లక్షణము

పైన తెలుపబడిన తత్పరత్వసాధనమెంత తీవ్రముగనుండునో అంత తీవ్రముగ మహాఫలమగు మోక్షము సంభవించును. మోక్షమతి సూక్ష్మమై మిక్కిలి సాన్నిధ్యమందున్నను అంతఃకరణ మాలిన్యదోషము వలన అతి దూరస్థమును కాలవ్యాపనము సంభవించును. రాగద్వేషాది మాలిన్యములే బుద్ధి మాలిన్యములనబడును. సంసారాభివృద్ధికి కారణమగు బుద్ధి మాలిన్యము అనేక విధములనుండును. అందు ప్రధానముల జెప్పెద నాకర్ణింపుడు.

1. సంశయము. 2. కామవాసన. 3. బుద్ధి మాంద్యము. ఇంద్రియములకు గోచరము కాని నాస్వరూపము కలదోలేదో అనే సంశయమే సంశయమనబడును. సంశయమునందు విపర్యయము సమనదొకటికలదు. జగత్కారణము ప్రధానమనియు దానికి ప్రధానమగు నాస్వరూపము లేదను నిశ్చయమె విపర్యయ మనబడును. సంశయవిపర్యాత్మకమైన అవిశ్వాసము గల మనస్సు ప్రకాశించుచుండుట వలన తత్పరత్వమునకు ప్రతిబంధకమనబడును. అవిశ్వాసమునకును కుతర్కమునకును నాధారమైన మనఃసంయోగమును విడచిన బుద్ధి సచ్ఛాస్త్రానుసారమగు సుతర్క విశేషమువలన తనయందు ప్రతిఫలించియున్న నాస్వరూపమునందు ఆస్తిక్యము కలుగును.

2. కామాది వికార వాసనగల బుద్ధి నాస్వరూపజ్ఞానమునందు విముఖతనొంది జగదభిముఖమగును. గురువు సముఖమునందు నాస్వరూపజ్ఞానము ప్రత్యక్షముగ జెప్పుచున్నను ప్రపంచవాసనా రూపమగు కామ

వికారముచే స్త్రీ ధన పుత్రాదులయందు లక్ష్యముంచి గురూపదేశ లక్ష్యార్థ మగు నాత్మస్వరూపమునందు పరాయత్త చిత్తముగలవారై అందువలన కామాది దుర్వాసనాంతఃకరణ మాలిన్యముగలవారు సద్విచార శ్రవణము చేసియు చేయనివారే యగుచున్నారు. గావున కామాది దుర్వాసనల కాలయమగు మనస్సును జయించుట (విగ్రహించుట) ప్రథమ కర్తవ్యమగుచున్నది. వాసనా సహితమగు మనోనాశన విధుల రహస్యమును ముముక్షువు సద్గురువు వలన గ్రహించతగియున్నది. కామక్రోధాది చిత్తవృత్తులకే వాసన యనబడును. వాసనాసహితమగు మనస్సువలనే క్రోధలోభాదికామాంకుర ములంకురించును. అందువలన విషయ కామముతోకూడిన మనస్సు ముముక్షువునకు ముఖ్యశత్రువనదగి యున్నది.

కాముకులకు విషయాభావమందు సంభవమగు వైరాగ్యము ప్రసూతి వైరాగ్యమువలె నిష్ఫలమగుటచే దృఢ వైరాగ్యజ్ఞానము సంభవమగుటకు యోగాదిసాధనములచే బుద్ధిని సంస్కారము గావింపవలెను. అట్టి సంస్కారజనితజ్ఞానములేని బుద్ధివలన చేయబడిన సద్విచారము నిష్ఫలమై ఇంద్రియార్థములగు విషయములందు మనోసహితముగ బుద్ధిని బలవంత ముగ నాకర్షించును. యోగాగ్నితప్తసంస్కారము పొందిన బుద్ధివలన ఇంద్రియార్థములగు విషయములందు ప్రతిబంధము నిశ్చయించుటయు దేహపోషణ మాత్రమైన యాహారమును భుజించుటయు యను యమనియ మాది యోగభూమికల నతిక్రమించి క్రమక్రమముగదుర్వాసనలు క్షీణింప చుండును.

3. బుద్ధిమాంద్యము. ఈ బుద్ధిమాంద్యము అనేక జన్మ సంస్కార ములను వాసనా రూపముచే బహుబిట్టముగ వ్యాపించి యుండుటవలన

ఏ సాధనమువలను నివర్తింపని బలవత్తర ప్రారబ్ధమనదగి యున్నది. పురుషార్థ సాధనములన్నింటిని నిరర్థకము జేయును. అట్టి బుద్ధి మాంద్య మను మాలిన్యము నివారించుటకుగాను సద్గురూపదేశానుసారము సహ స్రారవాసినియగు నన్ను యుపాసన యొనర్చి నాస్వరూపజ్ఞానైక్య సిద్ధిని పొందిన వారికి మాత్రము బుద్ధి మాంద్యము నశించి సద్యోముక్తి సంభ వింపగలదు. అంతఃకరణ రూపమగు బుద్ధియందు వాసనాసహితమగు మాంద్యమెంత యధికముగనున్నను యోగమునందుత్తరాంగా ధ్యానము వలన యాబుద్ధి మాంద్యము నశించి సద్యోముక్తి లభించును గాని తదితర సాధనములు సద్యోముక్తికంగములు కాజాలవు. సర్వభూతాంతఃకరణ ప్రతిబింబిత అసంగచిద్రూపమగు నన్ను నిశ్చల భక్తితో సేవింపనివారు తదితర సాధనములచే యంత పట్టుదల గలిగి సాధించుచున్నను విఘ్న బాహుళ్య మధికమగుచుండును. గురూపదేశాను సారము నా స్వరూపము నుపాసించువారలకు సత్సాంగత్యము తత్పరత్వము వాసనానాశము మనో నాశము మొదలగు సాధనములను దయతో సమకూర్చెదరు.

మునివర్యులారా! నా స్వరూపమందు సదా తత్పరత్వమె ముక్తికి సాధనమగుచు. ఈ సాధనముకలవాడే యుత్తమ సాధకుడగుచున్నాడు. మరియు సర్వ పూజితుడును నా కంతరంగ భక్తుడు నగుటచే అతనికి ఫల మపారమై యుండును. అట్టి సాధకుని సిద్ధి లక్షణములు జెప్పెద డాక ర్ణింపుడు.

## సిద్ధి లక్షణములు

జగదాధారమును, సర్వభూతాంతర్యామియునగు అఖండ సచ్చిదా నంద స్వరూపమైన పరచితినగునేను సదా శాశ్వతముగనున్నానను ఆస్తిక్య

బుద్ధి కలిగియుండుటయు అట్టి సర్వవ్యాపియగు అసంగ చిద్రూపమే తానను నిశ్చయజ్ఞానమే సిద్ధి లక్షణమనబడును. అట్టి జ్ఞానసిద్ధిగల యోగి సర్వ మేవిధముగ శరీరమునుండి విడువడిన కుబుసమునందే విధమగు దేహభ్రాంతి నొందుటలేదో ఆ విధముగ, తన సత్తా మాత్రముచే ప్రకాశించు మానసేంద్రియ వ్యాపారములయందు కర్తవ్యముగాని, లక్ష్యము గాని యుంచకుండుటయే సిద్ధి లక్షణమగును.

త్రివిధ, దేహావస్థలకు ఎట్టి సంబంధము లేకయే నా దేహాద్యవస్థలను ప్రకాశింపజేయు అసంగచిద్రూప జ్ఞానసిద్ధి లేకపోవుటయే జీవత్వమనబడును. అట్టి జీవులకు దేహభ్రాంతి కలిగియుండుటచే సర్వదా జన్మ దుఃఖము లనుభవించుచుండెదరు. సర్వ ప్రపంచమును అంతఃకరణ తాదాత్మ్యముచే ప్రకాశింపజేయుచు అఖండాకారమైన, కేవల చిన్మాత్రాసంగ చిద్రూపజ్ఞానమే సిద్ధి లక్షణమగును గాని, అణిమ, గరిమ, ఖేచరత్వ, ఆకాశ గమనాది ఇంద్రజాల విద్యలు, సిద్ధి లక్షణము లనబడవు. శాశ్వతమగు చిన్మాత్రాత్మ జ్ఞానసిద్ధివలన నిత్యానంద ప్రాప్తి కలుగునుగాని, అణిమాది ఐశ్వర్యములవలన శాశ్వతానందము లభించనేరదు. కీర్తి కాములకు అభిమానముగల అణిమాద్యైశ్వర్యములు శాశ్వతానందప్రాప్తికి ప్రమాదములగువిఘ్నములగును గాన, సుజ్ఞానులగు ముముక్షువెప్పుడును నాయా సిద్ధులయందు లక్ష్యముంచడు. జ్ఞానోపాసనయందును ఉపాధి వాసనా భేదములననుసరించి ఉత్తమ, మధ్యమాధములచే, వ్యవస్థలక్షణములు గలిగియుండును. అందువలన, బాహ్య ప్రవృత్తియందు వాసనారూపము ననుసరించి ప్రవర్తించు వ్యవహార కాలమందుగాని, సమాధి కాలమందుగాని, అసంగ చిద్రూపమగు నాయందు చలించని లక్ష్యముగలిగి యుండుటయే జ్ఞానసిద్ధి లక్షణమనబడును.

ఉత్తమ సిద్ధులెవరు, శుద్ధ సత్వముగల బుద్ధి గుణరహితమై నిర్మల జ్ఞానాకారమును పొందినయెడల వ్యవహార కాలమందుపాధి కృత మగు కర్తృత్వము సంభవించనేరదు. కర్తృత్వ రహితమగు వ్యవహా రము ప్రతిబంధము కాజాలదు. ఆ కార్యమువలన, నిర్మల జ్ఞానసిద్ధిగల యోగులు లౌకికవైదికాది వ్యవహారములయందు ప్రవర్తించుచున్నను, తమ యసంగ చిద్రూపమునందు చలించని లక్ష్యము గలవారగుటచే ఉత్తమసిద్ధి గలవారగుచున్నారు. ఏ వ్యవహారమందును కర్తృత్వములేక ప్రవర్తించు యోగికిని, నాకును ఎట్టి బేధము లేనివారగుటచే నాయందు సమాధి కాలమందును వ్యవహార కాలమందును ఐక్యముగనే యుందురు. వ్యవహార కాలమందును, సమాధి కాలమందును, అసంగ చిద్రూ పమగు నా స్వరూపమునందు తదేక పరత్వముంచుటయే ఉత్తమసిద్ధి యన బడును.

ఈ విధముగ నా స్వరూపస్థితియందు తత్పరత్వము త్రివిధావస్థల యందును నేకాకారముగ నుండుట ప్రాకృత సంస్కార విశేషమువల నను సత్పురుషానుగ్రహ విశేషమువలనను సంభవించును. నా స్వరూప జ్ఞానసిద్ధిగల యోగి అంతఃకరణ ప్రతిబింబిత జగత్తును తన కన్యముగ భావించక సర్వసముడై సదా ప్రకాశించుచుండుట యుత్తమ సిద్ధి లక్షణ మనబడును.

ఓ మునులారా! మీ రడిగిన ప్రశ్నలకు యదార్థమగు సమాధాన మును చెప్పితిని. మీరెల్లరు నిశ్చయ జ్ఞానముచే విమర్శించి సంశయ రహితులై శాంతిని పొందుడని శబ్దరూపిణియగు నా పరదేవత యూర కుండెను.

ఓ రామా! అచ్చట మునులందరు బ్రహ్మ విద్యారహస్యములను విని సందేహరహితులై శివాది లోకేశులకు నమస్కరించి తమతమ నివాసము కేగిరి. కావున నీవును యీ బ్రహ్మ విద్యా గీతా రహస్యమును నిశ్చలబుద్ధితో విమర్శించి సంశయ రహితుడవగుమనుచు జెప్పిన గురు వాక్యములను పరశురాముడు వినియు కొంత సంశయము కలవాడై,

ఓ గురోత్తమా! విజ్ఞానసాధనమును గురించియు జ్ఞానులెట్టి కర్తవ్యముతో వ్యవహారసిద్ధిని గాంచెదరను విషయమును గురించియు కలుగు సందేహములను నివారింప వేడుచున్నానని యడుగగా దత్తాత్రేయులు సంతోషించి యీ విధముగ జెప్పెను.

పరదేవతా అనుగ్రహమె జ్ఞానమునకు ముఖ్యసాధనము. అసంగ చిద్రూపమగు గాయత్రియందు తదేక పరిత్వమువలననే దేవతాను గ్రహము సంభవించును. యీ పరచితికి కారణమైన అజ్ఞానము అవిద్యావరణము కలిగినదగుటచే అజ్ఞానావరణ నివృత్తి కొరకు శ్రవణమనన నిధిధ్యాసలచే యీ పరదేవతను సోహంభావ లక్ష్యార్థమున సేవించగా స్వరూప సాక్షాత్కారము లభించును. ఆత్మానుసంధానము బహిర్ముఖోపాసకులకు లభించదు. బాహ్యదృశ్యమున కాధారమగు దృగ్రూపమును అంతర్లక్ష్యముచే నుపాసించు భక్తులకు నతి సులభమగును. జ్ఞానమును అంతఃకరణముద్వారా బహిర్ముఖము కానీయక అంతర్లక్ష్యముచే స్వస్వరూపమును విమర్శించుటయే యోగమనబడును.

త్రికాయములచేతను త్రివిధావస్థలయందును తన సాన్నిధ్యమందు దోచు మాయాకల్పిత జగత్తును దృశ్యముగాను. యీ సర్వముదోచు

దృగ్రూపము చిన్మాత్రుడైన తానుగాను, భావించుచూ నిశ్చలుడైయుం డును. అంతఃకరణ వికారములేని నిర్విశేషజ్ఞానము సామాన్యుల దృష్టికి గాని మనస్సుకుగాని గోచరముకాదు. జ్ఞానులకు మాత్రమే తెలియగలదు. అజ్ఞానులు బాహ్యమందు బాహ్య లక్షణములను అభినయించుచూ, అంత ర్లక్ష్యమందు అప్రకీర్తికాములై అజ్ఞానగ్రంధి ప్రకోపము గలవారగుటచే జ్ఞానసిద్ధి ఎఱుంగజాలరు. ప్రధాన శక్తిచే జరుగబడు ప్రవృత్తియందు సాక్షిరూపుడై చూచుచుండునుగాని ప్రధాన తత్వముచే దోషు కర్తవ్యమును తాను పొందక నిర్వికారుడై ప్రకాశించుచుండును. సూక్ష్మదృష్టిగల జ్ఞాని ప్రధానతత్వ ధర్మమగు వ్యవహార దోషములను విమర్శించక సర్వాధార మగు తన స్వరూపమందే లక్ష్యముంచును.

ఏ జ్ఞాని వాసనాసహితమగు ఏవిధమగు నుపాసనయందు జ్ఞానసిద్ధి లభించునో ఆవిధమగు యుపాసనా రూపము కొంతకాలము నిలచియుండుట ఆచారమై యున్నది. నిర్విశేష జ్ఞానములేని కొందరు సమాధి కాలమందు ఏ విధమగు ప్రవృత్తి లేకయున్నను వేచబడిన విత్తనములు అంకురించని విధమున సమాధి సంస్కార గతమగు కర్మలు ప్రతిబంధమును కలి గింపజాలవు. మధ్యమ జ్ఞానులు దేహకృత కర్మలయందు సదా సాక్షి రూపులై ప్రకాశించుటయందు పొరబాటు యుండజాలదుగాన దేహతా దాత్మ్య ప్రతిబంధకమెప్పుడునూ యుండజాలదు. అట్టి తదేక పరత్వము వలన సాక్షిత్వము నిలచియున్నను ప్రతిబంధము యుండజాలదు. ఉత్తమ జ్ఞానికి దేహమందును దేహ ధర్మములందును సాక్షిత్వములేని అసంగుడ గుటవలన దేహమును దేహ వ్యాపారమును సాక్షియుగాక సద సత్తుల కతీతుడయి నేకరూపముగ ప్రకాశించుచుండును.

మధ్యమజ్ఞానిగల యోగియె వాసనా సహితమగు రాజ్యాది వ్యవహారములయందు జ్ఞాని సిద్ధి పర్యంతము ప్రవర్తించుచుండును గాని, జ్ఞానసిద్ధి లభించిన యుత్తమజ్ఞాని శూన్యమగు జగత్తునందు సాక్షిత్వము నంగీకరించడు. వాసనా సహిత బుద్ధ్యపాది భేదమువలన ఉత్తమ, మధ్యమాధమ, జ్ఞానభేదములు కలగుచుండును. ఈ జ్ఞానభేద లక్షణము ను గురించి ఒక పూర్వకథ దెల్పెద నాలకింపుము.

పూర్వకాలమున యిపాశా నదీతీరమందు అమృత నగరమును పాలించు రత్నాంగదుడను రాజునకు రుక్మాంగద హేమాంగదులనుయిరువురు కుమారులు గలరు. పితృభక్తి గల వారిద్దరిలో రుక్మాంగదుడు సకల శాస్త్ర పారంగతుడయ్యెను. హేమాంగదుడుత్తమజ్ఞాని యయ్యెను. వారిరువురు వసంతకాలమున సేనా సమేతులయి వేటకుబోయి మహారణ్యమునందనేక వ్యాఘ్రాది మృగముల జంపి క్షుత్పిపాసా చిత్తులై యొక మడుగు దరి జొచ్చిరి. దాని యాపలియొద్దున ఒక మఱ్ఱిచెట్టుమీద సకలశాస్త్ర సారజ్ఞుడగు నొక బ్రహ్మ రాక్షసుడు నివాసమేర్పరుచుకొని దాహబాధ జలమును గ్రోలయా మడుగువద్దకు వచ్చు మానవులతో శాస్త్రార్థ రచనచేసి అందోడిపోయినవారిని మ్రింగుచు కాలము గడుపుచుండెను. యీ సమాచారము చారులవలన రుక్మాంగదుడువిని వాదమందు కుతూహలముగలవాడయి తమ్మునితోగూడ యా మఱ్ఱివద్దకు బోయి యా బ్రహ్మ రాక్షసునితో వాదమున కంగీకరించి వాదమునందోడి యా బ్రహ్మరాక్షసునికి పట్టుబడగా వాని తమ్ముడగు హేమాంగదుడు యా రాక్షసుని జూచి నేను వాని తమ్ముడను. నన్నుగూడ జయించి మాయిద్దరి నొకసారి తినుమని చెప్పగా యా రాక్షసుడిట్లనియె:

నేను చాలా దినములనుంచి ఆహారములేక యుండుటచే ఆకలిచే బాధపడుచుంటిని. గాన ముందు నీనివి భక్షించి కొంత ఆకలిని దీర్చుకొని తర్వాత నిన్ను వాదమున నోడించి నీవలన తృప్తి బొందుదునని తలంచితిని. గాని ఒకప్పుడు దేవరాతుడను వశిష్ఠుడువచ్చి వాదమున నాతో యోడి భక్షింపబడుచూ ఇట్లని శపించెను.

ఇటుపిమ్మట మనుష్యులను నీవు తిందువేని నీ ముఖము కాలిపోవునని నాగ్రహముచే బలుకగా, అందులకు నేను భయపడి ఇకమీదట నా జీవితమెట్లని ఆయనను ప్రార్థింపగా, అనుగ్రహముగల దేవరాతుడు కరుణించి వాదములో నోడినవానినే భక్షింపుమని జెప్పెను. గావున ప్రస్తుతము వాదమునందోడిన నీతనిని భక్షించి పేదతీర్చుకొని తర్వాత నిన్నుజయించి భక్షించుదుననగా; హేమాంగదుడు,

రాక్షసోత్తమా! నీ యాహారముకొరకు ప్రస్తుతము తయారైయున్న మా అన్నగారి శరీరమునకుబదులు మరే స్వరూపము నిచ్చిన నీవు తృప్తి జెందెదవో చెప్పుము. దానిని నీకిచ్చి పేదదీర్చెదను. అన బ్రహ్మరాక్షసుడు, రాజపుత్రా! నేనితని విడచినయెడ నేను భుజించదగిన మరియొక వస్తువు లేనేలేదు. అయినను నాకొక ప్రతిజ్ఞ గలదు. నేనడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పితివేని నీ అన్నను విడుతునని చెప్పగా, హేమాంగుడందులకు సమ్మతించి యా ప్రశ్నలడుగుమని కోరెను.

పరశురామా! వారిరువురి సంవాదమును జాగ్రత్తగా వినుము.

ప్రశ్న:- ఆకాశముకంటె విశాలమైనది, పరమాణువుకన్న చిన్నదేది? దాని రూప మెట్లుండును? ఎక్కడ యుండును?

జవాబు:- ఆకాశముకన్న పెద్దదియు, పరమాణువుకన్న చిన్నదియు చిత్తమే యగును. అది స్ఫురణరూపము. అవన్యముగ ఆత్మ యందే యుండును.

ప్రశ్న:- ఆ చిత్త మేక మేకదా? ఏకమయినయెడ స్థూలసూక్ష్మాదిభేద మెట్లగును? స్ఫురణ మననేమి? ఆత్మయన నెద్ది?

జవాబు:- ఆ చిత్తము సకల భూతములకు కారణమగుటచే సర్వవ్యాపక మయినను దేహముయొక్క స్థూల సూక్ష్మాది భేదముల ననుస రించి నానారూపము గలదగుచుండును చిత్ప్రతిబింబితజ్ఞానమె స్ఫురణమగును. చిత్ప్రతిబింబిత చితియె ఆత్మయగును.

ప్రశ్న:- ఆ చిత్తును తెలుసుకొనుటకు సాధనమేమి? తెలియుటచే ఫల మేమి?

జవాబు:- ఆ చితిని తెలుసుకొనుటకు సాధనము నిర్మలమగు బుద్ధి జ్ఞాన సంభవమగు తదేక పరత్వము. అజ్ఞానమువలన జనన, మరణ రూప సంసారభయము నివారణయగును.

ప్రశ్న:- బుద్ధి యననేమి? తదేక పరత్వ మెట్టిది? జన్మయన నెట్టిది?

జవాబు:- పూర్వోక్త అవ్యక్తాది జడశక్తిచే నావరింపబడిన చితియె బుద్ధి యనబడును. అసంగ చిద్రూపమె తానను నిరంతరాభ్యాసము తత్పరత్వమనబడును.

ప్రశ్న:- చితి ఏ కారణముచేత అనుభవయోగ్యము కాదు? ఆ చితిని పొందెడి యుపాయమేది? జన్మ మెట్లు కలుగును?

జవాబు:- సద్విమర్శనా జ్ఞానము లేకపోవుటచే చిత్స్వరూపము అనుభవ యోగ్యము కాకుండును. జన్మాంతర సుకృత కర్మవిశేషము వలన కారణాంతరముల నపేక్షింపకయె నిర్మల జ్ఞానముచే పొందదగును. కారణ శరీర ధర్మమైనకర్తృత్వాది ధర్మమువలన జన్మము సంభవించును.

ప్రశ్న:- అవివేక మననేమి? ఆత్మ ఎట్టిది? కర్తృత్వాభిమానము దేనికి జెప్పబడును?

జవాబు:- క్షేత్ర క్షేత్రజ్ఞుల యావరణమును నిరూపింపజాలక యా రెంటి నైక్యాభానమె అవివేక మనబడును. సత్పదార్థమైన ఆత్మను తెలుసుకొనుటకు మరియొక సత్పదార్థము లేనందున ఆత్మను తెలుసుకొనదగినది ఆత్మయే యని తెలుసుకొనుము. అసత్పదార్థములగు ఆత్మేతరము లన్నిటిని తాను కావని నిషేధించు జ్ఞాన ప్రకాశమైనదే ఆత్మ. దృశ్యమగు జగత్తును దృగ్రూపముచే ప్రకాశింపజేయు ప్రత్యగ్రూపమె ఆత్మ యనబడును. యా ప్రత్యగ్రూపము దృశ్యమునెల్ల తాను కావని నిషేధించుచూ దృగ్రూపముచే, తనను, అన్యమును, తెలియదగిన ప్రజ్ఞాన రూపమె ఆత్మ యనబడును. క్షరపురుష రూపమగు అహంకారోపాధి సంస్కారజ్ఞానముయొక్క ప్రకాశమె కర్తృత్వాధ్యభిమాన మనబడును.

ప్రశ్న:- అవివేక మెట్లు నివర్తించును? యా అవివేకమున కేదికారణము? ఆ కారణమెట్లు సంభవించెను?

జవాబు:- సదసద్విమర్శనముచే అవివేకము నశించును. ఆ విమర్శన

ఆభాస జగత్తునందలి వైరాగ్యమునకు కారణమగును. భ్రాంతి రూపమగు జగద్విషయములయందు దోషదృష్టియె దానికి కారణము.

ప్రశ్న:- సద సద్విమర్శనమనునేది? వైరాగ్య మనునెట్టిది? దోషదృష్టి యెట్లుండును?

జవాబు:- దృగ్దృశ్య సంబంధము వాని స్వరూపములను సద్విభాగము లుగ జిజ్ఞాసచేయుటయె సద సద్విమర్శనమనబడును. దృశ్య పదార్థములయందు అభావము కలిగియుండుట వైరాగ్య మన బడును. దృశ్య జగత్తునశ్యమయిన దగుటచే సర్వము దుఃఖ దాయంమగునను నిశ్చిత బుద్ధియె దోషదృష్టి యనబడును.

ప్రశ్న:- అట్టి విమర్శనము ఏ సాధనచేత కలుగును? ఆ సాధన దేని వల్ల కలుగును? ఆ సాధవాంతరము లెట్లు సంభవించును?

జవాబు:-పరదేవతానుగ్రహమువలన సద సద్విమర్శనము కలుగును. భక్తి చే దేవతానుగ్రహము సంభవించును. పరదేవతానుగ్రహ భక్తి కి సత్సాంగత్యము సాధనమగును.

ప్రశ్న:- దేని పరదేవత యనదగును? భక్తి యననేమి? సత్పురుష లెట్టి వారు?

జవాబు:- అసంగ చిద్వ్యాపిణియగు గాయత్రియె పరదేవత. యా చిద్వా మునందనన్య భక్తి చె ఉపాసించుటయె భక్తి యగును. శాంతో దాంతాలు కలిగి లోకకళ్యాణమును కోరువారు సజ్జనులనబడు దురు.

ప్రశ్న:- సదా భయ మెవరికి యుండును. (దుఃఖము కలవాడెవ్వడు ?) దైన్య మెవ్వరియందుండును?

జవాబు:- ధనవంతునకు సదా భయముండును. కుక్షింభరత్వము కలవాడు సదా దుఃఖపడుచుండును. ఆశాపిశాచ మావహించినవాడు సదా దైన్యము గలవాడగును.

ప్రశ్న:- నిర్భయుడెవడు? దుఃఖరహితు డెట్టివాడు? దైన్యము లేనివా డెవడు?

జవాబు:- అంతఃకరణ ప్రతిబింబిత అసంగ చిద్రూపుడగు జ్ఞాని భయ రహితుడగును. మనోలయముచే అంతఃకరణ వృత్తులకుసాక్షియై చలించని యోగికి దుఃఖము సంభవించదు. అసంగ చిద్రూప జ్ఞానికి దైన్యములేదు.

ప్రశ్న:- లోకమునకు తెలియబడని దుర్లక్షుడెవడు? విదేహు డెట్టివాడు? ప్రవృత్తియందుండియు నిష్క్రియుడెవడు?

జవాబు:- జీవన్ముక్తుడు లోకమునకు దుర్లక్షుడగును. దేహాభిమానములేని జీవన్ముక్తుడు దేహము కలవాడైనను విదేహుడనబడును. ప్రవృత్తిగల దేహమునం దభిమానములేని జీవన్ముక్తుడు నిష్క్రియుడగును.

ప్రశ్న:- లోకమునందుండునది ఏది? లేనిదేది? సంభవింపనిదేది?

జవాబు:- సదా ప్రకాశించునది చిదృగ్రూపమగును. లేనిది దృశ్యమన బడును. శూన్యమగు దృశ్యమందలి వ్యవహారము అందలి ఫలము పారమార్థిక సత్యముగ సంభవించునది కాదు.

అని హేమాంగదుడు చెప్పగా బ్రహ్మరాక్షసుడు తిరిగి ప్రశ్న చేయక యూరకుండెను. అది గని హేమాంగదుడు మా అన్నగారిని విడి పింపుమని కోరగా, యా రాక్షసుడు సంతోషించి దుర్మాంగదుని విడుచుటయే గాక తాను శాపవిముక్తుడై పూర్వపు బ్రాహ్మణుడయ్యెను. అంతట రాజకుమారులిరువురు యా బ్రాహ్మణునిజూచి మీ రెవరని అడుగ యా బ్రాహ్మణుడిట్లని చెప్పెను.

ఓ రాజకుమారులారా! మగధదేశమందు సకలశాస్త్రపారంగతుడగు వసుమంతుడను బ్రాహ్మణుడను. యా రాజసభలో అనేక విద్వాంసులను వాదమునందు జయించి నా అంత పండితుడులేడని మిగుల గర్వించితిని.

ఇట్లుండ నొకనాడు యా రాజసభకు పరావరజ్ఞుడు శాంతుడనగు అష్టకుడను మునితోకలసి బ్రహ్మ విద్యయందు కేవల శుష్కతర్కముచే వాదించి కేవల యుక్తులచే యా మునిని యాక్షేపించితిని. ఆయన చేసిన వాదము శాస్త్ర సిద్ధాంత సమ్మతమైనను శాంతుడగు యాముని నాయందుపేక్షించెను. గాని ఆయన శిష్యుడగు కాశ్యపుడనువాడు సభనుండి లేచి కోపముతో మండిపడుచూ, ఓరీ మూర్ఖా! శాంతుడగు మా గురువును శుష్కతర్కముచే వాదించి నాక్షేపించితివి గావున నీవు బ్రహ్మ రాక్షసుడవగుమని శపించెను. అందుకు నేను భయపడి అష్టకమహాముని శరణుజొచ్చితిని ఆ మహాత్ముడు నాయందు కరుణ గలవాడై శాపవిముక్తికి తగిన యుపాయము నీ విధముగ జెప్పెను.

నీవు నన్ను అడిగిన ప్రశ్నలకు నేనేవిధమగు సదుత్తరముల నిచ్చితినో ఆ విధముగ మరల నీవు అడిగినప్పుడు నేను జెప్పిన విధమునఎవరి

వలన నీకు జెప్పబడునో వారివల్ల నీకు శాపవిమోచనమై మరల నీవు బ్రాహ్మణత్వమును పొందుదువని అనుగ్రహించెను.

రాజపుత్రా! నీ దయచేత నేను శాపవిముక్తుడనైతిని. నీవు మహత్తరమగు జ్ఞానివి. నాకట్టి సుజ్ఞానము నుపదేశింపుమని వేడగా హేమాంగదుడు వానికి నమస్కరించి ప్రజ్ఞాన లక్షణములను సద్విధానముగ బోధించి సేనలతో గలసి అన్నదమ్ములిరువురు తమ నగరమునకేగిరి.

ఓ పరశురామా! నీ సందేహములకు నీ కథయందుగల ప్రశ్నోత్తరములు సర్వ సందేహములను తొలగించగలవని దత్తాత్రేయ గురువులానతిచ్చిరి.

19వ అధ్యాయము సమాప్తము.



# ఇరవదవ అధ్యాయము

హేమాంగదునకున్నూ బ్రహ్మ రాక్షసునకును జరిగిన సంవాద మైన బ్రహ్మ విచారము పరశురాముడు దత్తాత్రేయ గురువువలన విని.

అయ్యా! శాపవిముక్తుడైన బ్రహ్మరాక్షసుదు వసుమంతుడను బ్రాహ్మణ రూపము దాల్చి హేమాంగదుని స్తోత్రముచేసి నీవు మహాను భావుడవు గావున. బ్రహ్మ విద్యా రహస్యమును బోధింపుమని వేడగా హేమాంగదుడు బోధించిన బ్రహ్మవిద్యయందలి ఉత్తమ జ్ఞాన లక్షణము లను తిరిగి నాకొక పర్యాయము బోధించి నన్ను కృతార్థునిజేయ వేడు చున్నాననగా. దత్తాత్రేయ గురువర్యు లనుగ్రహించి ఈ విధముగ జెప్ప నారంభించెను.

వసుమంతుడను బ్రాహ్మణుడు హేమాంగదునితో రాజపుత్రా! నేను పూర్వము అష్టక యోగీంద్రుని వలనవిన్న యంశములను యథావిధిగ, మరల నీవలన విని ఆనందముచే పరమార్థ తత్త్వమును గ్రహించితిని గాని తత్త్వవేత్తవగు నీవీ సైన్యముతో వేటకు వచ్చుటయు సప్తాంగ లక్షణ ములతోగూడిన రాజ్యమేలుచుండుటయు హాస్యాస్పదముగ దోచుచున్నది. ప్రకాశాంధకారము లొకచోట నుండజాలనియట్లు ప్రవృత్తి లక్షణము లొక చోట నుండజాలవని తోచుచున్న నా సందేహమును నివారింపుమనికోరగా హేమాంగదుడిట్లు చెప్పెను.

ఓ బ్రాహ్మణోత్తమా! మీ కింతవరకు దేహభ్రాంతి నివర్తించి బ్రహ్మ జ్ఞానోదయమైనట్లు తోచుటలేదు. జ్ఞాన మేకరూపమును సర్వవ్యా పకమునగుటచే చిద్రూపాత్మ జ్ఞానమునకును వ్యవహార జ్ఞానమునకును

విభాగముగ నుండనేరదు. జ్ఞానోపాధియగు బుద్ధియుండుట సంభవించినను అజ్ఞాన నివర్తి కాలమందు బుద్ధి జ్ఞానాకారము గలదగుటచే అఖండమును సర్వవ్యాపకమును సర్వశక్తియుతమై నేకాకారముగ ప్రకాశించును. అట్టి జ్ఞానలక్షణ మెరుంగక, ఉపాధిసహిత జ్ఞానమననుసరించి పరచితి జ్ఞానమునకును, వ్యవహారమైన, ప్రవృత్తి జ్ఞానమునకు భేదముగలదని బుద్ధిచే నిశ్చయించుచున్నారు. అట్లయినయెడల వ్యవహార, ప్రాతిభాసిక జ్ఞానప్రకాశములు శూన్యములైనట్లు పారమార్థిక జ్ఞానము శూన్యము గావలసియుండును. అట్లయినయెడల బ్రహ్మత్వసిద్ధికి జానము, ప్రధానసాధనమని చెప్పు ప్రమాణములు నిరర్థకములగును.

దీపముయొక్క వెలుతురు ఎన్నివస్తువులను ప్రకాశింపచేయుచున్నను నొక వస్తువుయొక్క దోషము మరియొక వస్తువునకుగాని యా సర్వ వస్తువులను ప్రకాశింపజేయు వెలుతురునకుగాని యా వెలుతురునకాధారమగు దీపమునకుగాని, సంభవించనియట్లు త్రివిధావస్థల నుందును జ్ఞాన ప్రకాశకములగు సర్వవిషయ దోషములు జ్ఞానమునకుగాని జ్ఞాన ప్రకాశమగు పరచితికిగాని యే విధముగను అంటనేరవని గ్రహించుము. సంకల్ప ప్రకాశమగు జగత్తును అందలి అవస్థాత్రయ వ్యవహారములును సర్వాంతఃకరణ వ్యవహారములకు కారణమగు అఖండ జ్ఞానమునకు ప్రతిబంధమును, మాలిన్యమును కలిగించ జాలవు. వ్యవహారమందును, నొక వ్యవహారజ్ఞానము మరియొక వ్యవహారజ్ఞానమును బాధించజాలని యట్లు ప్రవృత్తిజ్ఞానము, నివృత్తి జ్ఞానమును బాధించజాలదు గాని ఆత్మవేత్తకు పరమార్థ సత్యజ్ఞాన ప్రకాశమగు చిద్రూపము శాశ్వతముగ ప్రకాశించును.

ప్రవృత్తిపరమగు ప్రాతిభాసిక లౌకికజ్ఞాన ప్రకాశ జగచ్చిద్రూప ములశాశ్వతముగదోచును. రజ్జువునందు సర్పభ్రాంతి బుద్ధియందు దోచు నట్లు వ్యవహారజ్ఞానమునకు బ్రహ్మజ్ఞానమునకుదోచు పృథక్భావము బుద్ధి లక్షణముగాని జ్ఞాన లక్షణముకాదు. దర్పణ ప్రతిబింబాది విషయములు జ్ఞానా జ్ఞానులకు సమమైయున్నను అందలి సత్యాసత్యత్వ నిశ్చయజ్ఞానము మాత్రము వేర్వేరు లక్షణములుగలదైయుండును. చిద్రూప జ్ఞాన ప్రకాశ జగద్వ్యవహారమెల్ల నసత్యమని భావించిన నిర్మలజ్ఞానమే అంతఃకరణ మాలిన్య దోషముగల అజ్ఞానికి సత్యమని దోచునట్టి భ్రాంతి యగును. యా భ్రాంతి ఉపాధి సంభవముగాని జ్ఞానదోషముగాదు. వ్యవహారము ఉపాధి కృతమగు సవిశేషముగాని, నిర్విశేష జ్ఞానము కానేరదు చిద్రూప జ్ఞానము మాత్రము ఉపాధిరహిత నిర్విశేషజ్ఞాన మనబడును. ప్రాతిభాసి కాది లౌకిక వ్యవహారజ్ఞానము వాసనాభ్యాస ప్రకాశమగుటచే పారమార్ధ జ్ఞాన ప్రకాశమువలన సర్వ సందేహములు ప్రతిబంధములు నశించ గలవు. దేహభ్రాంతి నివారించినయడల వాసనా, మనోనాశము సంభ వించి, నిర్మల జ్ఞానము ప్రకాశించును గావున అఖండ చిద్రూపజ్ఞానము ఉపాధిరహితమై నేకాకారముగ ప్రకాశించునపుడును బుద్ధ్యుపాధి సహి తమై వ్యవహార లక్షణమగు ప్రవృత్తియందున్నను ప్రవృత్తి లక్షణముల కాధారమగు జ్ఞానమునకుగాని, జ్ఞాన ప్రకాశమగు పరంజ్యోతిగాని, ఎట్టి ప్రతి బంధము సంభవించదు.

కేవల చిదాత్మ జ్ఞానసంభవమగు తదేక పరత్వము సంభవించి చతురావస్థలయందును అసంగచిద్రూపులై ప్రకాశించుయోగులు (జ్ఞానులు) ప్రాకృత ప్రతిబంధమగు సంచిత మెంత యపారముగనున్నను, జ్ఞానా

గ్నిచే దగ్ధమగునుగాని బంధము కాజాలదు. సంకల్పాదులకును ప్రాకృత వాసన యాపాదించుటకును నాధారమగు మనస్సగుటవలన, వాసనాసహిత సంకల్పాది మనోవృత్తులకు సాక్షియైన తన అసంగ చిద్రూప తత్వరత్వ మందు లక్ష్యముగల యోగికి, సర్వ ప్రతిబంధ విముక్తియగుటకెట్టి సందియమును లేదు.

ఓ బ్రాహ్మణోత్తమా! యీ విధముగ పారమార్థిక సత్య వ్యవహార సత్యత్వములను జ్ఞానదృష్టితో విచారించినయడల సర్వ సందేహములు నివారించగలవు. విప్రోత్తమా? సర్వజీవులకును ఆగామి సంచిత ప్రారబ్ధ ములను త్రివిధ వాసనా ప్రతిబంధములు సంక్రమించి యుండును. అందు ప్రారబ్ధమను సంచిత విశేషమువలన ప్రస్తుత దేహము అనుభవ యోగ్య ముగ ప్రవృత్తమగుచుండును. యా ప్రారబ్ధము కర్తృత్వ సహితమగు జీవభావనచేగాని, అకర్తృత్వరూపమైన ఈశ్వరభావనచేగాని అనుభవ మగుచుండును.

దేహతాదాత్మ్యముగల జీవులకు అనుభవ యోగ్యముగాని, అంతః కరణ సాక్షియగు అసంగ చిద్రూప ప్రకాశజ్ఞానము యోగికి యెంతటి ప్రారబ్ధమైనను సంకుచితమై అప్రకాశకమగును సంచితమను ప్రతిబం ధము తత్త్వవిచారముచే నశించును. అగామియను ప్రతిబంధము దూషణ భూషణాది కర్మదోషము లారోపించువారికి సంక్రమించుటచే నివర్తిం చును. అజ్ఞాన జనబోధార్థము ప్రమాణనిర్మిత త్రివిధ ప్రతిబంధములు ఆత్మజ్ఞాన యోగులకు ప్రతిబంధరహితములై దగ్ధమగుచుండును. నాటకమందు స్త్రీ వేషమును ధరించిన పురుషుడు కథానుసారము సంభవ మగు సుఖ దుఃఖాదు లనుభవించుచున్నట్లు నటించినను తన స్వరూప జ్ఞానమునందు భ్రాంతియుండనట్లు నిర్విశేష జ్ఞానసిద్ధిగలయోగి స్వస్వ

రూప లక్ష్యసిద్ధిగలవాడగుటచే ఆభాస జ్ఞాన ప్రకాశమగు జగద్వ్యవహార ములయందు యుక్తానుసారము కర్త వలె భోక్త వలె నటించినను, పారమార్థిక స్వరూప జ్ఞాన లక్ష్యమందు చలించక యుండును. పరులకు సంభవమగు సుఖ దుఃఖాదులను తాననుభవించుచున్నట్లు నటించినను తనకు స్వయముగలేనట్లు అంతఃకరణ మాయా కల్పిత సుఖదుఃఖాదులను యోగి తాననుభవించుచున్నట్లు పరులకు దోచినను స్వరూపజ్ఞానసిద్ధి గలవాడగుటచే ఏ విధమగు వికారమును ప్రతిబంధమును లేనివాడగుచున్నాడు. ఇంద్రజాల కల్పిత వ్యవహార విచిత్రములను బాలురవలె పెద్దవారు సహితము చూచుచు భ్రాంతిని పొందనియట్లు అంతకరణ ప్రతిబింబిత జగద్వ్యవహారములయందు అజ్ఞానులవలె జ్ఞాని ప్రవర్తించుచున్నను తత్త్వవేత్త కల్పిత జగద్వ్యవహారములయందు సత్యత్వ భ్రాంతిని కర్తృత్వమును పొందడు.

గావున అసంగచిద్రూప జ్ఞాన యోగసిద్ధిగల యోగి పూర్వవాసనా రూపమగు లౌకిక వైదికాది జగద్వ్యవహారములయందతి నిపుణతగా ప్రవర్తించి వ్యవహారసిద్ధి గాంచుచున్నను ఆత్మజ్ఞానసిద్ధియందెట్టి ప్రతిబంధము లేనివాడే యగుచున్నాడు. గావున నిర్మల బుద్ధిచే జ్ఞానలక్షణమును విచారింపుమని దత్తాత్రేయులు బ్రాహ్మణ రాజపుత్రుల సంభాషణను పరశురామునకు వినిపించగా,

ఓ గురూత్తమా! విజ్ఞాన లక్షణముమ శ్రవణము చేసినకొలదీ, తనివిదీరక, యీ శ్రవణానంద సుఖమునే గోరుచున్నది గావున, మరి యొకతరి తాము నాయందనుగ్రహించి యీ జ్ఞాన రహస్యములను వినిపింపుమని వేడగా, దత్తాత్రేయులానందించి చెప్పుచున్నారు.

# విజ్ఞానసార సంగ్రహము

చరాచర జగత్తు యా పరచితి యొక్క స్వతంత్ర మాయాశక్తి వలన, సృష్టి స్థితిలయాదులచే ప్రకాశింపుచుండును. యా చిత్ప్రకాశమగు గాయత్రియను చితి జడమగు చిత్తముకంటె విలక్షణమై, స్వప్రకాశ జ్ఞాన రూపమైయున్నది. అసంగ చిద్రూపమగు గాయత్రి స్వప్రకాశజ్ఞానము అహంత, ఇదంత యను రెండురూపములచే ప్రకాశించుచుండును. అందు అహంతయను జ్ఞానము ఉపాధి రహితమగుటచే స్వప్రకాశ జ్ఞానమగును. ఇదంతయను ఉపాధి సహితజ్ఞానము అంతఃకర్ణ ప్రతిబింబిత ఆభాసదృశ్య రూప జగత్తును ప్రకాశింప జేయుచుండును. అహం, ఇదంబను ద్వివిధ ములుగ ప్రకాశించునట్టి స్వభావము గలదగుటచే జగదాధారమగు చున్నది.

ఈ విధముగ త్రికాయములచే జగత్తును ప్రకాశింపజేయుచుండు టచే గాయత్రియనదగియున్నది. శిష్యులకుపదేశసిద్ధికొరకు గాయత్రియను నామము వ్యవహారయోగ్య మగునట్లు కల్పించబడినను దృశ్య జగత్తున కవ్యమగు దృగ్రూపమైన పరాశక్తి యనబడును. ఈ పరచితి మాయా ప్రతిబింబితమైనను ఏ విధమగు మాయాసంబంధము లేకయే జగద్వ్యాప కమై ఇదంతయను దృశ్యరూప మగుచున్నది. అంతఃకర్ణ వ్యాపక దృశ్య సంభవమగు జగత్తున కాధారము అహంతయగు దృగ్రూపమే యగును. ఈ యహంతా జ్ఞానము అంతఃకర్ణ వ్యాపకమై ప్రకృతి కభిముఖమైనప్పుడు పరిచ్ఛిన్నము గలదై జగదాకారముగ పరిణమించును. పశ్చిమాభిముఖము గలదై శుద్ధ చితియందు లయించినప్పుడు పూర్ణాహంత, యనబడును.

ఈ విధము యీ పరచితి. మాయాశక్తి యను స్వతంత్ర జ్ఞాన మహిమవలన, జ్ఞాన, ఇచ్ఛా, క్రియాది అనంతశక్తులు గలిగి, దర్పణ ప్రతిబింబితాభాస రూపముల చందమున. జగద్రూపముగ నాభాసించు చుండును గాని పరిణామ, పరిస్పందాది. ధర్మముల నొందక, సదా నేకాకారముగ ప్రకాశించుచుండును, జగత్కారణ రూపిణియగు గాయత్రి చిద్దర్పణమందు ప్రతిఫలించి అభాసముగ జగదాకారమును పొందుచున్నట్లు దోచినను బింబ స్వరూపమునందెట్టి వికారమును లేక ప్రకాశించుచుండును.

పూర్ణాహంతయగు గాయత్రియొక్క చిత్ప్రకాశమగు స్వాత్మ రూపమునందొక పాదశక్తివలన, ప్రధాన కారణమైన యహంకార తత్వ ప్రకాశమగుజగత్తును సృజియించును, నా యహంతాతత్వ ప్రకాశమగు జగత్తును సృజియించును. నా యహంతాతత్వ ప్రకాశమునందు జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములను నాల్గవస్థలు గలిగియుండును. అందు జాగ్రదాది త్రివిధావస్థలయందలి సర్వ వ్యవహారములకు అహంకారాధిష్ఠానమైన అవ్యక్త మను పేరుగల మాయ యనబడును. ఈ అవ్యక్త మను పేరుగల మాయ యనబడును. ఈ అవ్యక్త సంభవమగు నహంకారము కొంత లోపించి సూక్ష్మాహంకార చిదంశమును, సదాశివుడనియు, ఈశ్వరుడనియు కొందరు తత్త్వవేత్తలు దెల్పుచుండెదరు.

సదాశివాదులీ యవ్యక్తమను మాయను తమ కన్యముగా భావించినను తమయందు పుట్టి లయించుచుండునని తలంచి సాక్షిరూపులై ప్రకాశించుచుందురు. అందువలన బ్రహ్మ, విష్ణు, రుద్రాది నామములచే జగద్వ్యవహారములు జరుగుచుండును. దర్పణ ప్రతిబింబ దృశ్యమునకు దర్పణముకంటె నన్యమగు నాధారము లేనట్లు, సర్వ బ్రహ్మాండ సృష్టికి,

చిద్దర్పణముకంటె నన్యమగు నాధారమెచటను గాన్పించదు. దృశ్యరూప సంయోగ హీనమందు దడ్పణము నిర్మలముగా ప్రకాశించునట్లు చిద్దర్పణ పరిణామ జ్ఞానాభావమందు శుద్ధ చితి నిర్మలముగా ప్రకాశించును. గాన సదా శాశ్వతమును సర్వాధారమును తత్ప్రకాశమై జ్ఞానరూపమగునది గాయత్రి యగుచున్నది. యా పరచితి సదా ఆనందరూపమగునుగాని. విషయ సుఖములను గోరునదికాదు. దేహాభిమానముగల అజ్ఞానులు కాంతా, కనకాది, దేహేంద్రియ విషయ సుఖములయందు తత్పరత్వము గలిగియుందురు. అంతఃకరణ చిద్దర్పణ ప్రతిబింబావభాసము దర్పణావ భాసమువలె నేత్రానందమగుచున్నను సత్యము గానియట్లు. జగత్తునందలి సర్వ భూతములు, దృక్కునందు దృశ్యమగుచుండునుగాని వాస్తవము గాదు దేహి. దేహేంద్రియాదులచే బహువిధ వ్యాపారములు జరుగు చున్నను సాక్షియగు తానేకరూపముచే ప్రకాశించు విధమున, చరాచర మగు జగత్తునందలి సర్వభూతాంతఃకరణమునందు ప్రతిఫలించి అహంతా రూపమున ప్రకాశించు పరచితి నేకరూపముచే సాక్షియై ప్రకాశించు చుండును

సద సత్తుల కాధారమగు పంచితి జగదాధారమగుటచే దృగ్రూప మగు పరచితియొక్క దృశ్యభావనయే జగద్రూపమగునుగాని, కేవల శూన్యముగాదు. ఘటాదుల కాధారమగు మృత్తులేనియెడల ఘటాదులు సంభవింపని విధమున, అంతఃకరణ ప్రతిబింబిత చితి అవిచ్ఛిన్నముగ ప్రకాశించునంతవరకు జగత్తు శూన్యముగాదు. కార్యమగు జగత్ప్రకా శము దోచినను, దోపకున్నను కారణమగు పరచితి సదా ప్రకాశించుచుం డును గాన. జగత్తిస్థిర మనవలెగాని. శూన్యముగాదు. కార్యమగు జగత్తు అస్థిరమైనను. కారణమగుపరచితి యునికి తెలుసుకొనుటకు జగత్తేయాధార

మగును. జగద్భ్రాంతిగల అజ్ఞానులకు దృశ్య జగత్తు దృగూప. పర చితికంటె అన్యముగ దోచినను పరతత్త్వ జ్ఞానసిద్ధియం దేకాకారముగ యుండును. వాసనా సహితమగు చిత్త వృత్తులయం దభిమానము గల ముముక్షువు తన యసంగ చిద్రూపజ్ఞాన సాధనమగు యోగము నవలం బించుట శ్రేష్ఠమగును.

చిత్ప్రతిబింబిత జగద్వ్యవహారమెల్ల చిత్ప్రకాశజ్ఞాన సంభవమగు టచే మిథ్యయైనను ప్రతిబింబాధారమగు బింబరూప పరచితి శాశ్వతమును స్వతంత్రమును సర్వ వ్యాపకము గాదగుటచే, శాశ్వతమగును గావి శూన్యముగాదు. అట్లు తెలుసుకొనుటయే సుజ్ఞానమనబడును.

జగత్తునందు బంధమోక్షాది వ్యవహార సత్యత్వధర్మములా పరచితి వలన కల్పితము లగుచుండును. స్వజాతి, విజాతీయ, భేదశూన్యమై సదా సాక్షివలె ప్రకాశించుచుండుటవలన, గాయత్రి యనియు, తురీయావస్థ యందుండుటవలన, తురీయ యనియు, త్రిపురములను ప్రకాశింపజేయు చుండుట వలన త్రిపురాయనియు అనంతశక్తియుతమై అనంత రూప ములచే ప్రకాశించు తన యదార్థతత్త్వమును తెలుసుకొన్నవారికి తనయం దైక్యమును తెలియని వారికి తెలియబడియున్న జగద్వ్యహార సుఖమును కలుగజేయుచుండును.

ఈ విధముగ స్వప్రకాశ జ్ఞానముచే విహరించుచు తన జడశక్తి సంభవమగు జడరూపములను, యజడశక్తి ప్రభావమువలన చైతన్యప్రకా శములగజేసి అందు సంభవమగు విచిత్ర వినోదము సాక్షియై నవలోకిం చుచు జ్ఞానశక్తిచే సర్వ వ్యాపకమగు యా గాయత్రి నుపాసింపు యను

గ్రహపాత్రముగాని మానవజన్మ పశుతుల్యమగును. అజ్ఞానులు కర్మచేయు నప్పుడెట్టి కర్తవ్యము గలవారై యుందురో అట్టి కర్తవ్యమే ఫలానుభవ కాలమందును పొందుచుందురు. జ్ఞానులు పూర్వకాలమందు కర్తవ్యముచే కర్మ లాచరించినను ఫలానుభవ కాలమందు పరేచ్ఛచే ననుభవించుచుండె దరు. ప్రారబ్ధ రూప వాసనాపంక, కళంకమగు చిత్తమును సత్పురుషాను గ్రహ సంభవమగు యోగ జ్ఞానసిద్ధివలన, నిగ్రహించి సగుణ, నిర్గుణ తత్వములచే ప్రకాశించు గాయత్రి స్వరూప సాక్షాత్కారము గాంచుట ముముక్షువునకు కర్తవ్యమగును. సాక్షాత్కార రూపము ప్రతిఫలించి యున్న బుద్ధి మాలిన్యములు నివారించుటకు యోగము ముఖ్యసాధన మగును. త్రిగుణ రూప మాలిన్యముగల బుద్ధియందు ప్రతిఫలించిన పర చితి గుణసహితమై అంతఃకరణ రూపమును దాల్చి జగదాకారమగుటచే స్వరూప సాక్షాత్కారము లభించనేరదు. అంతఃకరణ మాలిన్యముగల అజ్ఞానులు బహుజన్మ సంభవమగు ఇంద్రియ కృత విషయసుఖములయం దాశగల వాసనాబల మతిశయించి యుండుటచే నిర్విషయానంద దాయక మగు పరచితి సాక్షాత్కార జనిత బ్రహ్మానందసుఖ మనుభవించుటకు ఇచ్ఛయైనను సంభవించదు.

# శాస్త్రార్థ గ్రహణము

గాయత్రి దృగ్దృశ్యములచే ప్రకాశించుచు వ్యవహార సత్యత్వమును బంధమోక్షములను అందుకుతగిన, సాధక సాధనములను దృశ్య జగత్తును పాలించదగిన త్రిమూర్తులను కల్పించి జగత్తును భావింపజేయుచుండును. కార్యరూప జగత్తు నొకతరి లేకపోవుట సంభవించినను కారణరూపమగు

పరచితి, అచలమైశాశ్వతమగుట చేతను, జాగ్రత్స్వప్నాద్యవస్థల అందలి వ్యవహారములు మారుచున్నను నా యవస్థల కాధారమగు దేహము మారని యట్లు, తుర్యాద్యవస్థలు మారుచున్నను అవస్థాసాక్షియను పరచితి నేక రూపముగ ప్రకాశించుచు తనయందు తత్పరత్వము గలవారికి మోక్షమును విషయవాంఛగల వారికి జన్మపరంపరల నొసగుచుండును.

ఓ పరశురామా! పూర్వము నారదునికొరకు హరితాయన మహాఋషి చెప్పిన బ్రహ్మ విద్యయందలి రాజగుహ్యమును చెప్పెద. యా రహస్యమును సావధానముచే గ్రహించినయడల తెలియదగిన మరియొకటి మిగిలియుండక, సర్వ సందేహములు నశించి శాంతిని పొందెదవు గాన, నిర్మల బుద్ధిచే శ్రవణము చేయుమనగా, పరశురాముడు:-

గురూత్తమా! శాంతి పదమగు మోక్షమునుగోరి సర్వమును త్యాగముచేసి తమ యాశ్రయము గోరియున్న నాకు సావధానముగాక, మరియొక ధ్యాస యెట్లుండును. సావధాన చిత్తముగల నాకు యా రహస్యము వినుపింపుమని వేడగా, దత్తాత్రేయులీ విధముగ జెప్ప నారంభించిరి.

ఓ పరశురామా! కార్యరూపమగు జగత్పరిణామమును గురించియు కార్యరూపమైన అంతఃకరణ ప్రతిబింబ పరచితి జ్ఞాన ప్రకాశము గురించియు ఎన్ని పర్యాయములు బోధించినను సందేహ నివృత్తి గాక, జగత్సత్యత్వ భ్రాంతిని పొందుచున్నావు. గావున, యీచెప్పబోవు ధర్మ రహస్యమును నిర్మల బుద్ధిచే విచారించుము. జగత్తునందు దృశ్యమగు శబ్దాది విషయములు అసత్యములు జడములగుటచేతను, దృగ్రూపమగు సత్య

మైన పరచితికిని, దృశ్యమగు అసత్యమైన జగత్తునకును సంబంధము మాయా కల్పిత మగునుగాని వాస్తవము కాదు. జడమగు భౌతిక నిర్మిత మైన అంతఃకరణ యందు అహంకారతత్వ ప్రతిబింబ చిత్ప్రకాశమగు క్షర పురుషుడు ప్రత్యక్షానుమాన ప్రమాణాది ధర్మ తత్త్వజ్ఞుడగుటచే. యీ క్షర పురుషాహంకార తత్వమునందు త్రిగుణ సహితమగు జగత్తుయున్న గుణ రహితమగు పరచితియు, విరుద్ధధర్మములు గలవైనను ప్రతిఫలించి యుండుటచే పరస్పర విరుద్ధరూప ప్రకాశములగు చంద్రబింబ జపాకుసుమము లొక నిర్మల దర్పణమందు ప్రతిఫలించి నొక వస్తువుయొక్క రూప వికారములు మరియొక వస్తువునందును రెండు వస్తువుల యొక్కల ధర్మములు దర్పణమందును భాసించుటచే చూచువారలకు చంద్రబింబమునందు జపా పుష్పముయొక్క రక్త వర్ణము దోచుచుండుటచే చంద్రబింబ మెర్రగా నున్నదని వ్యవహరించుట సహజమైనట్లు దృశ్యమగు జగత్తునందుగల గుణ దోషములు దృగ్రూపమగు నిర్గుణ పరచితియందు దోచుట అహంకార దర్పణ ప్రతిబింబిత. తదాత్మ్య సంభవముగాని సత్యముకాదు.

కర్తృత్వ భోక్తృత్వాదిధర్మముల నాత్మయగునహంకార, పురుష లక్షణములగునుగాని, నిష్క్రియయు, నిర్వికారియు అసంగ చిద్రూపియు నగు పరచితియందు భ్రాంతిచే నారోపితము లగుచున్నవి. అంతఃకరణ మైన అహంకార తత్త్వమునందు ప్రతిఫలించిన, నిర్గుణమగు నేకాకార మైన పరచితి అహంకార తత్త్వజ్ఞాన ప్రకాశమువలన, కర్తృత్వ, భోక్తృత్వాది గుణసహిత లక్షణములచే క్షరపురుష డనబడుచున్నాడు. ఈ క్షర పురుషాశ్రమువలననే దృగ్రూప జ్ఞాన సహితమగు దృశ్య ప్రపంచాభాస ప్రకాశము విస్తరిల్లుచుండును.

చిద్రూపాత్మ నొక్కరూపమైనను. నీ యహంకార తత్త్వము లనేక మగుటచే అనేకములగు క్షరపురుషాకారము లాభాసముగ దోచు చుండును. దృక్కునకాధారమగు క్షరపురుషాకారము [illegible]ములగుటచే దృక్సంభవమగు జగత్తుయొక్క వ్యాపక, మక్షయ మగుచుండును. సూర్యుడు స్వస్థానమందు చలించకయున్నను అనేకములగు జలపూరిత కుంభములయం దనేకములై ప్రతిఫలించి వాయా ఘటపూరిత జల మాలిన్య దోషములు గలిగియున్నట్లు దోచు విధమున. చిదాత్మ అసంగ చిద్రూపముచే నేకాకారముగ నిర్మలమైయున్నను అనేకాంతఃకరణల యందు ప్రతిఫలించి అనేకములై దోచును. వాయా అంతఃకరణ ధర్మము లగు ధ్యానధారణాది సత్క్రియాది ధర్మములును రజ. స్తమోగుణాది. కర్తృత్వాది. అహంకార లక్షణములు గలిగియున్నట్లు భాస మాత్రముగ దోచుచుండును.

అంతఃకర్ణ రూపమగు అహంకార తత్త్వము సత్తయిన చిదాత్మను అసత్తయిన జగత్తును ప్రతిఫలించదగిన అవ్యక్తావర్ణ రూపగ్రంథి యగు చున్నది. అందువలన దర్పణరూపమగు నహంకార తత్త్వమాహాత్మ్యము వలన, అనాత్మయగు జగత్తునందుగల సుఖదుఃఖాది గుణ దోషములను చిదాత్మయం దాభాసముగ ప్రకాశింప జేయుచుండును. జడ స్వభావమగు అంతఃకరణయందు ద్రష్టత్వము సంభవించదు. అంతఃకరణ ప్రతిబింబిత చిద్రూప జ్ఞానసంభవమగు క్షరపురుషునియందు ద్రష్టత్వము సంభ వించును.

జ్ఞానాశ్రియమగు క్షర పురుష దృక్కువలన, దృశ్యమగు జగత్తు దోచుచుండును దృగ్దృశ్య గోచరమగు జగత్తుకును, చిద్రూప గాయత్రికి

నెట్టి సంబంధము లేకపోయినను అహంకార తత్త్వ సంభవమగు క్షర పురుషాజ్ఞాన గ్రం. మే సర్వానర్థములు చిదాత్మయందారోపిత మగు చున్నది.

గావున అహంశబ్దార్థమునందుగల గౌణ లక్షణమైన కర్తృత్వక్షర పురుష వ్యవహారలక్షణము లాభాసములవి. నిగ్రహించ తగును. ముఖ్య వృత్తి వాచామ గోచరమగుటచే నుపదేశయోగ్యము గాకుండుట వలన. అహంశబ్దమునకు లాక్షణికార్థము ననుసరించి అక్షర పురుష లక్షణమైన ప్రత్యగాత్మయగు చిదాత్మ ధర్మమును స్వీకరించుట యుచితమగును. లక్షణావృత్తి ననుసరించి చిదాత్మ నహంకార తత్త్వజ్ఞాన ప్రకాశముచే శబ్ద స్పర్శాది సర్వేంద్రియ దేహ మనోధర్మముల నెరుంగుచు అతి సూక్ష్మ జ్ఞానముచే అంతఃకరణాది సర్వవృత్తులనెరుంగుచు తానుగాదని, వివేధించి తాను మిగులుచున్నది అందువలన అంతఃకరణ ప్రకాశమగు చిదాత్మను లక్షణావృత్తిచేత అహంశబ్దము నిరూపించుచున్నది.

లాక్షణికార్థాధిష్ఠానమగు నహంశబ్దముచే నిరూపించబడిన కర్తృత్వరహితాసంగ చిద్రూపజ్ఞానమే సదసత్తుల కతీతమగు ముఖ్యార్థ పరతత్వ లక్ష్యమై యుండును. అహంకార సహితమగు ఆత్మ అహం శబ్దమునకు వాచ్యార్థ మగును. క్షేత్ర క్షేత్రజ్ఞులకు లేక సదసత్తులకు నతీతమై భూమయను సర్వవ్యాపకమగు ముఖ్యార్థమైన పరమపద జ్ఞానమునకు లక్ష్యార్థ మగును. అతి వ్యాపకార్థ రూపమైన భూమపద గ్రాహ్యమసాధ్య మగుటచే అంతఃకరణ ప్రతిబింబ ఆసంగ చిద్రూపాత్మను కర్తృత్వాది లక్షణమైన. అహం శబ్దార్థముచే నంగీకరించ అహంకారాది సాక్షిత్వ ధర్మము చిద్రూపాత్మయందు ఆభాసకల్పితములవి తెలుసుకొని

తగియున్నది. పరచితి నిత్యమును పరిణామాదివికారశూన్యమును సర్వ వ్యాపకము గలదైయున్నను. అహంకారతత్వ ప్రతిబింబిత ప్రకాశసంభవ దోషమువలన కర్తృత్వ భోక్తృత్వాది దోషములారోపితము లగుచుండును గాని యదార్థములు గావు.

త్రివిధ లక్షణములచే ప్రకాశించు పరచితి యొక్క గౌణాహంకార ధర్మమైన, కర్తృత్వాది జన్మ సంసారప్రవృత్తి లక్షణముల నుపేక్షిం (త్యాగముచేసి) లాక్షణాప్రవృత్తమగు సాక్షిత్వాది ధర్మముల నంగీకరించుచు నిర్వికార, నిరంజనాది భూమ, పద. లక్ష్యార్థమును గ్రహించుట ఉత్తమ జ్ఞాన లక్షణమగును. అవిద్యా కల్పితమగు ప్రమాణ ప్రమేయ ధర్మముగల ప్రమాత లక్షణములు చిదాత్మయందారోపితము లగుచుండును. అంతఃకరణప్రతిబింబిత, అసంగ చిదాత్మ స్వయముగ, కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములు లేనిదై సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యమగుచు సర్వ పదార్థాంతరమై ప్రకాశించుచున్నను, మాయా విద్యాద్యుపాధి జనిత జ్ఞాన ప్రభావమువలన, జీవత్వ ఈశ్వరత్వాది ధర్మములైన కర్తృత్వ సాక్షిత్వాది ధర్మములారోపితమై నాభాసముగ దోచుచుండును.

ఈ విధముగా దత్తాత్రేయులవారు చెప్పగా విని పరశురాముడు ఈ విధముగా ప్రశ్నించుచున్నారు.

ఇరువదవ అధ్యాయము సమాప్తము.



# ఇరవది ఒకటవ అధ్యాయము

ఓ గురువర్యా! తమరు మొదటినుండి ఇప్పటివరకు తెలియపర చిన విజ్ఞానమంతయు తిరిగి క్లుప్తముగా చెప్పుటకు ప్రార్థించుచున్నాను ఎందుకనగా అది అంతయు జ్ఞప్తియందుంచుకొన ధ్యానమునకు సహాకారి ణిగాయుంచుకొనవలసి యున్నది. ఆ ప్రకారము ప్రశ్నించబడి అత్రి కుమారుడు రామునితో ఇట్లు చెప్పెను.

ఓ పరశురామా! దీని సారమంతయు చెప్పెద వినుము. ఆ పర మేశ్వరి యగు గాయత్రి పూర్ణహంత కలిగి సర్వాధికారము కలిగి మార్పు లేనిదైనను ఆమె మాయా ప్రభావమున ఎల్లప్పుడునూ అసాధ్యమైన జగ మును కనపర్చును అ మాయాశక్తియే స్వతంత్ర కూడా అనబడును. అది ఈ ప్రకారము సంభవమగును నిరాకార స్వరూపిణి, పరమహంత మాయయగు అపరాచితి ఆమెయొక్క స్వతంత్రతవల్ల తన స్వరూపమే రెండు విధములుగా కనపరచును ఆమె స్వరూపముయొక్క కొంత భాగ మందు అపూర్ణహంత ప్రకటితమైనప్పుడు రెండవ భాగమైన అహంత శూన్యమై యుండును. అప్పుడు ఈ భాగము పూర్ణహంతకు అవ్యక్తము లేక బయలువలె నుండును. అపూర్ణ హంతగల ఆ చిదాంశమే సదాశివ తత్వమనబడును.

అ సదాశివుడు తనకంటె అవ్యక్తము వేరుగాచూచుచున్నను యెల్ల ప్పుడూ "ఇది నేను" అని తలంచుచుండును. తదుపరి సదాశివుడే తన స్వతంత్రతవల్ల జగత్తురక్షించుటకు మహేశుడగును. మరియు "ఈ అవ్య క్తము నా శరీరము అవ్యక్త రూపముతోనే యున్నాను" అని నిరంతరము

తలచుకొనుటవల్ల కూడా మహేశ్వరుడగును. ఆ ప్రకారము అవ్యక్త ముతో ఏకీభావము పొందిన ఈశ్వరుడు బ్రహ్మ, విష్ణు, శివ యను త్రిమూర్త్యాత్మకముగా మారి అనేక బ్రహ్మాండముల నుత్పత్తికి కారణమగు చున్నాడు. ఈ బ్రహ్మాండములన్నియు లయింపచేయు రుద్రులు అనేక మంది ఉన్నారు. ఈ జగత్తు ఇట్టిది. ఓ వరకులరామా! ఇట్టి జగత్తు అద్ద మందు ప్రతిబింబమువలెనున్నది. దానికి పుట్టుక యేమియు లేదు. పరాచితి అపూర్ణాహంతలతో నిండియున్నను ఆమె యెప్పుడూ పూర్ణ అహంభావ రూపముతోనే యుండును.

ఇది ఉదాహరణతో స్పష్టపరచెదను. రామా! నీవు నీయొక్క అవ యవములగు కండ్లు వగైరాలతో విడివిడిగా సంబంధము కలగచేసుకుని అవి నావిఅనుకొనుచు మొత్తము శరీరమందెట్లు అహంభావనకలిగి యున్నావో ఆ ప్రకారమే ఆగాయత్రి అపూర్ణాహంతలగు సదాశివుడు మొదలగా అనేక జీవరాశులతో కూడియున్నను పూర్ణాహంతయగు అఖండ స్వరూపమై యున్నది. పూర్ణ, అహంతరూపమైన "చిత్తు" అపూర్ణ హంతలవలె ఈ ప్రకారము ప్రకటితమగుచున్నది. ఏ ప్రకా రము నీవు నీ శరీరముతో తాదాత్మ్యము కలిగియున్నను రూప ములు, రుచులు వగైరాలు నీయంత నీవు తెలిసికొనలేవి కారణమున జ్ఞానేంద్రియములతో తాదాత్మ్యము పొంది ఎట్లు వాని ననుభ చున్నావో ఆ ప్రకారము స్వామియగు సదాశివుడు కూడా సర్వాంత ర్యామియైనను బ్రహ్మ మొదలు పిపీలకము వరకుగల జీవులయొక్క కూడి తెలిసికొనెడివాడు కర్త యగుచున్నాడు. ఈ శరీరము వాటికి ఆధారముగాయున్న నిర్వికల్పము, విషయము, కర్తృ నే ఎట్లుండునో ఆ ప్రకారమే సంవిత్తగు "పరా" అన్ని జగ

త్తులకు ఆధారమైనను ఆమె తెలిసికొనునని కానీ భేద భావనలు కలుగ చేయునది కానీ యెన్నడూ కాదు.

ఈ జగత్తునందు ప్రతి వస్తువూ అద్దములో ప్రతిబింబమువలె ఆమె స్వతంత్రతవల్ల పుట్టింపబడి ఆమెయందే ప్రకాశించును. ప్రతిబింబములు అద్దముకంటె వేరెట్లు కావో ఈ జగత్తుకూడా ఆమె యొక్క రూపమే. ఇక్కడ నీవు, నేను, ఇతరులు అని తెలిసికొను అజ్ఞానులందరు అట్టి దృశ్యములు తుడిచివేయబడినప్పుడు ఆమె స్వరూపమే యగుదురు. ఏ ప్రకారము అద్దమునందు ప్రతిబింబించు కుండలు వగైరాలు ఆ కుండలు తీసివేసిన తోడనే ఇదివరకున్న కుండల ప్రతిబింబములన్నియు పోయి అద్దము నిర్మలముగా నుండునో ఆ ప్రకారము సంకల్ప మాత్రమున వివిధ రూపములుగా కనిపించు దృశ్యములన్నియు సంకల్ప రాహిత్యమైన ప్పుడు అద్వైత రూపమగు "సంవిత్తు" (ఆత్మ స్వరూపిణి) మాత్రమే నిలచియుండును.

బాధ అనునది లేనందున ఆమె పూర్ణ ఆనంద స్వరూపిణి. అందు వలననే ఆమె అందరివలన కోరబడుచున్నది. సకలచరాచరముల ఆనం దము యొక్క మొత్తపు స్వరూపము ఆమెయే. అన్ని జీవులు ఆమెను కోరెదరు. కనుక ఆ ఆత్మ స్వరూపము ఆనందము. ఎవరునూ బాధను కోరరు. కనుక ఈ శరీరము వగైరాలు ఎందుకొరకు నిలచియున్నవో ఆ యుద్దేశ్యములలో కొంతభాగమగు యింద్రియ సౌఖ్యములు ఆత్మ స్వరూపముయొక్క పరంపరానందమై అట్టి ఆనందముయొక్క బరువు నెత్తినుండి దింపు నమయమందును, గాఢ సుషుప్తియందును ప్రకటిత మగుచుండును. బుద్ధిహీనులు ఆత్మ యందుగల ఆనందము తెలిసికొన